## సరదాగా....

### అంటే ఏమిటి?

**టిం**కూ స్కూలు నుంచి వచ్చి, ఫ్రెషప్ అయ్యాడు. తల్లి వంటగదిలో ఉంది. తండ్రి హాల్లో టీవీ చూస్తున్నాడు. టింకూ తండ్రి దగ్గరకు వచ్చి నాన్నా 'నేటి బాలలే రేపటి పౌరులు' అంటే ఏమిటి? అని అడిగాడు. ఇంతలో ఇస్త్రీ బట్టలవాడు వచ్చి, అమ్మా ఇస్త్రీ బట్టలు అన్నాడు. తండ్రి వాడి వంకా టింకూ వంకా చూసి 'నేటి బట్టలే రేపటి స్టీలు గిన్నెలు' అనుకుంటూ లోపలికి వెళ్ళాడు ఇస్త్రీకి ఇవ్వాల్సిన బట్టలు తేవడానికి.

### ఒక ప్రశ్న?

**తా**తయ్య కబుర్లు... బలే ముచ్చటగా ఉంటాయవి. హాయి గొలుపుతాయి. అందుకే ఆ కబుర్లంటే మనవలు, మనవరాళ్ళందరికీ ఇష్టం. మంచిమంచి కథలు, రాజులు, రాణుల విశేషాలు ఎన్నో ఉంటాయి ఆ కబుర్లలో. వాటి కోసమే పండగలొచ్చినా, సెలవులొచ్చినా తాతయ్య దగ్గర వాలిపోతుంటారు. జ్ఞానం, లోకజ్ఞానం కబుర్లతోపాటు, మేధస్సును పెంచే గజిబిజి కబుర్లతో పిల్లల్ని ప్రపంచ విహారం చేయిస్తుంటారా తాతయ్య. వేసవి సెలవులు ఇచ్చారేమో, వెంటనే తాతగారింట్లో వాలారు పిల్లలందరూ. సరదాగా ఆడుకోవడం, నానమ్మ చేసిన పిండివంటల పనిపట్టడం, తాతయ్య కబుర్లు వినడం... ఇదే వారి దినచర్య! ఆరోజు సాయంత్రం కూడా ఎప్పట్లాగే తాతయ్య కబుర్లు మొదలయ్యాయి. తాతయ్య "ఈ ఐదారురోజుల్నించీ మనం కథలు, కాలక్షేపాలతో గడిపేశాం కదా! ఇవాళ మాత్రం మీకో గజిబిజి కబురు చెపుతాను. ఎవరైతే ముందుగా ఆ కబురుకి సరైన పరిష్కారం చూపిస్తారో వారికి లీడర్‌షిప్ అవార్డు ఇస్తానన్నమాట" అన్నారు. సరే సరే అన్నారు పిల్లలందరూ. తాతయ్య తెల్లకాగితాల నోటుబుక్కు తెచ్చి, అందులో కారుబొమ్మ గీశారు. పిల్లలందరికీ ఆ బొమ్మ చూపించి ఈ కారు ఎటువైపు వెళుతుందో చెప్పండి చూద్దాం అన్నారు. పిల్లలందరూ బొమ్మ వైపు ఆసక్తిగా చూశారు. ఒక మనవరాలు ఆ కారు ఎటుపోతుందో చెప్పేసి లీడర్‌షిప్ అవార్డు గెలుచుకుంది. మరి మీకు కూడా తాతయ్య గీచిన బొమ్మ చూపిస్తున్నాం. అది చూసి కారు ఎటు వెళుతుందో చెప్పగలరేమో ప్రయత్నించండి.

**సమాధానం**

బొమ్మలో కారుకి టైర్లు లేవు కాబట్టి కారు ఎటూ కదలదు.

కుమారి నగ్న సినీతార

మీరేం దిగులు పడకండి నిర్మాతగారూ! ఇంట్లో ఎవరూ లేకపోతేనే మాత్రం మా అమ్మాయి చీర కట్టుకోవడానికి ప్రయత్నం చేస్తుంది...

స్కూటరు మరచిపోయి వెళ్ళారా!? తీసుకెళ్ళడానికి వచ్చారా!! ఇంతకీ మీరెవరు సార్!!

మా బ్యాంక్

కస్టమర్ కేరేనా అల్లో!!? గంట నుండి ట్రై చేస్తున్నాను... లాకర్ తెరుచుకోవడం లేదు... పాస్‌వర్డు చెబుతావా!!?





ముఖచిత్రం: సాయిపల్లవి
ఫొటో: గోపీకృష్ణ


**రచనలు, కథలు పంపవలసిన చిరునామా**
*నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33.* email: navyaweekly@andhrajyothy.com





### నమ్మకం

అర్ధరాత్రి. ఓ దుకాణంలోనికి చొరబడ్డాడో దొంగ. ఆ దుకాణంలోని సేఫ్‌ని చూశాడు. పగలగొడదామనుకున్నంతలో దానికి అంటించి ఉన్న స్లిప్‌ను చదివాడిలా.

మీరు సుత్తులూ, రంపాలూ వాడి, లేదంటే డైనమైట్‌తో పేల్చి ఈ సేఫ్‌ను పగలగొట్టవద్దు. ఎంచక్కా దీని హేండిల్ తిప్పండి చాలు, తెరుచుకుంటుంది.

బాగుందనుకున్నాడు దొంగ. హేండిల్ తిప్పాడు. అంతే! పైనుంచి పెద్ద ఇసుకబస్తావచ్చి మీదపడింది. తర్వాత సైరన్ మోగింది. ఆ తర్వాత లైట్లు వెలిగాయి. ఏం జరుగుతోందో తెలుసుకునే లోపే దుకాణం యజమానిసహా పోలీసులు రంగప్రవేశం చేశారు. నడుం విరిగి మూలుగుతున్న ఇసుకబస్తా కింది దొంగను పట్టుకున్నారు. స్ట్రెచర్‌పై పడుకోబెట్టి వాణ్ణి ఆసుపత్రికి తరలించారు. ఆసుపత్రికి తీసుకుని వెళ్తుంటే తనలో తాను అనుకున్నాడిలా దొంగ.

మనుషులమీద నాకున్న నమ్మకం పూర్తిగా పోయింది.

### రెండుకోరికలు

**ఒ**క ఇండియన్, ఒక చైనీయుడు, ఒక పాకిస్తానీ ముగ్గురూ సౌదీ అరేబియా విమానంలో ప్రయాణిస్తూ మద్యం సేవిస్తూ పట్టుబడ్డారు. చేసిన నేరానికిగాను వారికి ఒకొక్కరికీ ఇరవై కొరడాదెబ్బలు శిక్ష విధించారు అధికారులు. శిక్షను అమలుచేసే షేక్‌వచ్చి ప్రకటించాడిలా.

"ఈ రోజు నా భార్య బర్త్‌డే కానుకగా శిక్ష విధించే ముందుగా మీరు ఒకొక్కరూ ఒకొక్క కోరిక కోరుకోవచ్చు."

వెంటనే చైనీయుడు తెలివిగా అన్నాడిలా.

"అయితే నా వీపుకి ఓ దిండు కట్టండి."

దిండు కడితే కొరడాదెబ్బలు పెద్దగా తగలవని భావించాడతను. చైనీయుడు కోరుకున్నట్టుగానే దిండు కట్టి కొరడాతో కొట్టారు. పదిదెబ్బలకే దిండు చిరిగిపోయింది. తర్వాత పదిదెబ్బలకి అతను స్పృహతప్పాడు. పాకిస్తానీ వంతు వచ్చిందిప్పుడు. అతను అతి తెలివిగా తనకి రెండుదిళ్ళు కట్టమన్నాడు. కట్టారు. పదిహేనుదెబ్బలకి రెండుదిళ్ళూ చిరిగిపోయాయి. తర్వాతి అయిదుదెబ్బలనూ ఓర్చుకోవడం అతని వల్ల కాలేదు. కళ్ళు తిరిగి తూలిపడ్డాడు. ఇండియన్ వంతు వచ్చిందిప్పుడు. అతన్ని చూస్తూ షేక్ అన్నాడిలా.

"మీ దేశం అన్నా, మీ సంస్కృతి అన్నా నాకు చాలా ఇష్టం. నువ్వు రెండు కోరికలు కోరుకోవచ్చు. కోరుకో."

"అయితే దయచేసి నా శిక్షను పెంచండిసార్! నన్ను వందదెబ్బలు కొట్టండి." అన్నాడు ఇండియన్.

"బాగా ధైర్యవంతుడిలా ఉన్నావే! గుడ్! నీ రెండో కోరిక చెప్పు." అడిగాడు షేక్.

"నా వీపుకి ఆ పాకిస్తానీని కట్టండి చాలు." అన్నాడు ఇండియన్.

–వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి
బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 14 సంచిక: 25
23-8-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



# మొదటి పేజి

## ప్లీజ్! చెప్పండి సార్!

అగ్రహారం రైల్వేస్టేషన్లో మీరెప్పుడైనా కుంటికామాక్షిని చూశారా? చూళ్ళేదా? అయితే చూపిస్తాను, చూడండి! కుంటికామాక్షి తెల్లగా, సన్నగా ఉంటుంది. పెద్దపెద్ద కళ్ళు దానివి. పెద్దజుత్తు కూడా. జడ వేసిందంటే నిగనిగలాడుతూ నల్లతాచులా ఉంటుందది. ప్లాట్‌ఫారం ఆ చివర రావిచెట్టు ఉందా? ఆ చెట్టు కింద ఉన్నదే, అదే దాని గుడిసె. ఆ గుడిసెలో కామాక్షి, దానితోపాటు రాజూ ఉంటున్నారు. రాజంటే మగాడనో, మొగుడనో అనుకుంటున్నారేమో! కాదు, రాజంటే కుక్కపిల్ల. ఎర్రగా, బొద్దుగా ఉంటుంది. దానికీ కామాక్షిలాగే ఓ కాలు లేదు. కుంటిరాజుగాడు అంటారు దాన్ని. రాజుగా అంటే పలకదది. ఒరే కుంటి రాజూ అంటే చాలు! మోర ఎత్తి పెట్టి మరీ భౌమంటుంది. కామాక్షికీ రాజుగాడికీ ఎలా కుదిరిందంటే... ఓ రాత్రివేళ సన్నగా అరుస్తూ, మూలుగుతోంటే కుక్కపిల్లకేదో మూడిందనుకుని, గుడిసెలోంచి బయటికి వచ్చి చూసింది కామాక్షి. అనుకున్నట్టే విరిగిన కాలుని ప్లాట్‌ఫారం మీద ఈడుస్తూ కనిపించిందో కుక్కపిల్ల. అయ్యయ్యో అని, ఒంటి కాలుమీదే పరుగుదీసి, కుక్కపిల్లను చేతుల్లోకి తీసుకుంది కామాక్షి. కడిగి కట్టుకట్టింది. తెల్లారి చూసి, ఈ కుక్కపిల్ల నీకాడ సెటిలయిందా? రేతిరి దిక్కూ మొక్కూ లేక రైలు డబ్బాలో తిరుగుతోంటే జాలిపడి, నానే తీసుకెల్దాఁవనుకున్నాను, కానింతలోనే కుర్రాడెవడో కాలితో తంతే ఎగిరి కిందపడింది. కాలి రుసుకుంది. అప్పుడిక మనకెందుకని మానుకున్నాను అన్నాడు పిన్నులూ, పెన్నులూ అమ్ముకునే అప్పారావు. మంచిపని చేశావు ముష్టినాయాల అన్నది కామాక్షి. కసితీరా తిట్టాననుకున్నది.

అప్పారావుగాడికి పిల్లల్లేరు. ఏ అనాథనో, కుక్కపిల్లనో పెంచుకుందాఁవని వాడికెప్పటినుంచో చిన్నకోరిక. కుక్కపిల్లను పెంచుకో! చేస్తేగిస్తే కప్పుకున్న నీ దుప్పటి మాత్రమే పాడుచేస్తుందది. అదే పిల్లాణ్ణి పెంచుకున్నావనుకో, ఆడు నిప్పెట్టి మరీ నీ బతుకును పాడు చేస్తాడు అంటుంది కామాక్షి. కుక్కకి కార్లు అక్కరలేదు. పెద్దపెద్ద బంగళాలక్కరలేదు. గొప్పగొప్పదుస్తులక్కర లేదు. దాని మెడకో చైనూ, మన చేతిలో చిన్నకర్రా ఉంటే చాలంటుంది కామాక్షి. డబ్బున్నోడా పేదోడా అన్న తేడా లేదు కుక్కకి. ఈడు తెలివైనోడా? తెలివితక్కువోడా అన్నది కూడా పట్టించుకోదు. అందంగా ఉన్నాడా? లేడా అన్నది కూడా దానికి అనవసరం. దానికి తెలిసిందల్లా ఒక్కటే! ప్రేమ! నువ్వు ఇంత ప్రేమిస్తే అది అంత ప్రేమిస్తుంది. నువ్వు గంట సేపు చెప్పే సంగతిని అదిట్టే తోక ఊపి ఓ క్షణంలో చెబుతుంది అంటుంది కామాక్షి. అందుకే కుక్కపిల్లలంటే ఇష్టం అంటూ ఆ ఇష్టంతోనే కుంటికుక్కపిల్లని చేరదీసింది కామాక్షి. 'రాజు' అని పేరుపెట్టుకుంది దానికి. పేరుకి తగ్గట్టుగానే పెంచి పెద్ద చేసింది దాన్ని. అది కూడా అలాగే కామాక్షిని కనిపెట్టుకుని ఉంది.



పాసింజర్‌బళ్ళల్లో పళ్ళమ్మి పొట్టపోషించుకునేది కామాక్షి. విశాఖ టు రాయ్‌పూర్, రాయ్‌పూర్ టు విశాఖ పాసింజర్ బండిలో రకరకాల పళ్ళమ్మి, కాణీపరకా మిగుల్చుకునేది. చిల్లరంతా కొంగునకట్టుకుని, మురిసిపోయేది. నీకెందుకే డబ్బు దాయడం? ఎవరికెడదాఁవని? ఎవరున్నారని అప్పారావంటే...కట్టుకున్నోణ్ణి కష్టాలపాల్జేస్తానా? ఏడినీళ్ళకు సన్నీళ్ళలా తోడుకానూ అనేది కామాక్షి. నిన్నెవడు కట్టుకుంటాడే కుంటికామాక్షి అని నోటిదాకా వచ్చినా ఆ మాట బయటికి అనేవాడుకాదు అప్పారావు. అంటే తంటా అని ఊరుకునేవాడు. రైలుడబ్బాలో పళ్ళమ్ముతూ, ఎన్నడూ లేనిది ఆ రోజు తూలి నాగరాజుమీద పడ్డది కామాక్షి. నాగరాజు రోల్డ్‌గోల్డ్‌గాజులూ, చైనులూ అమ్ముతాడు. తనమీదపడ్డ కామాక్షిని కసిరికొట్టి విసిరేయలేదతను. పట్టుకుని గట్టిగా నిలబడ్డాడు. ఇలాగే జీవితాంతం గట్టిగా నిలబడతావా? అడిగింది కామాక్షి. నిలబడతానని నోటితో చెప్పలేదు నాగరాజు. చేతిలో ఉన్న చైనొకటి తీసి, మెళ్ళోవేసి ఇదే మంగళసూత్రం అనుకో అని ముందుకు లాక్కున్నాడామెను. అలా కామాక్షి పెళ్ళయిపోయింది. నాగరాజుతో వెళ్ళిపోయింది. కామాక్షిసహా కుంటిరాజుగాడు కూడా వెళ్ళిపోయాడా? కథ ఇదేనా? అని అడుగుతారేమో! అక్కడికే వస్తున్నాను. లేదు. రాజుగాణ్ణి వదలివెళ్ళిపోయింది కామాక్షి. అదేంటదీ! ఎందుకలా? అంటే నాకు కూడా పెద్దగా వివరాలు తెలీవు. తిరిగొస్తుందని రాయ్‌పూర్ టు విశాఖ పాసింజర్‌కేసి చూస్తూ నేటికీ కుంటిరాజుగాడు అక్కడే ఉన్నాడు. రావిచెట్టునీడలో, కామాక్షిగుడిసెను కాపాలాకాస్తూ ఉన్నాడు. అయిదేళ్ళయిందిప్పటికి. కామాక్షిరాదు, కుంటిరాజుగాడు పోడు. చెప్పండ్సార్! ఎప్పుడైనా ఎక్కడైనా కామాక్షి మీకు కనిపిస్తే రాజుగాడిగురించి చెప్పి, రాజీ కుదర్చండి, ప్లీజ్!




**బుధవారం: 16 ఆగస్టు 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, కృష్ణపక్షం**
**తిథి:** నవమి మ. 3.18 తదుపరి దశమి
**నక్షత్రం:** రోహిణి రా. 12.50 తదుపరి మృగశిర
**వర్జ్యం:** సా. 5.23 నుంచి 6.52 వరకు
**దుర్ముహూర్తం:** ఉ. 11.55 నుంచి 12.45 వరకు
**అమృతఘడియలు:** రా. 9.52 నుంచి 11.21 వరకు
**రాహుకాలం:** మ. 12.00 నుంచి 1.30 వరకు
**సూర్యోదయం:** 6.02
**సూర్యాస్తమయం:** 6.37

**గురువారం: 17 ఆగస్టు 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, కృష్ణపక్షం**
**తిథి:** దశమి మ. 12.43 తదుపరి ఏకాదశి
**నక్షత్రం:** మృగశిర రా. 10.59 తదుపరి ఆరుద్ర
**వర్జ్యం:** ఉ. 6.03 నుంచి 7.29 వరకు
**దుర్ముహూర్తం:** ఉ. 10.14 నుంచి 11.04 వరకు, మ. 3.16 నుంచి 4.06 వరకు
**అమృతఘడియలు:** మ. 2.52 నుంచి 4.21 వరకు
**రాహుకాలం:** మ. 1.30 నుంచి 3.00 వరకు
**సూర్యోదయం:** 6.03,
**సూర్యాస్తమయం:** 6.37

**శుక్రవారం: 18 ఆగస్టు 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, కృష్ణపక్షం**
**తిథి:** ఏకాదశి ఉ. 10.01 తదుపరి ద్వాదశి
**నక్షత్రం:** ఆరుద్ర రా. 9.03 తదుపరి పునర్వసు
**వర్జ్యం:** ఉ. 6.42 నుంచి 8.10 వరకు
**దుర్ముహూర్తం:** ఉ. 8.34 నుంచి 9.24 వరకు, మ. 12.45 నుంచి 1.35 వరకు
**అమృతఘడియలు:** ఉ. 11.52 నుంచి 1.20 వరకు
**రాహుకాలం:** ఉ. 10.30 నుంచి 12.00 వరకు
**సూర్యోదయం:** 6.03
**సూర్యాస్తమయం:** 6.36

**శనివారం: 19 ఆగస్టు 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, కృష్ణపక్షం**
**తిథి:** ద్వాదశి ఉ. 7.18, త్రయోదశి తె. 4.38 వరకు
**నక్షత్రం:** పునర్వసు రా. 7.09 తదుపరి పుష్యమి
**వర్జ్యం:** ఉ. 8.06 నుంచి 9.34 వరకు, మ. 2.33 నుంచి 4.02 వరకు
**దుర్ముహూర్తం:** ఉ. 6.03 నుంచి 6.53 వరకు
**అమృతఘడియలు:** సా. 4.57 నుంచి 6.25 వరకు
**రాహుకాలం:** ఉ. 9.00 నుంచి 10.30 వరకు
**సూర్యోదయం:** 6.03, **సూర్యాస్తమయం:** 6.35

**ఆదివారం: 20 ఆగస్టు 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, కృష్ణపక్షం**
**తిథి:** చతుర్దశి రా. 2.10 తదుపరి అమావాస్య
**నక్షత్రం:** పుష్యమి సా. 5.22 తదుపరి ఆశ్లేష
**వర్జ్యం:** తె. 5.21 మొదలు
**దుర్ముహూర్తం:** సా. 4.55 నుంచి 5.45 వరకు
**అమృతఘడియలు:** ఉ. 11.27 నుంచి 12.56 వరకు
**రాహుకాలం:** సా. 4.30 నుంచి 6.00 వరకు
**సూర్యోదయం:** 6.03
**సూర్యాస్తమయం:** 6.35

**సోమవారం: 21 ఆగస్టు 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, కృష్ణపక్షం**
**తిథి:** అమావాస్య రా. 12.00 తదుపరి పాడ్యమి
**నక్షత్రం:** ఆశ్లేష మ. 3.51 తదుపరి మఖ
**వర్జ్యం:** శే. ఉ. 6.51 వరకు, రా. 3.17 నుంచి 4.48 వరకు
**దుర్ముహూర్తం:** మ. 12.44 నుంచి 1.34 వరకు, మ. 3.14 నుంచి 4.04 వరకు
**అమృతఘడియలు:** మ. 2.22 నుంచి 3.52 వరకు
**రాహుకాలం:** ఉ. 7.30 నుంచి 9.00 వరకు
**సూర్యోదయం:** 6.04
**సూర్యాస్తమయం:** 6.34

**మంగళవారం: 22 ఆగస్టు 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, భాద్రపదమాసం, శుక్లపక్షం**
**తిథి:** పాడ్యమి రా. 10.16 తదుపరి విదియ
**నక్షత్రం:** మఖ మ. 2.43 తదుపరి పుబ్బ
**వర్జ్యం:** రా. 10.30 నుంచి 12.03 వరకు
**దుర్ముహూర్తం:** ఉ. 8.34 నుంచి 9.24 వరకు, రా. 10.19 నుంచి 11.04 వరకు
**అమృతఘడియలు:** మ. 12.26 నుంచి 1.58 వరకు
**రాహుకాలం:** మ. 3.00 నుంచి 4.30 వరకు
**సూర్యోదయం:** 6.04
**సూర్యాస్తమయం:** 6.33

## మెయిల్ బాక్స్

### పఠనాసక్తి పెంచే వరాలకొండ

వరాలకొండ రామలింగం, ఆమె తల్లిగారి గురించిన మొదటిపేజీ కబుర్లు ఎంతో ఆకట్టుకున్నాయి. పఠనాసక్తిని పెంపొందించే సంపాదకీయమిది. మార్నింగ్ కాఫీ మంచి స్ట్రాంగ్‌గా ఉంది. చిత్రమైన థియేటర్లు ఆశ్చర్యం కలిగించే విషయాలు తెలియజేశాయి. స్త్రీలందరిలోనూ అమ్మను చూడొచ్చు. కన్నవారే అమ్మానాన్నలు కానక్కరలేదని పదిదీపాలు కథలో చాటిచెప్పారు.

—జి.వి.మురళీమోహన్, ముచ్చుమిల్లి తూ.గో.జిల్లా

### సమంజసమే

పఠనాసక్తి పెంచడానికి, పెంపొందించడానికి అనుసరించే ఏ పద్ధతైనా సమంజసమైనదేనని 'వరాలకొండ' కథలో చక్కగా చెప్పారు. మార్నింగ్ కాఫీలో బుద్ధిహీనత, అనుమానించే మనస్తత్వం, తనదైన అంశాన్ని వేరొకరికి ఆపాదించే నైజాలను చక్కగా ఆవిష్కరించారు. తాళిబంధం భర్తని భార్యకు మానసికంగా ఎంత దగ్గరకు తీసుకెళ్ళగలదోనన్న అనురాగబంధాన్ని సురేంద్ర తన కవితలో చెప్పారు. పదిదీపాలు కథ హృద్యంగా ఉంది. మిగిలిన కథలన్నీ బాగున్నాయి. లాకర్ నెంబర్ 369 సీరియల్ పరిశోధనాత్మక కథకు కావల్సిన ఉత్కంఠతో సాగుతోంది.

—డా.శివభూషణం, కర్నూలు

### అదే మా ఆకాంక్ష

ఆగస్టు 2వ తేది సంచికలో సరదాగా జోక్స్ బాగున్నాయి. శుభవేళ శీర్షిక అందరికీ అనుకూలమైనది. 'వరాలకొండ', 'చిత్రమైన థియేటర్స్' అద్భుతంగా ఉన్నాయి. మురళీమోహన్ ముచ్చట్లు రాస్తున్న చల్లాభాగ్యలక్ష్మిగారికి నా అభినందనలు. పాఠకులకు వీక్లీ ఇలా మరింత చేరువకావాలని మా ఆకాంక్ష. హరివంశం మనస్సుకు ఆహ్లాదం కలిగిస్తోంది.

—కె.ఎల్.బి.రావు, రామగుండం

### వరాలకొండ ఆసక్తికరం

మొదటిపేజీ 'వరాలకొండ' ఆసక్తికరంగా ఉంది. మార్నింగ్ కాఫీ అందగత్తె తెలివితేటలను తేటతెల్లం చేసింది. 'శిథిలజీవి' కథలో అయిలయ్య పాత్రధారి దీనావస్థ హృదయాన్ని బరువెక్కించింది. 'అమ్మకోసం కొడుకు చేస్తున్న సలీంగారి 'అన్వేషణ' ఉత్కంఠ పెంచుతోంది. జంతువుల ద్వీపాలు వ్యాసం అబ్బురపరచింది. 'నేను రాలినచోట' కవిత భావగర్భితమై శోభిల్లింది. తీన్మార్, మనమీదేనర్రోయ్ ఆకట్టుకున్నాయి. రాజశుకగారి రివ్యూలు అన్ని కోణాలను స్పృశిస్తూ విశ్లేషణాత్మకంగా సాగుతున్నాయి.

—నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం

### ప్రతివారం ఎదురుచూపులే

నూరుకట్ల పిశాచం కథలు ఎంతో బాగున్నాయి. వసుంధరగారు రాస్తున్న ఈ కథలు గమ్మత్తుగా ఉండి పాఠకులకు ఆనందాన్ని కలిగిస్తున్నాయి. మహారాణికి వినయశీలుడు చెప్పే మిగతా కథలన్నీ ఇంకా ఎంత బాగుంటాయో. అవన్నీ చదవాలనే కుతూహలంతో ప్రతి బుధవారం నవ్యవీక్లీ కోసం ఎదురుచూస్తున్నాం. జైనిగారి సీరియల్ లాకర్ నెంబర్ 369 ఒక డిటెక్టివ్ నవలలా అమోఘంగా ఉంది.

—టి.బాల్‌ముకుంద్‌సింగ్, అమరచింత

### బాగున్నాయ్

జంతుద్వీపాలు, రివ్యూ బాగున్నాయి. చైనా పాకిస్థాన్‌లు భారత్‌ను ఏమీ చేయలేవు. పడుకుని సినిమా చూసే థియేటర్లు విస్తారంగా అందుబాటులోకి వస్తే నిద్రపోయే విలాసానికి కరువుండదు.

—వాస్తు రామచంద్ర, నెల్లూరు

## తల్లికోసం అమ్మాయిలా!

తల్లి, తండ్రి ఆరోగ్యం బాగా లేకుంటే మాకెందుకులే ముసలివాళ్ల గోల, అని పట్టించుకోకుండా అనాథాశ్రమంలో ఉంచేవాళ్లు ఈకాలంలో చాలామందే ఉన్నారు. అందుకే ఎక్కడ చూసినా వృద్ధాశ్రమాలు వెలుస్తు న్నాయి. అలా కాకుండా దగ్గరుండి మరీ తల్లిదండ్రులకు సేవలు చేసే వాళ్లు కూడా ఉన్నారు. కానీ వారి సంఖ్య చాలా తక్కువే. ఇప్పుడు చెప్పు కోబోయే వ్యక్తి కూడా ఈకోవలోకే వస్తాడు. ఆనాడు శ్రవణ కుమారుడు అంధులైన తన తల్లిదండ్రులను కావడిలో పెట్టి మోసుకెళ్లినట్లుగానే ఈనాడు ఇతగాడు తనతల్లిసేవ కోసం ఆడపిల్లలా మారిపోయాడు. అతడెవరో ఆ కథేంటో మీరే తెలుసుకోండి !

ప్రాణప్రదంగా ఉండే వ్యక్తులు ఎవరైనా చనిపోతే చాలా బాధ పడతాం. తట్టుకోవడం చాలా కష్టం. ఆ బాధ నుంచి కోలుకోవడానికి చాలా సమయమే పడుతుంది. కొందరైతే పిచ్చిపట్టినట్టు మానసికంగా చాలా డీలా పడిపోతారు. ఆ స్థితి నుంచి వారు కోలుకోవడానికి పట్టే



సమయం ఎంతో మనం చెప్పలేం.

చైనాలోని గుయిలిన్ ప్రాంతానికి చెందిన ఓ తల్లి కూడా ఇలాగే తన కూతురిని ఓ ప్రమాదంలో పోగొట్టుకుంది. ఆ మహిళ పేరు లీ. ఆమెకు ఇద్దరు పిల్లలు. ఒక కూతురు, ఒక కొడుకు. కూతురుపోయిన బాధతో ఆమె రోజూ కుమిలిపోతుండేది. నిద్రాహారాలు మానేసి కూతురి కోసం తల్లడిల్లిపోతుండేది. తల్లిబాధ చూసి ఆమె కుమారుడు తట్టుకోలేక పోయేవాడు. ఇలాగే ఉంటే తన తల్లి ప్రాణాలు దక్కవని భావించాడు. అందుకోసం 20 ఏళ్లుగా ఈ కుమారుడు చేస్తున్న పని చూస్తే హృదయం ద్రవించకమానదు. ఇంతకూ అతను తన తల్లి ప్రాణాలను కాపాడుకోవడా నికి ఏం చేశాడంటే తన చెల్లిలాగే దుస్తులు వేసుకుని చనిపోయిన కూతురు తిరిగొచ్చినట్లు నమ్మించాడు.

చెల్లి తిరిగొచ్చిందని చెప్పగానే వాళ్ల అమ్మ సంతోషానికి అవధుల్లేవట. ఆరోగ్యం కూడా కుదుటపడింది. చాలా సంతోషంగా ఉంది. వాళ్లమ్మకు ఈ సంతోషాన్ని దూరం చేయకూడదని అనుకుని అతనే చెల్లిలా మారిపో యాడు. మగవాళ్లు వేసుకునే దుస్తులు తీసేశాడు. ఇతరులు తన గురించి ఏమనుకున్నా ఫర్వాలేదు, తన తల్లి సంతోషమే తనకు ముఖ్యం అని చెబు తున్నాడు అతగాడు. అలా తల్లికోసం ఆడపిల్లలా మారిపోయిన అతడు ఇరవై ఏళ్ల పాటు పెళ్లి చేసుకోకుండా తన చెల్లిలా తయారయ్యి వాళ్లమ్మని చూసుకుంటున్నాడు. తల్లి కోసం చేస్తున్న సేవ గురించి తెలిసి చైనీస్ మీడియా అతనిని ఇంటర్వ్యూ చేసింది. ఇప్పుడు ఇతని వీడియో సోషల్‌మీ డియాలో వైరలైంది. ఇప్పటికే ఈ వీడియోని 40 లక్షల మందికిపైగా వీక్షిం చారు. ఇంత పాపులర్ అయినా సరే అతను మాత్రం తన పేరు వెల్లడిం చద్దని మీడియాను కోరాడు. దాంతో అతని పేరు బయటకిరాలేదు కానీ అతని సేవ గురించి మాత్రం మొత్తం ప్రపంచానికి తెలిసింది.





# అరవైలో ఇరవై వయసు...

**ప్రతి ఒక్కరి జీవనయానంలో బాల్యం, యవ్వనం, వృద్ధాప్యం అనే దశలు తప్పనిసరి. బాల్యం ఓ మధురమైన జ్ఞాపకాల పూదోట. యవ్వనం ఆనందాల, బాధ్యతల సమాగమం. మరి వృద్ధాప్యం... అనుభవాల గని, భావితరాలకు బాసట. వృద్ధాప్యమనేది వేదన కాదు ముందు తరాలకు నివేదన!**

**నేటి బాలలే రేపటి పౌరులు... అలాగే నేటి పౌరులే రేపటి పెద్దలు, వృద్ధులు! విస్మరించలేని జీవనసత్యం ఇది. బాల్యంతో సమానమైనది వృద్ధాప్యమే నని ఇది రెండో బాల్యం లాంటిదని ఎంతోమంది రచయితలు, కవులు, తత్వవేత్తలు చెబుతుంటారు. బాల్యంలో కుటుంబసభ్యుల నుంచి అందే ప్రేమానురాగాలకు అంతే ఉండదు. కానీ ఈ రెండో బాల్యంలాంటి వృద్ధాప్యంలో మాత్రం అందుకు భిన్నంగా ఉంటుంది. కొందరు వృద్ధాప్యాన్ని శాపంగా పరిగణిస్తారు. మరికొందరు ప్రశాంత జీవితం గడిపే అద్భుతమైన అవకాశంగా భావిస్తారు. ఆగస్టు 21న నేషనల్ సీనియర్ సిటిజన్స్‌డే సందర్భంగా పెద్దల గురించి కాసేపు ఆలోచిద్దాం.**

బాధ్యతలన్నీ తీరి ఇక హాయిగా గడపాలనుకునే సమయం వృద్ధాప్యం. పెద్దలు ఈ సమయంలో మనసును హాయిగా, ఉల్లాసంగా ఉంచుకోవాలి. కుర్రవాళ్లల్లో కుర్రవాళ్ళుగా మసలగలగాలి. అంటే కొత్తతరాల భావాలకు తగ్గట్టుగా మసలుకోవాలి. వారితో సమానంగా ఆలోచనావిధానాన్ని మార్చుకోవాలి. పిల్లలకు బాసటగా నిలవాలి. గమ్యనిర్దేశం చేయాలి. తప్పొప్పులను వివరించాలి. పరిస్థితులకు అనుగుణంగా మసలుకోవాలి. ఇలా చేస్తే వృద్ధాప్యం భారం కాదు, ఆనందపుటూయల అవుతుంది. అలా ఆనందపుటూయలలు ఊగాలంటే మాత్రం కొన్ని వ్యాపకాలను పెంచుకోవాలి. కొన్నింటిని తగ్గించుకోవాలి. మరి అవేమిటో చూద్దామా!

## మళ్ళీ మొదలుపెట్టండి

జీవితాన్ని అరవైల్లో కూడా ఇరవైల్లో లాగా గడపవచ్చు. అది మన చేతుల్లోనే ఉంది. దానికి మానసిక దృఢత్వం చాలా అవసరం. చాలామంది పెద్దలు అరవైలోకి అడుగుపెట్టగానే మానసికంగా రిటైర్ అవుతుంటారు. ఇది జీవితాన్ని హాయిగా, ఆనందంగా గడపడానికి చాలా పెద్ద అవరోధం. దానివల్ల మానసికంగానే కాదు శారీరకంగా కూడా ఇబ్బందులు ఎదుర్కొంటారు. ఇంట్లో ఖాళీగా కూర్చోవడం, గుర్తింపు కోల్పోతున్నామన్న బాధ, ఎవరూ తమను పట్టించుకోవటం లేదనే ఆలోచనలతో నైరాశ్యానికి లోనవుతుంటారు. అందుకే అరవై దాటినా శరీరాన్నీ, మెదడునూ చురుకుగా ఉంచుకోవటం అవసరం. అలా చురుగ్గా ఉండాలంటే, మానసికంగా దృఢమవ్వాలంటే కొత్తకొత్త ఆలోచనలు చేయాలి. ఏదో ఒక పని, విద్య నేర్చుకోవటానికి ప్రయత్నించాలి. పుస్తకాలు చదవాలి. స్నేహితులతో, మనవలు, మనవరాళ్ళతో ఆటలు ఆడాలి. సాంత్వన, ఏకాగ్రత పెంచే ధ్యానం వంటి వాటిని చేయవచ్చు. అందుకే పెద్దలు చురుగ్గా ఉన్న తమ మెదడును మరింతగా పనిచేయిస్తూ, సరికొత్త కార్యకలాపాలపై దృష్టిపెడితే మరింత ఆరోగ్యవంతమైన జీవితాన్ని గడపవచ్చు. ఈ ఉత్సాహమే అరవైలో కూడా ఇరవైలో ఉన్న ఫీలింగ్‌ని, వృద్ధాప్య సమస్యలను అధిగమించడానికి అవసరమైన శక్తిని ఇస్తుంది.

## స్నేహ హస్తం

కుటుంబసభ్యులు దూరంగా ఉన్నప్పుడు లేదా వారితో మన భావాలను, ఆలోచనలను, ఆవేదనను పంచుకోలేమని భావించినప్పుడు, ఉద్యోగ, కుటుంబ బాధ్యతలనుంచి విరమణ పొందినప్పుడు ఏం చేయాలో పాలుపోదు. జీవితమంతా శూన్యంలా తోస్తుంది. అలాంటి సమయంలో స్నేహితుల అండ ఓ కొత్త జీవితాన్ని అందిస్తుంది. కుటుంబంలో ఏదన్నా సమస్య ఉంటే స్నేహితుల దగ్గర ఓదార్పు లభించి తీరుతుంది. అలాగని స్నేహం కేవలం వృద్ధాప్యంలోనే కాదు.... జీవితంలోని ఏ మలుపులో అయినా అండగా నిలిచి తీరుతుంది. స్నేహానికి వయసుతో నిమిత్తం లేదు. కాబట్టి స్నేహధర్మాన్ని పాటిస్తూ, స్నేహాన్ని పదిలంగా కాపాడుకోవాల్సిన బాధ్యత, అవసరం పెద్దలకు ఎక్కువగా ఉంటుంది. స్నేహితులతో కలిసి, తమలాగే వృద్ధాప్యంలో అవసరమనుకునే వారికి చేతనయినంత సహాయం చేయటం, సామాజిక సేవ, ఆధ్యాత్మిక సేవ వంటి వ్యాపకాలు పెంచుకోవటం లాంటివి ఒంటరితనపు ఆలోచనలను తగ్గిస్తాయి.

నేటి సమాజంలో చాలామంది వృద్ధులు జీవన చరమాంకంలో స్నేహ హస్తాన్ని అందించే తోడు కోసం ఎదురుచూస్తున్నారు. తమలాగే నిరాదరణకు గురైన వృద్ధులను జీవనసహచరులుగా కూడా కొంతమంది చేరదీస్తున్నారు. ఈ విషయంలో లైంగి

కాంశాల కన్నా మానసికంగా ఓదార్పును వారు కోరు కుంటున్నారు.

### వ్యాపకాలు పెంచుకోండి

సాంకేతికత మూలంగా ఇప్పుడు ప్రపంచం ప్రతి ఒక్కరి గుప్పిట్లోనూ ఉంది. ఎక్కడ ఏం జరిగినా సోషల్‌మీడియా నిమిషాల్లో చేరవేస్తుంది. పిల్లలు, టీనేజర్లే కాదు పెద్దవాళ్ళు కూడా సాంకేతికతను అందిపుచ్చుకుంటున్నారు. అందుకే పెద్దలు సోషల్ మీడియాను ఉపయోగించుకుని ఒంటరితనాన్ని దూరం చేసుకుంటున్నారు. వ్యాపకాలు పెంచుకుంటున్నారు. అందుకే పెద్దలకు వాట్సాప్ గ్రూపులు ఏర్పరచుకోండి... ఒంటరితనం దరిచేరదు; ఫేస్‌బుక్ పేజ్ క్రియేట్ చేయండి... మీకో గుర్తింపు లభిస్తుంది; మీ అభిరుచులకో బ్లాగ్‌ను ఏర్పాటుచేసుకోండి... ఇక మీకు సమయం ఎలా గడుస్తుందో కూడా తెలియదు అని చెబుతున్నారు. మనవలు, మనవరాళ్ళను దగ్గరకు తీసి, నైతిక విలువలను బోధించండి...మీ మనస్సు పొందే ఆనందవిహారం మాటల్లో చెప్పలేనిది అని కూడా అంటున్నారు.

### వృద్ధులకూ వ్యాయామాలు

మలివయసులో ఆరోగ్యమే మహాభాగ్యం అనే సూక్తిలోని 'భాగ్యానికి' నిర్వచనం మార్చుకోవాల్సి ఉంటుంది. పెద్దలకు భాగ్యం అంటే సంపద కాదు. కుటుంబమంతా ఆనందంగా, సంతోషంగా ఉండడం, ఆరోగ్యాన్ని కాపాడుకోవడం. పెద్దలు కొద్దిపాటి క్రమశిక్షణ అలవరచుకుంటే ఆరోగ్యాన్ని కాపాడుకోవడం ఏమంత పెద్దపని కాదు.

పెద్ద వయసులో ఏ పని చేద్దామన్నా శరీర అవయవాలు అంతగా సహకరించవు. రోజువారీ పనులు చేసుకోవాలన్నా శక్తి చాలక, చెప్పలేని అశక్తత ఆవరిస్తుంటుంది. దీనికి విరుగుడు సూత్రం ఒక్కటే. 'యూజ్ ఇట్ ఆర్ లూజ్ ఇట్'! దేన్నయినా ఉపయోగిస్తుంటేనే పదును తగ్గకుండా ఉంటుంది. అది శరీరమైనా, ఇంకేదైనా సరే. అందుకే వ్యాయామం చేయాలి అని చెబుతున్నారు పరిశోధకులు. వ్యాయామం వల్ల త్వరగా అలసిపోరు. ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. నొప్పులు తగ్గుతాయి. మధుమేహం, హైబీపీ, హైకొలెస్ట్రాల్ వంటి సమస్యలను అధిగమించేందుకు వ్యాయామం అవసరమని వైద్యులు చెబుతున్నారు. నడక, ఈత వంటి వాటితో కొత్త శక్తిని పుంజుకోవచ్చు. తోటపని, ఇంటిపని వంటివి తేలికగా చేసేయొచ్చు. సంబంధిత వైద్యులను సంప్రదించి, సంపూర్ణ శరీర ఆరోగ్యానికి అవసరమైన వ్యాయామాలు తెలుసుకొని చేయాలి. అసలు యవ్వనంలోనే ఆరోగ్యకరమైన జీవన విధానాన్ని అలవరచుకుంటే మలి వయసు కూడా చక్కటి ఆరోగ్యంతో ఎంతో ఆహ్లాదంగా, హాయిగా గడిచిపోతుంది. పీచు ఎక్కువగా ఉండే కూరగాయలు, పండ్లు, ముడి ధాన్యాల వంటివి ఎక్కువగా తినాలి. నీరు ఎక్కువగా తాగాలి. పెద్దవయసులో సాధ్యమైనంత వరకూ బరువు పెరగకుండా చూసుకోవటం మంచిది.



### పెరుగుతున్న వృద్ధుల జనాభా

*ప్రపంచవ్యాప్తంగా గణాంకాలు పరిశీలిస్తే ప్రపంచ జనాభాలో 60 ఏళ్ళు దాటిన వారి జనాభా 11 శాతం ఉంది. 2050 నాటికి ప్రపంచవ్యాప్తంగా వృద్ధుల జనాభా 20కోట్లకు చేరుకోనున్నదని 'యునైటెడ్ నేషన్స్ పాపులేషన్ ఫండ్' (యు.ఎన్.ఎఫ్.పి.ఎఫ్) నివేదిక స్పష్టం చేస్తోంది. దీని ప్రకారం భారత్, చైనాల్లో 2050 నాటికి ప్రపంచంలోని 80 శాతం మంది వృద్ధులు ఉండనున్నారు. ఇక భారతీయుల విషయానికి వస్తే.. అరవయ్యేళ్ళు దాటినవారి జనాభా 360 శాతం పెరగనున్నదని ఐక్యరాజ్యసమితి నివేదిక స్పష్టం చేస్తోంది. యు.ఎన్.ఎఫ్.పి.ఎ మనదేశంలోని ఏడు రాష్ట్రాల్లో సర్వే నిర్వహించింది. భారత్‌లో ప్రస్తుతం 10 కోట్ల మంది వృద్ధుల జనాభా ఉండగా, 2050 నాటికి వీరి సంఖ్య 32.3 కోట్లకు చేరుకుంటుంది. అంటే మొత్తం దేశ జనాభాలో వృద్ధుల జనాభా 20 శాతం ఉండబోతున్నదని యు.ఎన్.ఎఫ్.పి.ఎఫ్. నివేదిక అంచనా.*

### అనుబంధాలను అతికించాలి

ఒకప్పుడు ఉమ్మడి కుటుంబాల నేపథ్యంలో పిల్లలు తాతయ్యలు, అమ్మమ్మలతో కథలు చెప్పించుకునేవారు. విలువలతో కూడిన కథలతో తాతయ్యలు పిల్లల మానసిక ఎదుగుదలకు, తోడ్పడేవారు. మానవత్వం, నిజాయితీ, విలువలు వంటి జీవన ఆవశ్యక సూత్రాలను పిల్లల్లో నాటేవారు. కానీ నేడు వ్యష్టి కుటుంబాల నేపథ్యంలో పిల్లలకు విలువల పట్ల స్పష్టత లేదు. బంధాలు, అనుబంధాలకు దూరమవుతున్నారు. మానవ సంబంధాలంటే కేవలం ఆర్థిక బంధాలుగా మారుతున్నాయి. కాబట్టి పెద్దలు పిల్లలకోసం సమయాన్ని వెచ్చించాలి. కేవలం చదువులు, ర్యాంకులే కాకుండా జీవిత సూత్రాలను తెలియజేయాలి. విలువల ఆవశ్యకత తెలియజెప్పాలి. బంధాలను అతికించాలి. అప్పుడే భవిష్యత్తు తరాలు బాగుంటాయి.

### ఆఖరి మజిలీ

ఎవరైనా ఏదో ఒకనాడు వృద్ధాప్య దశకు చేరుకోవలసిందే. వృద్ధాప్యదశలో మనసు సంపూర్ణ వికాసం పొంది ఉంటుంది. జీవితపు అన్ని పార్శ్వాలపై స్పష్టమైన దృక్కోణం ఏర్పడుతుంది. కేవలం తన జీవితంలో సాధించిన అనుభవాలు మాత్రమే కాదు, ఇతరుల జీవితానుభవాల నుంచి నేర్చుకున్నవి కూడా చాలా ఉంటాయి. జీవితంలో ఎన్నో ఘన విజయాలు, విషాదాలు అన్నింటిని అనుభవించి పండిపోయిన వయసే వృద్ధాప్యం. ఎన్నో ఎగుడుదిగుళ్ళు దాటుకొని మనసు రాటుతేలిపోయి ఉంటుంది. ఎప్పటికప్పుడు క్షణం తీరిక లేకుండా సమయం తెలియకుండా పరుగుల జీవనం నుంచి విముక్తి పొంది, స్వేచ్ఛగా దేన్నయినా అన్వేషించగల సామర్థ్యం కూడా వృద్ధాప్యంలోనే ఉంటుంది. జీవితాన్ని చివరికంటా ఫలవంతం చేసుకుంటూ ఓపికున్నంత వరకు శ్రమిస్తూనే ఉండాలి. వృద్ధాప్య దశలో ఎదురయ్యే అడ్డంకులను సాధ్యమైనంత వరకు అధిగమించి, ప్రశాంత జీవనం గడపడానికే ప్రాధాన్యమివ్వాలి. సమస్యలను నేర్పుగా సంయమనంతో ఎదుర్కోవటమనే సంసిద్ధతే, జీవితాన్ని ఒడిదుడుకులు లేకుండా నడిపిస్తుంది. వృద్ధాప్యం అంటే జీవితం అయిపోవటం కాదు నిజమైన జీవితం ఇక్కడనుండే ప్రారంభమవుతుంది. ధర్మాధర్మ విచక్షణ, తప్పొప్పుల పరిశీలనా, నేర్చుకున్న అనుభవాల పరిణితితో ముందు తరాల బాటను సుసంపన్నం చేయగలదనేది ప్రతి ఒక్కరూ గుర్తెరగాలి.

—లక్ష్మీ నర్మద



### జీవనవైరుధ్యాలు

*గ్రామీణ, పట్టణ ప్రాంతాల జీవితాల మధ్య ఉన్న వైరుధ్యాలు వృద్ధుల జీవితాల్లో కూడా చోటు చేసుకుంటున్నాయి. పట్టణ ప్రాంతాలలో వృద్ధులు వివిధ రకాల ఉద్యోగాలు చేసి విశ్రాంత జీవితాన్ని అనుభవిస్తున్నవారే. సీనియర్ సిటిజన్స్ సంఘాలు, రిటైర్డ్ ఉద్యోగుల సంఘాలు వంటివాటిని ఏర్పాటు చేసుకుని ఎప్పటికప్పుడు పార్కుల్లోనూ, ఇతర ప్రదేశాలలోనూ కలుసుకుంటూ తమ అనుభవాలు, సమస్యలు పంచుకుంటూ ఉంటారు. కొంతవరకూ పింఛను వంటి ఆర్థిక భద్రత వీరికి ఉండడం వల్ల వృద్ధాప్యం పెద్ద భారంగా ఉండదు. అయితే గ్రామీణ ప్రాంతాల్లోని వృద్ధుల పరిస్థితి అందుకు భిన్నం. గ్రామాల్లో ఉన్న వృద్ధులు సంఘాలుగా ఏర్పడటానికి తగిన చైతన్యం, అందుకు అనువైన పరిస్థితులు ఎక్కడాలేవు. దీనికి తోడు వయోభారం వల్ల రకరకాల అనారోగ్యాలు, అందుబాటులో లేని వైద్య సదుపాయాలు అక్కడి వృద్ధులు ఒంటరితనపు ఛాయలలోనే బతుకుతున్నారు.*



# సీతమ్మపాదం

వాణిశ్రీ

**"ఈ ఎండల్ని తట్టుకోలేకపోతున్నాం అన్నయ్యా! రెండేళ్ళ నుంచి వర్షాలు లేవు. పంటలు సరిగ్గా లేవు. ఈ ఏడు సీత పెళ్ళి చెయ్యడం కుదరదులే" అన్నాడు రాజయ్య.**

**"ఈ ఏడాదే చెయ్యాల్రా! తర్వాత మాత్రం రోజులు ఎలా ఉంటాయో ఏం చెప్పగలం? మంచి సంబంధం. రాంబాబు బంగారం. పిల్లోడి తండ్రి సంజీవి మంచి మనిషి. తల్లి శేషమ్మ గద్దరు మనిషి. దానికి ఎవరితోనూ పడదు. అందుకే ఊళ్ళోవాళ్ళు పిల్లని ఇవ్వడానికి భయపడుతున్నారు. రాంబాబుకి పెళ్ళీడు దాటిపోతోందని సంజీవి గోల. అందుకే ఈ ఏడాది కొడుకు పెళ్ళి చేసెయ్యాలని పట్టుదలగా ఉన్నాడు" చెప్పాడు నాగరాజు.**

నాగరాజు రాంబాబుకి మేనమామ వరస. ఊళ్ళో వాళ్ళు గయ్యాళి శేషమ్మతో తమపిల్లలు వేగలేరని డిసైడైపోయారు. అందుకే రాంబాబుకి పిల్లను ఇవ్వడానికి ఆడపిల్లల తల్లిదండ్రులు ముందుకురావడం లేదు. ఒకవైపు ఊళ్ళో ఆడపిల్లల పెళ్ళిళ్ళు అయిపోతున్నాయి. సంజీవికి వెర్రెక్కిపోతోంది.

'నాగరాజూ! బైట ఊళ్ళల్లో మీ చుట్టాల్లో మంచి పిల్లని చూడరా! ఈ ఏడాది ఎలాగైనా రాంబాబుకి పెళ్ళి చేసెయ్యాలి!' అని పదే పదే చెబుతున్నాడు.

అప్పుడు అతనికి పొన్నపల్లెలో ఉంటున్న బాబాయి కొడుకు రాజయ్య గుర్తుకు వచ్చాడు. భార్య చనిపోతే అతను రెండో పెళ్ళి చేసుకున్నాడు. మొదటి భార్యకు ఒక కూతురు ఉంది. సవతితల్లి కారణంగా సీత బాధలు పడుతోందని విన్నాడు. సవతితల్లుల చేతుల్లో కష్టాలు అనుభవించడం ఆడపిల్లలకు తరతరాలుగా ఉన్నదే. సవతితల్లితో వేగిన పిల్ల గయ్యాళి అత్తతో సర్దుకుపోతుందని నాగరాజుకు నమ్మకం. అందుకే పెద్దరికం నెత్తిన వేసుకుని పొన్నపల్లె వెళ్ళి సీత పెళ్ళిగురించి రాజయ్యను కదిపాడు.

"నువ్వు మంచి సంబంధం తెచ్చావు. సంతోషం. నాకూ సీత పెళ్ళి చెయ్యాలనే ఉందన్నయ్యా! కానీ పంటలు సరిగ్గా లేవు. పెద్దోడు గుంటూరులో ఇంజనీరింగ్ చదువుతున్నాడు. వాడికి సర్దాలి. డబ్బుకి కటకటగా ఉంది. ఎరువులకొట్లో, మందులకొట్లో బాకీలున్నాయి. తన ఇబ్బందులు ఏకరువు పెట్టాడు రాజయ్య.

"నేను ఇంతగా ఎందుకు చెబుతున్నానో అర్థం చేసుకో. రేపు రాజెవరో? రెడ్డెవరో? తెలియదు. నువ్వు వచ్చే ఏడాది వరకు ఆగమంటే కుదరదు. అయ్యగారు వచ్చేవరకు అమావాస్య ఆగదని సామెత. రాంబాబుకు ఇంకేదైనా సంబంధం కుదిరితే చెయ్యి జారినట్టే. సీత తల్లిపొలం రెండెకరాలు ఆ పిల్లకే రాసివ్వు. పెళ్ళి ఖర్చులకు డబ్బు నేను సర్దుతాను" అన్నాడు నాగరాజు. రాజయ్య 'ఊఁ' కొట్టాడు.

సంజీవి, శేషమ్మలు కొడుకుతో పొన్నపల్లె వచ్చి పిల్లను చూసుకున్నారు. మొదటిభార్య ద్వారా వచ్చిన పొలం సీతపేరుతో రిజిస్టరు చేశాడు రాజయ్య. నాగరాజు మధ్యవర్తిత్వంలో సీత, రాంబాబుల పెళ్ళి జరిగింది.

"సీతా! నీ పెళ్ళి నా చేతులమీదుగా చేశాను. అత్తగారి ఇంట్లో నాకు మంచిపేరు తీసుకురావాలి. బంగారంలాంటి కోడల్ని తెచ్చావని మీ అత్త నన్ను పొగడాలి" అన్నాడు నాగరాజు.

***

శేషమ్మ బొద్దుగా గుమ్మడికాయలా, కమలంలో ఒద్దికగా కూర్చున్న లక్ష్మీదేవిలా ఉంటుంది చూడ్డానికి. మొదటిసారి చూసినవాళ్ళు సినిమాల్లో సూర్యాకాంతంలాంటి గయ్యాళి అనుకోరు. పరిచయమయ్యాక చూపిస్తుంది నిజరూపం. నవ్వుతూనే వెటకారం ఒలకబోస్తుంది. పుల్లవిరుపు మాటలతో పొడుస్తూ తారెత్తిస్తూ ఉంటుంది. జనం ఆమె ఎదుట

**ఆమె ఒక గయ్యాళిగంప. అందుకే ఆమె కొడుక్కి పిల్లనివ్వడానికి ఎవరూ ముందుకు రావడంలేదు. చివరకు మధ్యవర్తి గట్టిగా పూనుకోవడంతో, సవతితల్లి దాష్టీకంలో బతుకుతున్న తన కూతుర్ని ఆమె కొడుక్కిచ్చి పెళ్ళి చేశాడు ఒక తండ్రి. కోడలు అణిగి మణిగి ఉండేందుకు అవసరమైన పథకం ముందే సిద్ధంచేసుకుంది ఆ గయ్యాళిగంప. అనుకున్నవిధంగానే ఆ పథకం అమలు చేసింది. అప్పుడు కోడలు ఏం చేసింది?**

పడడానికే జంకుతూ పక్కకు తప్పుకుపోతుంటారు. అటువంటి శేషమ్మముఖం కళతప్పి ఏదో ఆందోళనతో ఉన్నట్టు కనిపిస్తోంది.

ఇంతకాలం మొగుడు, కొడుకు ఆమె అదుపాజ్ఞల్లో మెలిగారు. ఇంటి పెత్తనమంతా తన చేతుల్లోనే ఉంది. ఇప్పుడు కొత్తగా కోడలు కాపురానికి వస్తోంది. ఏ కాలంలో అయినా అత్తకు కోడలు రాక ఆందోళన కలిగించే విషయమే! జాతివైరం మరి. పాము–ముంగిస, పిల్లి–ఎలుక తరహాలో తరతరాలు యుగయుగాలుగా అత్తాకోడళ్ళు ఒకే ఇంట్లో ఉండే శత్రువులనేది కాదనలేని సత్యం.

కొడుకు పెళ్ళైనందుకు సంతోషించింది కానీ ఇప్పుడు కోడలు కాపురానికి వస్తోందంటే శేషమ్మ మదిలో గుబులు మొదలైంది. ఊళ్ళోవాళ్ళమీద దాష్టీకం వెలగబెట్టడం వేరు. ఇంట్లో కోడలుమీద పైచేయి సాధించడం వేరు. కోడలు తన కొడుకుని కొంగున ముడేసుకుని తనను ఆడించకుండా ఎటువంటి ఆత్మరక్షణ చర్యలు తీసుకోవాలి? కొడుకు తన చేతుల్లోంచి జారిపోకుండా ఉండాలంటే ఏం చెయ్యాలి? బుర్రకి పట్టిన తుప్పు వదిలించుకుని ఐడియాల కోసం ఆలోచించసాగింది శేషమ్మ. పాత రోజుల్లో సక్కుబాయికి ఆమె అత్తచెప్పిన మోటు పనులు గుర్తుతెచ్చుకుంది. తిరగలితో పిండి విసిరించడం, రోట్లో ధాన్యం దంపించడం, బావిలో నీళ్ళు తోడించడం లాంటివి ఇప్పుడు చెల్లవు. రోజులు మారాయి. మారుమూల గ్రామానికి కూడా మిక్సీలు, రుబ్బింగ్ మెషీన్లు, బోరు బావులు వచ్చేశాయి. కాబట్టి లేటెస్ట్ ఎత్తులు వెయ్యాలి. మైండ్ గేమ్ ఆడాలి. కోడల్ని రాచిరంపాన పెడుతోందని జనం అనుకోకూడదు. తనంతట తనే అణిగి మణిగి ఉండేట్టు, తను గీచినగీటు దాటకుండా ఉండేట్టు కోడలికి బ్రెయిన్ వాష్ చెయ్యాలి. శేషమ్మ ఆ దిశగా మేధోమథనం సాగించింది. కానీ ఐడియాలు రావడం లేదు.

అటువంటి క్లిష్ట సమయంలో శేషమ్మను సుబ్బయ్య శాస్త్రి భార్య పార్వతీదేవి ఆదుకుంది. తనను శేషమ్మ పొగడ్తల్లో ముంచెత్తడంతో ఆమె తెగ ఆనందపడిపోయింది. "మీ కోడలు ఒద్దికగా ఇంటిపనులు చేసుకుంటూ బుద్ధిగా ఉంటుంది పార్వతిగారూ! మీ మాట జవదాటదని ఊరంతా గొప్పగా చెప్పుకుంటారు. అత్తయ్యగారూ! అత్తయ్యగారూ! అని మీ కొంగు పట్టుకుని కుక్కపిల్లలా తిరుగుతుంది. "మా ఇళ్ళల్లో పిల్లలు అట్లా లేరులెండి! ఇప్పుడు అందరూ చదువులు వెలగబెడుతున్నారుగా! అందుకేనేమో పొగరుబోతులుగా తయారవుతున్నారు. అత్తమామలంటే లెక్కలేదండీ! మొగుళ్ళతో తెనాలికో, గుంటూరుకో పోవడం, సినిమాలకు, షికార్లకు తిరగడం.... చూస్తున్నాంగా కోడళ్ళ బాగోతం! అందరూ అంతే! ఇక మా కోడలు కాపురానికి రాబోతోంది. ఇక రోజూ గొడవలేనేమో?"



"శేషమ్మా! నువ్వు చెప్పింది అక్షరాలా నిజం. దానికి కారణం పిల్లలకు క్రమశిక్షణ లేకపోవడమే. పెద్దవాళ్ళంటే గౌరవం లేదు. ఆధ్యాత్మిక చింతన లేదు. చదువుకున్నామని పొగరు. ఏం చదువులు... చట్టుబండలే" అన్నది పార్వతీదేవి.

"ఔనండీ...! ఔను."

"కోడలు ఏం చదివిందట?"

'ఇంటరో...గింటరో...!"

"మరింకేం? కాలేజీలో చదివిందాయె. తల పొగరు ఉంటుంది"

"ఎందుకు ఉండదండీ?"

"ఒకపని చెయ్యి శేషమ్మా! కాపురానికి వచ్చీరాక ముందే పిల్లకు కాస్త భయం భక్తీ నేర్పాలి."

"ఏం చెయ్యాలో చెప్పండి."

"కొత్త దంపతుల్ని పుణ్యక్షేత్రాలకు తిప్పు. తిరుపతి ఏడుకొండలవాడి దర్శనం చేయించు. శ్రీకాళహస్తి గుడిలో రాహుకేతు పూజలు, అన్నవరంలో సత్యనారాయణస్వామి వ్రతం చేయించు. పిల్లకి దైవభక్తి ఏర్పడుతుంది. కాపురానికి వచ్చాక ఊపిరి సలపకుండా పూజలు, నోములు మొదలుపెట్టించు. అవన్నీ నేను చెప్తాలే" అన్నది పార్వతీదేవి.

"మా బాగా చెప్పారండీ! ఈ ఐడియా నాకు తట్టనేలేదు. ఎంతయినా మీది పండితుల వంశం" అని మెచ్చుకుంది శేషమ్మ.

తర్వాత శేషమ్మ మొగుణ్ణి ఒప్పించి కొత్త దంపతుల్ని తిరుపతి తీసుకెళ్ళింది. శ్రీకాళహస్తిలో రాహుకేతు పూజలు, అన్నవరంలో సత్యనారాయణవ్రతం చేయించింది. ఇంటికి వచ్చాక పార్వతీదేవి సలహాలు, సంప్రదింపులతో పూజలకు అంకురార్పణ చేసింది. కోడల్ని ఇళ్ళకి వెళ్ళి ఆహ్వానం చెప్పమంది.

కొత్త కోడలు సీత ఇంటింటికీ తిరిగింది.

"మా ఇంట్లో ఈరోజు శివుడిపూజ. మీరువచ్చి పండు, తాంబూలం, ప్రసాదం స్వీకరించాలి" అని ముత్తైదువలకు మొక్కుతోంది.

సోమవారం శివుడిపూజ, మంగళవారం ఆంజనేయస్వామి ప్రీత్యర్థం హనుమాన్ చాలీసా సామూహిక పఠనం, గురువారం సాయిబాబా భజన కార్యక్రమం, శుక్రవారం లక్ష్మీదేవికి కుంకుమ అర్చన, శనివారం తిరుమల వెంకటేశ్వరునికి పుష్పాభిషేకం.

పూజలు, భజనలతో శేషమ్మ రెండంతస్తుల మేడ హోరెత్తిపోతోంది. పీటలమీద పూజలు చేస్తున్న కోడలి ముఖం చెమటలు కారుతూ, నీరసంగా ఇబ్బందిగా అటూ ఇటూ కదులుతున్న దృశ్యం శేషమ్మకి నయనానందకరంగా ఉంది. ఇంట్లో ఉన్న తండ్రీకొడుకులకు మాత్రం ఒంటికి కారం పూసుకున్నట్టు మంటెక్కుతోంది. దేవుళ్ళతో వ్యవహారం కాబట్టి శేషమ్మని ఏమీ అనలేక, కక్కలేక మింగలేక తమలోతాము కుమిలిపోతున్నారు.

కొత్తగా పెళ్ళయింది. మూడునిద్రలు పూర్తయ్యాయో లేదో శేషమ్మ పుణ్యక్షేత్రాల సందర్శన అని తిరుపతి, శ్రీకాళహస్తి, అన్నవరం తిప్పింది. ఇంకా నయం కాశీ, రామేశ్వరం పోదామనలేదు.

## ఎవరినీ నమ్మదట!

*తన మేనేజర్ డ్రగ్స్ కేసులో అరెస్ట్ అయిన తరువాత కాజల్ ఒక నిర్ణయానికి వచ్చిందట! ఇక మీద ఎవరినీ నమ్మకూడదనీ, తన వ్యవహారాలు తను లేదా తన పేరెంట్స్ మాత్రమే చూసుకోవాలనీ డిసైడ్ అయ్యిందట! తన మేనేజర్ ఇలాంటివాడు అని తెలిసి ఉంటే అస్సలు దగ్గరకు రానిచ్చేది కాదని చెబుతోందట! అతగాడితో చనువుగా ఉన్న ఫోటోలు కూడా ఫేక్ ఫోటోలే అని, అతనితో తనకు ఎప్పుడూ అంత చనువు లేదని స్పష్టం చేసింది.*

పోనీలే దేవాలయాల సందర్శనం మంచిదేలే అని సమాధానపడ్డాడు రాంబాబు. యాత్రలకు వెళ్ళొచ్చారో లేదో ఇంట్లో పూజలు, భజనలు మొదలు పెట్టించింది సీతతో.

కొత్తగా పెళ్ళయింది. పెళ్ళాన్ని తీసుకుని తెనాలో, బెజవాడో వెళ్ళి సినిమాలకీ, షికార్లకీ సరదాగా తిరుగుదామంటే, రోజూ పూజలతో సీత బిజీ అయిపోయింది. ఉపవాసాలుండి పూజలు చేస్తూ రాత్రికి చొప్పకట్టలా పడిపోతోంది.

రొమాంటిక్ మూడ్‌వచ్చి మీద చెయ్యివేస్తే ఆడ తాచులా కస్సుమంటోంది సీత.

"పూజలు చేస్తున్నా, నిష్టగా ఉండాలి. పవిత్రంగా గడపాలని అత్తయ్య చెప్పింది. దూరం... దూరం...!" అన్నది సీరియస్‌గా.

అత్తగారింట్లో మూడు నిద్రలప్పుడుతప్ప సీతని తర్వాత ముట్టుకుని ఎరగడు భర్త రాంబాబు. మనిషి నెత్తురు రుచి చూసిన పులిలా అసహనంతో గాండ్రుమంటున్నాడు రాంబాబు.

ఒకరోజు తల్లిమీద ఎగిరాడు.

"ఏం పూజలే అమ్మా ఇవి! ఉపవాసాలు చేసి




చేసి రోజు రోజుకీ నీరసించిపోతోంది సీత. మొహంలో కళకూడా తగ్గింది. చేసిన పూజలు చాల్లే! పనిపాటలు చేసుకుని బతికే మనకు ఎందుకే ఇన్ని పూజలు?"

'నీ మొహంలేరా! ఆడవాళ్ళు పూజలు, నోములు మానెయ్యబట్టే పెళ్ళిళ్ళు పెటాకులవుతున్నాయి. ఏదో బతికాం, ఉద్యోగాలు చేస్తున్నాం, ఊళ్ళు ఏలుతున్నాం అని విర్రవీగుతున్నారు అమ్మాయిలు. పెద్దవాళ్ళంటే భయం, దేవుళ్ళంటే భక్తీ లేవు. మొక్కై వంగనిది మానై వంగుతుందా? కాపురానికి వచ్చిన కొత్తలోనే అన్నీ నేర్పాలి. నేనేం పిచ్చిదాన్నై చేయిస్తున్నానా ఈ పూజలన్నీ? ఇటువంటి సంప్రదాయాలు పాటించబట్టే శాస్త్రిగారి కోడలు పద్ధతిగా ఒద్దిగ్గా సంసారం చేసుకుంటోంది. ఆ పిల్లని చూస్తే ఎంత ముచ్చటగా ఉంటుందో? మన సీతకూడా అట్లా ఉండాలని నా తాపత్రయం. అర్థమైందా?"

కొడుక్కి చీవాట్లు పెట్టింది శేషమ్మ.

రాంబాబు దిక్కుతోచక పెళ్ళి కుదిర్చిన నాగరాజుతో మొరపెట్టుకున్నాడు.

"మీ నాన్న అన్నీ నాకు చెప్తున్నాడులేరా! మీ అమ్మది మొండిపట్టు. తను ఏదైతే అనుకుంటుందో అది చేసి తీరుతుంది. ఒరే అల్లుడూ! సీతతో మీ అమ్మ పూజలు, భజనలు అని ఉపవాసాలు చేయించి ఉక్కిరిబిక్కిరి చేస్తున్నది ఎందుకో తెలుసా?" అడిగాడు నాగరాజు.

"ఎందుకేంటి మావయ్యా! సీతకి పెద్దలంటే భయం, దేవుళ్ళంటే భక్తి నేర్పడానికి. శాస్త్రిగారి భార్య చెప్పిందట" అన్నాడు రాంబాబు.

"నీ మొహం కదూ! బుద్ధి తక్కువ వెధవా! అందులో ఉన్న మర్మం ఏంటో తెలుసుకో! సర్కస్‌లో పెద్దపులిని ఆడిస్తాడు మాస్టర్. ఆడు చెప్పినట్టు ఆడుతుంది పులి. అది తెలుసు మనకు. అలా అది మనమాట వినాలంటే బోనులో బంధించి తిండి పెట్టకుండా మాడ్చి చంపుతారు. చెప్పినమాట వింటేనే తిండి అని దానికి అర్థమయ్యేవరకు పులికి ఉపవాసమే! సీత పరిస్థితి ప్రస్తుతం అలాంటిదే."

నాగరాజు మాటలకు అదిరిపడ్డాడు రాంబాబు.

"అయ్యబాబోయ్!" అన్నాడు.

"నిన్ను వెర్రివాణ్ణి చేసి సీతని ఆడిస్తోంది మీ అమ్మ. కొత్తగా పెళ్ళైన జంటని ఊటీకో, కొడైకెనాల్‌కో హనీమూన్ పంపుతారు ఎవరైనా! మీ అమ్మ మాత్రం పుణ్యక్షేత్రాలకు తిప్పిందంటే అర్థంచేసుకో ఎంత శాడిస్టో! ఈ పూజలు ఇంతటితో ఆగవురా పిచ్చి సన్నాసీ. వారంరోజులు పూజలు కొంచెం నయం. ఇంకా ముందు ముందు కార్తీకమాసం నోములని నెలంతా పస్తుపడుకోబెడుతుంది కోడల్ని. తర్వాత చిత్రగుప్తుడి నోము, పదహారు ఫలాల నోము, నూట ఎనిమిది పూల నోము, లక్షవత్తుల నోము వగైరా మొదలుపెట్టిస్తుంది"

మతిపోయిన వాడిలా అయ్యాడు రాంబాబు.

"కొంతకాలానికి సీత బ్రెయిన్ వాష్పైపోయి, మైండ్‌సెట్ మారిపోయి జీవితాన్ని పూజలకు, నోములకు అంకితం చేస్తుంది. గుళ్ళో గంగానమ్మ అయిపోతుంది. అత్తని ఇలలో దేవతని పొగుడుతూ మీ అమ్మకు బానిస అవుతుందన్నమాట. ఇక నువ్వు పొలంలో మంచెమీద పడుకోవాల్సిందే! నిన్ను పెళ్ళాంతో కాపురం చెయ్యనివ్వదు మీ అమ్మ! అర్థమైందా?" అన్నాడు నాగరాజు.

"అర్థమైంది మావయ్యా! బాగా అర్థమైంది. ఇక నా గతి ఏంటి?" అంటూ తరుణోపాయం సూచించమన్నాడు రాంబాబు.

రాంబాబు చెవిలో తరుణోపాయం ఉపదేశించాడు నాగరాజు.

***

తర్వాత పొన్నపల్లె నుంచి కబురు వచ్చింది. 'సీత సవతి తల్లికి ఆరోగ్యం బాగాలేదు. గుంటూరు ఆసుపత్రికి తీసుకెళ్ళారు. కొన్నాళ్ళు ఇల్లు చూసుకోవడానికి పంపండి' అని.

"అయ్యో పాపం!" అని రాంబాబు సీతని వాళ్ళింట్లో వదిలివచ్చాడు.

రోజులు గడుస్తున్నాయి. వారం, రెండు వారాలు, నెల రోజులు గిరుక్కున తిరిగిపోయాయి. కోడలు పుట్టింటి నుంచి తిరిగి రాకపోయేసరికి శేషమ్మలో ఏదో అనుమానం పొడసూపింది.

"వెళ్ళి కోడల్ని తీసుకురా!" అని రాంబాబుని తరిమింది. రాంబాబు ముఖం వేలాడేసుకుని వచ్చాడు.

"అమ్మా! కొంప మునిగిందే!" అని ఏడుపు ముఖం పెట్టాడు వచ్చీరాగానే.

"ఏమైందిరా! సీత బాగుందా?" అని ఆత్రుతతో అడిగింది శేషమ్మ.

"దానికేం గుండ్రాయిలా ఉంది. రానని అడ్డం తిరిగిందే అమ్మా! నన్ను తిట్టిపోసింది. ముచ్చులా కనిపిస్తుందిగానీ మహాగడుసుదే అది. మీ అమ్మతో నేను వేగలేను. నా బతుకంతా పూజలు, నోములు, వ్రతాలేనా? పెళ్ళయినవాళ్ళు హనీమూన్‌కి వెళ్తున్నారు. ఖర్మ. మీ అమ్మ తీర్థయాత్రలు చేయించింది మనచేత. ఉపవాసాలు చెయ్యడం నావల్ల కాదు. వేరు కాపురం పెడితే మీ ఊరు వస్తాను! లేదంటే లేదు. మీ అమ్మ దగ్గర కాపురం నావల్ల కాదు. పెళ్ళికి ముందే మీ అమ్మ గయ్యాళి గంగమ్మ అని చెప్పారు. మా నాన్నకి అర్థం కాలేదు, అని గొడవ పెట్టుకుందే సీత" అన్నాడు రాంబాబు.

ఖిన్నురాలైంది శేషమ్మ. కోడల్ని చెప్పుచేతల్లో పెట్టుకోవాలని తను పూజల ఎత్తువేస్తే, అది వేరు కాపురం అంటూ పైఎత్తు వేసిందన్నమాట. ఇప్పుడు ఏం చెయ్యడం? వేరుకాపురం పెట్టించకపోతే కోడలు రాదు. 'మీ కోడలు పుట్టింటికి వెళ్ళి ఇంకా ఎందుకు రాలేదు?' అని ఊళ్ళో జనం కాకులు పొడిచినట్టు పొడిచి చంపుతారు. పెళ్ళి పెటాకులైందని ప్రచారం మొదలెడతారు.

శేషమ్మ కోడలికి బుద్ధి చెప్పాలని నిర్ణయించుకుంది. తన ఇంట్లోనే వేరుకాపురం పెట్టాలని ఎత్తు వేసిందేమో సీత? మేడమీద పోర్షన్‌లో దర్జాగా ఉండాలనుకుంటోందేమో? ససేమిరా ఒప్పుకోదు. వేరుకాపురం పెట్టిస్తుంది. ఎక్కడా? నీళ్ళు దొరకని శివుడి గుడి వీధిలో. అక్కడ తమ పాత పెంకుటింట్లో వేరు కాపురం పెట్టిస్తుంది. ఇక్కడ రెండంతస్థుల మేడ కట్టించకముందు ఆ పెంకుటింట్లోనే ఉండేవాళ్ళు. అక్కడ నీళ్ళు దొరకవు. బావులు తవ్వితే నీళ్ళు పడవు. తమ ఇంట్లో బోరు వేయిస్తే ఉప్పునీళ్ళు పడ్డాయి. ఎందుకూ పనికిరావు. బట్టలు ఉతుక్కోవాలంటే సబ్బు విరిగిపోతుంది. నురగ రాదు. స్నానం చేస్తే ఒళ్ళంతా ఉప్పుతేలుతుంది. ఆ వీధిలో వాళ్ళంతా తెల్లారిలేచి నీళ్ళకోసం బిందెలు పట్టుకుని

కావళ్ళు వేసుకుని చెరువుకి పరుగెత్తాల్సిందే. వానలు లేక చెరువు దాదాపు ఎండిపోయింది. బురదనీళ్ళు మిగిలాయి. అవే తెచ్చుకుని కాచుకుని వడపోసు కుని తిప్పలు పడుతున్నారు శివుడిగుడి వీధి జనం. సీతకు ఆ సంగతులేమీ తెలియవు. కొత్త కాపురం అక్కడ పెట్టిస్తే తిక్క తిన్నగా కుదురుతుంది.

పాత పెంకుటింట్లో వేరుకాపురం పెట్టించడానికి శేషమ్మ గ్రీన్ సిగ్నల్ ఇచ్చింది. తండ్రీ కొడుకులు ఆశ్చర్యపోయారు. ఆమె ఎంత గొడవ చేస్తుందో అని అనుమానిస్తున్నారు. సమస్య సామరస్యంగా పరిష్కారమైపోవడంతో ఊపిరి పీల్చుకున్నారు.

సంజీవి పెంకుటింటికి సున్నంవేయించి బాగు చేయించాడు. రాజయ్య కూతురు కొత్త కాపురానికి కావాల్సిన సారె పంపించాడు. సీత పొందికగా సామాన్లు సర్దుకుంది. ఆ చుట్టుపక్కల అమ్మల క్కలు పూజల ప్యాకేజీ సందర్భంలో సీతకు పరిచ యమైనవారే. సీతకు ఆ వీధిలో ఉన్న నీళ్ళకష్టాలు తెలియజెప్పారు. ఆ రోజుకు తలాఒక బిందె నీళ్ళు సర్దుబాటు చేశారు. రేపటి నుంచీ ఉదయం లేవ గానే సీత బిందె పట్టుకుని, రాంబాబు కావడి భుజాన వేసుకుని నీళ్ళకోసం చెరువుకి బయల్దేరా లని హెచ్చరించారు. అత్త సతాయింపులకంటే నీళ్ళ కష్టాలు ఏపాటివి? బలాదూర్ అనుకుంది సీత.

***

మర్నాడు ఉదయం తెల్లవారుతూ ఉండగానే సీతకు మెలకువ వచ్చింది. నీళ్ళుపడుతున్న శబ్దం చెవులకు సోకింది. ఆమెకు ఆశ్చర్యం కలిగింది. తలుపు తీసింది. ఇంటిముందున్న బోరు నుంచి ధారగా నీళ్ళు కారుతున్నాయి. మామూలుగా హేండిల్ పట్టుకుని చేత్తో కొడితేగానీ నీళ్ళు రావు. మరి ఈ విచిత్రం ఏమిటి? హేండ్ పంపు ముట్టు కోకుండా నీళ్ళు ఉబికి వస్తున్నాయి. ధారగా పడు తున్నాయి. ఇది ఎవరి మహాత్మ్యం?

"ఏమండీ! ఏమండీ!" అని రాంబాబుని నిద్ర లేపింది సీత.

రాంబాబు నిద్ర లేచాడు. గుర్తుకొచ్చింది. చెరు వుకు బయల్దేరాలి కావడి భుజాన వేసుకుని.

"నీళ్ళకేగా...!" అన్నాడు ఆవులిస్తూ.

"హేండిల్ కొట్టకుండానే బోరులోంచి నీళ్ళు ధారగా కారుతున్నాయి" ఉద్వేగంతో చెప్పింది సీత. రాంబాబు వెళ్ళి చూశాడు. సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యాడు. ఇదేం వింత? ఎంత విచిత్రం? చేతులు పడిపోయేట్టుగా హేండిల్ కొడితేగానీ నీళ్ళు సన్నగా కారేవికావు. బిందె నిండటానికి అర గంట పట్టేది. ఇప్పుడు నీళ్ళు ఉబికి వస్తున్నాయి. పెద్ద ధారతో కారుతున్నాయి.

రాంబాబు చిన్నపిల్లాడిలా కేరింతలు కొట్టాడు.

"సీతా! బిందెతో నీళ్ళు పట్టు. గాబు నింపు" అన్నాడు. దోసిలితో నీళ్ళుపట్టి ముఖం కడుక్కు న్నాడు. నోటికి నీళ్ళు తగిలాయి. ఇంకా ఆశ్చర్యం. నీళ్ళు తియ్యగా ఉన్నాయి. నోట్లో పోసుకుని తాగాడు. కొబ్బరి నీళ్ళలా మధురంగా ఉన్నాయి నీళ్ళు.

ఏం మహత్మ్యం జరిగిందో? ఉప్పు నీళ్ళు వచ్చే బోరులో నుంచి మంచినీళ్ళు ధారాపాతంగా కారు తున్నాయి. హేండిల్ కొట్టకుండానే నీళ్ళు కారడం ఒక చిత్రంగా ఉంటే, ఉప్పునీరు బదులు తియ్యటి నీళ్ళు రావడం ఇంకా అద్భుతం!

"సీతా! తియ్యటి నీళ్ళు. కొబ్బరి నీళ్ళు. పంచ దార నీళ్ళు" అంటూ రాంబాబు గంతులు వేశాడు.

సీత కూడా ఆ నీళ్ళు రుచి చూసింది. ఆమె ముఖం వెలిగిపోయింది. ఆనందం పట్టలేక వీధిలోకి వెళ్ళి ఇంటింటికీ చాటింపు వేసింది. చెరువుకి బయల్దేరిన వాళ్ళంతా రాంబాబు ఇంటివైపు మళ్ళారు 'క్యూ' కట్టి బోరు నీళ్ళు బిందెలతో నింపుకుంటున్నారు. అందరి ముఖాల్లోనూ ఆనందం వెల్లివిరుస్తోంది.

"సీతమ్మా! నువ్వు ఈ ఇంట్లో పాదం పెట్టావు. గంగమ్మతల్లి పొంగివచ్చింది" అని ఆడ మగా, ముసలీ ముతకా అందరూ పొగడ్తలు మొదలు పెట్టారు. సీత ఉక్కిరిబిక్కిరైపోయింది.

ఊరంతా ఈ విషయం తాటాకు మంటలా పాకిపోయింది.

'ఇంట్లో సీత పాదం మోపింది హేండిల్ కొట్ట కుండా వాటంతట అవే బోరులో నుంచి నీళ్ళు ధారగా కారుతున్నాయి. ఏనుగుతొండం అంత ధార. అంతేనా? కారేది ఉప్పునీరు కాదు, మంచి నీళ్ళు. కొబ్బరి నీళ్ళు. పంచదార పాకం'.

తండోపతండాలుగా జనం. ఊరు వాళ్ళే కాదు, చుట్టుపక్కల ఊళ్ళనుంచి కూడా జనం. పుట్టలు పగిలి నట్టు వస్తున్నారు. బోరుతల్లికి కొబ్బరికాయలు కొడుతున్నారు. బిందెలకు పసుపు, కుంకంపూసి నీళ్ళు పట్టుకుంటున్నారు.

సీతని దేవతగా పొగుడుతున్నారు.

'మూడేళ్ళుగా సరిగా వానలు పడక చెరువులు ఎండిపోయాయి. పంటకాలువలకు నీళ్ళు వదలడం లేదు. ప్రకృతి కరుణించింది. పైన వానలు కురిసి నది పొంగింది. రిజర్వాయరులోకి నీళ్ళు వచ్చాయి. పంటకాలువలకు నీళ్ళు వదిలారు. కాలువల నుంచి చెరువులు నింపారు. దానికి తోడు రాత్రి కుంభవృష్టి కురిసింది. భూమి పులకించింది. బోరుకింద నీళ్ళ పాయలో మార్పు జరిగింది. ఉప్పునీరు మంచినీరుగా మారింది. నీళ్ళు పైకి తన్నుకువస్తున్నాయి. అందుకే బోరులో నుంచి నీళ్ళధార వస్తోంది' అని గిట్టని వాళ్ళు అంటున్నారు.

ఎవరికైనా పేరు వస్తోందంటే సహించలేరు మూర్ఖులు.

సీత పాదమహిమ తెలుసుకోలేరు మరి.

శేషమ్మ కడుపు మండిపోతోంది.

'తానొకటి తలిస్తే దైవం మరొకటి తలిచింది' అన్నట్టైంది శేషమ్మ పరిస్థితి. కోడల్ని తను కష్టాల కొలిమిలోకి నెట్టాలనుకుంటే ఆమె వెళ్ళి సుఖాల గంపలో పడింది. 'కోడలుతో ఎన్ని పూజలు చేయిం చాను. ఎన్ని తీర్థయాత్రలకు తిప్పాను. అంతా పూజా ఫలమే' అని శేషమ్మ సీత పాదానికి క్రెడిట్ దక్కకుండా ప్రచారం మొదలెట్టింది. ఎవరెన్ని ప్రచా రాలు చేసినా 'సీతపాదం' మహిమాన్వితం కాదని ఎవరు నమ్ముతారు?

**సెల్: 9390085292**

## ఇంటిదయిన తాప్సీ



*ఇంటిదవడం అంటే పెళ్ళి చేసుకోవడం కాదు. ఓ ఫ్లాట్‌కి ఓనరయిందన్నమాట! తాప్సీ దక్షిణాదిని వదిలి ఉత్తరాదిన మకాం పెట్టిన ప్పటి నుంచీ ముంబయిలో ఓ ఫ్లాట్ కొనుక్కో వాలని అనుకుంటోందట! అయితే అదేదో లోన్ ద్వారా కాకుండా ఒకేసారి చెల్లించి తీసుకోవాల న్నది తాప్సీ ఆలోచన! అందుకే ఇంత కాలం వెయిట్ చేసి ముంబయిలో మంచి లొకాలిటీలో ఓ ఫ్లాట్ కొనుగోలు చేసింది. తాప్సీ ప్రస్తుతం చేతిలో ఉన్న సినిమాలతో బిజీగా ఉండడంతో ఇంటి డెకరేషన్ అంతా తాప్సీ చెల్లెలు చూసు కుంటోందట! షూటింగ్ బిజీ అయిపోగానే తాప్సీ ఓ నెలరోజులు గ్యాప్ తీసుకుని ఆ ఇంట్లో కుటుంబ సభ్యులతో ఎంజాయ్ చేస్తుందట!*




## గుండెదడ తగ్గించే చాక్లెట్



చాక్లెట్‌ను తరచూ తీసుకోవడం వలన కలిగే లాభాల గురించి తెలిసిందే! వాటితో పాటు మరొక విషయాన్ని పరిశోధకులు గుర్తించారు. వారంలో ఒక సారి, నెలలో మూడు లేదా నాలుగు సార్లు చాక్లెట్, చాక్లెట్ ఆధారిత ఉత్పత్తులను తీసుకోవడం వలన గుండెదడ వచ్చే ప్రమాదాన్ని చాలా వరకూ తప్పించుకోవచ్చన్న విషయం వీరి అధ్యయనంలో వెల్లడైంది. గుండెనొప్పి లేదా గుండె పోటుకు కారణమయ్యే గుండెదడ వలన కొన్ని సార్లు మరణం కూడా సంభవించవచ్చు. ఈ విపత్తు నుంచి తప్పించుకోవాలంటే చాక్లెట్ లేదా చాక్లెట్ ఆధారిత ఉత్పత్తులను తరచూ తీసుకోవాలని వీరు సూచిస్తున్నారు. సుమారు 60వేల మంది మీద వీరు అధ్యయనాలు నిర్వహించి ఈ విషయం వెల్లడించారు. వీరిని రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపు వారికి నెలలో ఒకటి రెండు సార్లు మాత్రమే చాక్లెట్ ఆధారిత ఉత్పత్తులను అందించారు. మరో గ్రూపు వారికి నెలలో మూడు నాలుగు సార్లు చాక్లెట్ ఉత్పత్తులను ఇచ్చారు. అనంతరం వీరి గుండె పనితీరును పరిశీలించారు. మొదటి గ్రూపు వారిలో పది శాతం మాత్రమే గుండెదడ తగ్గిన విషయాన్ని గుర్తించారు. రెండవ గ్రూపు వారిలో 20 శాతం వరకూ గుండెదడ తగ్గడాన్ని కనుగొన్నారు. అయితే చక్కెర వ్యాధిగ్రస్థులు చాక్లెట్ ఆధారిత ఉత్పత్తులను తీసుకునే సమయంలో వైద్యులను సంప్రదించాలని వారు సూచించారు.

## ఎక్కువగా టీవీ చూస్తే షుగర్?



షుగర్ (చక్కెర వ్యాధి) రావడానికి పలు అంశాలు కారణం అవుతాయన్న విషయం తెలిసిందే! ఆ అంశాల్లో ఇప్పుడు టీవీ వీక్షణం కూడా చేర్చుకోవాలని పరిశోధకులు అంటున్నారు. లండన్‌లో సుమారు ఐదువేల మంది పిల్లల మీద సెయింట్ జార్జ్ యూనివర్సిటీ పరిశోధకులు దాదాపు మూడు సంవత్సరాల పాటు అధ్యయనం నిర్వహించారు. వీరిలో 60 శాతం మందికి రోజులో ఎక్కువ శాతం టీవీ చూడడం, ఎక్కువ సేపు కంప్యూటర్ ముందు గడపడం అలవాటు. మూడు సంవత్సరాల తరువాత వీరిలో 30 శాతం మంది పిల్లల్లో చక్కెర వ్యాధి లక్షణాలను పరిశోధకులు గుర్తించారు. అంతేకాకుండా ఆకలిని ప్రేరేపించే హార్మోన్లు కూడా ఎక్కువ శాతం విడుదల అవడాన్ని వీరు గమనించారు. కేవలం టీవీ చూడడం వలనే వీరిలో షుగర్ లక్షణాలు పొడసూపాయా? అన్న విషయాన్ని మాత్రం వీరు నిర్ధారించలేకపోతున్నారు. దీని మీద ఇంకా అధ్యయనాలు నిర్వహించాలని వీరు అంటున్నారు.

## మెదడును ఉత్తేజపరిచే గ్రీన్ టీ

గ్రీన్ టీతో బరువును అదుపులో ఉంచుకోవచ్చు అన్న సంగతి తెలిసిందే! ఈ టీ తాగడం వలన మరో ప్రయోజనం కూడా ఉందని అంటున్నారు పరిశోధకులు. గ్రీన్ టీలోని ఇజిసిజి అనే సమ్మేళనం మెదడును ఉత్తేజపరిచి దాని పనితనాన్ని మెరుగుపరుస్తుందన్న విషయం చైనాలోని ఓ యూనివర్సిటీ వారు నిర్వహించిన పరిశోధనల్లో వెల్లడైంది. కొన్ని ఎలుకల మీద వీరు పరిశోధన నిర్వహించారు. వీటికి ప్రతిరోజూ మామూలుగా ఇచ్చే ఆహారంతో పాటు గ్రీన్ టీని కూడా ఇచ్చారు. కొన్ని రోజుల అనంతరం వీటిని పరిశీలించగా, వీటి బరువులో మార్పును గమనించారు. అంతేకాకుండా వీటి మెదడు పనితీరు గతం కన్నా చురుకుగా ఉండడం గుర్తించారు. ఇదంతా గ్రీన్ టీ వలనే కలిగిందా? లేక మరేదైనా కారణం ఉందా? అన్న విషయం మీద వీరు ఇంకా పరిశోధనలు నిర్వహిస్తున్నారు. ఏది ఏమైనా రోజూ రెండు లేదా మూడు కప్పుల గ్రీన్ టీ తాగడం వలన మంచి ఫలితాలే పొందవచ్చని వీరు స్పష్టం చేస్తున్నారు.



## మృత్యువు దగ్గర చేసే ఒంటరితనం



ఒంటరిగా ఉండడం, నలుగురితో కలవకపోవడం వంటి కారణాలు వ్యక్తులను మృత్యువుకు చేరువ చేస్తాయని అంటున్నారు అమెరికా పరిశోధకులు. రెండు దఫాలుగా నిర్వహించిన పరిశోధనల్లో ఈ విషయాన్ని వారు గుర్తించారు. మొదటిసారి సుమారు మూడు లక్షల మంది మీద దఫాల వారీగా అధ్యయనం నిర్వహించారు. వీరిలో చాలామంది ఒంటరితనంతో బాధపడుతున్న వారే! కొన్ని నెలలు అనంతరం ఒంటరితనంతో బాధపడుతున్న వారిలో 20 శాతం మంది అకాల మృత్యువాత పడ్డారు. రెండవసారి 3.4 లక్షల మంది మీద అధ్యయనం నిర్వహించారు. రెండవ సారి కూడా మొదటిసారిలాగా చాలామంది మృత్యువుకు చేరువయ్యారు. ఒంటరితనంతో బాధపడుతున్న వారిలో అధికబరువు, ఒత్తిడి, రక్తపోటు, చక్కెర తదితర ఆరోగ్య సమస్యలను వీరు గుర్తించారు. చిన్న వయస్సులోనే ఒంటరితనంతో బాధపడేవారిలో ఈ సమస్యలు కచ్చితంగా కనిపిస్తాయనీ, ఇవే వీరిని మృత్యువుకు చేరువ చేస్తాయనీ పరిశోధకులు అభిప్రాయపడుతున్నారు.

—అవినాష్

# వేధించే నడుంనొప్పికి చెప్పేద్దాం గుడ్‌బై

**ఇటీవల** నిర్వహించిన సర్వేల ప్రకారం, 80 నుంచి 90 శాతం మంది నడుం నొప్పితో బాధపడుతున్నారు. 40 శాతం మంది మెడ నొప్పితో బాధ పడుతున్నారు. సాధారణంగా ఏ నొప్పి అయినా మూడు నాలుగు వారాలలో తగ్గిపోతుంది. అప్పటికీ తగ్గకపోతే తప్పనిసరిగా వైద్యుల సలహా తీసుకోవాలి. వెన్ను నొప్పులలో డిస్క్ సమస్యలు, స్పాండిలోసిస్, కణుతులు, స్కోలియోసిస్, ట్యూమర్స్, సయాటికా సమస్యలు ఎక్కువగా ఉంటాయి. మన శరీర వ్యవస్థలో వెన్నెముక మూలస్తంభంమాదిరిగా పనిచేస్తుంది. వెన్నెముక పలు విభాగాల సమ్మేళనం. వెన్నెముకకు తోడుగా కండరాలు, లిగమెంట్లు, డిస్కులు ఉంటాయి. వెన్నెముక సులభంగా వంగడానికి డిస్కులు లిగమెంట్లు తోడ్పడతాయి. వెన్నుపూసల మధ్య రబ్బరు కుదురులాంటి ఒక పదార్థం ఉంటుంది. దీన్ని డిస్క్ అంటారు. వెన్ను పాము పొడవునా ఎన్నో నరాలు వెళుతుంటాయి. మెడభాగం నుంచి వెళ్లే నరాలు చేతుల్లోకి, నడుము నుంచి వెళ్లే నరాలు కాళ్లలోకి విస్తరిస్తాయి. వీటిలో కొన్ని నరాలు మూత్రకోశం, మలవిసర్జన భాగంతో పాటు లైంగిక భాగాల్లోకి విస్తరిస్తాయి. అందువల్లనే డిస్క్ సమస్యలు వచ్చిన వారికి లైంగికపరమైన సమస్యలు మొదలవుతాయి. డిస్కులలో రెండు రకాల ఇబ్బందులు ఉంటాయి. ఒకటి డిస్క్ ప్రొలాప్స్, రెండవది డిస్క్ డీజెనరేటివ్ డిస్క్ డిసీజ్.

డిస్క్‌కు బయట ఉన్న పొర బలహీనమవడం వల్ల డిస్క్ వెనకకు జరిగి కాళ్లలోకి వచ్చే నరాలపై ఒత్తిడి తెస్తాయి. దీనివల్ల కాళ్లలో తిమ్మిర్లు, మొద్దుబారడం జరుగుతుంది. దీనిని స్లిప్ డిస్క్ అంటారు. ఒక్కొక్కసారి యాన్యులస్ అనే పొర చిట్లి జెల్లీలాంటి డిస్క్ మెటీరియల్ బయటకు వస్తుంది. దీనిని డిస్క్ ప్రొలాప్స్ అంటారు. కాలును వంచకుండా తిన్నగా ఉంచి పైకి ఎత్తినపుడు కాలులో నొప్పి పెరిగితే దాన్ని డిస్క్ ప్రొలాప్స్ అంటారు. ఇక మెడప్రాంతంలో ఉండే పూసలను సర్వైకల్ వర్టిబ్రా అంటారు. వర్టిబ్రా మధ్యలో ఉన్న డిస్క్ అరిగి కొంచెం పక్కకు జరిగి అక్కడ ఉన్న నాడులను ఒత్తిడికి గురిచేస్తుంది. దీనివల్ల మెడనొప్పి వస్తుంది.

నా పేరు సరస్వతి. మా ఊరు అమలాపురం. నేను గత మూడేళ్లుగా తీవ్రమైన నొప్పితో బాధపడుతున్నాను. ఎంతో చలాకీగా తిరిగే నేను నిస్సహాయకురాలినయ్యాను. న్యూరోసర్జన్ నా యంఆర్ఐ రిపోర్టు చూసి డిస్క్ బల్జ్, నర్వ్ కంప్రెషన్ ఉందని చెప్పారు. దీనికి సర్జరీ ఒక్కటే మార్గమని చెప్పారు. డాక్టర్‌గారి ఇంటర్వ్యూ టీవీలో చూసి హైదరాబాద్‌కు వచ్చి చూపించుకున్నాను. డాక్టర్ మధువారణాశి గారు ఇచ్చిన ట్రీట్‌మెంట్‌తో నెలరోజుల్లోనే నొప్పి తగ్గిపోయింది. మూడు నెలల్లో 90 శాతం నొప్పి తగ్గిపోయింది. నా పని నేను చేసుకోవడం ప్రారంభించాను. ఒక ఏడాది పాటు నన్ను ట్రీట్‌మెంట్ తీసుకొమ్మన్నారు. ఇప్పుడు నేను ప్రశాంతంగా ఎలాంటి బాధలేకుండా, హాయిగా ఉన్నాను. సర్జరీ అవసరం లేకుండా పోయింది. నాకు తిరిగి జన్మనిచ్చిన డాక్టర్ మధువారణాశిగారిని జీవితాంతం మరచిపోలేను.

## మెడనొప్పికి కారణాలు

మెడ కండరాలు ఒత్తిడికి లోనవడం, సర్వైకల్ స్పాండిలోసిస్, సర్వైకల్ డిస్క్ ప్రొలాప్స్, వంశపారంపర్యం, టిబి వల్ల ఎముకలలో మార్పులు చోటు చేసుకోవడం, సరియైన భంగిమలో కూర్చోకపోవడం, ఎక్కువ బరువులు ఎత్తడం వంటివి కారణాలుగా ఉంటాయి. దీనివల్ల సీ1, సీ2, సీ3, సీ4, సీ5, సీ6, సీ7 వర్టిబ్రాలలో సమస్యలు వస్తాయి. ఈ డిస్కులలో సమస్యల వల్ల తలనొప్పి, మెడనొప్పి, తల తిరగడం, మెడ బిగుసుకుపోవడం, చేతులలో కాళ్లలో తిమ్మిర్లు, మల, మూత్ర విసర్జనలో నియంత్రణ తప్పడం, మెడ కండరాలు బలహీనపడటం వంటి లక్షణాలు కనిపిస్తాయి. వెన్నెముకకు దెబ్బలు తగలడం, ప్రయాణిస్తున్న వాహనం గోతుల్లో పడినప్పుడు డిస్కులపై ఒత్తిడి పడినప్పుడు సయాటికా నొప్పి వస్తుంది.


డా. మధు వారణాశి, ఎం.డి
ప్రముఖ హోమియో వైద్యులు
ప్లాట్‌నెం 188,
వివేకానందనగర్ కాలనీ,
కూకట్‌పల్లి, హైదరాబాద్
ఫోన్ : 8897331110
8886 509 509




# హెచ్ఐవికి హోమియోతో పరిష్కారం

**క్లినిక్** రోజులాగానే పేషెంట్స్‌తో బిజీగా ఉంది. రిసెప్షన్‌లో అశ్విని అప్పటికే చాలా అపాయింట్‌మెంట్స్ ఇచ్చేసింది. జూ. డాక్టర్ నా ఛాంబర్‌లో కేసులు తీసుకుంటుంది. లోపలికి 25 ఏళ్ల యువకుడు వచ్చాడు. చెప్పు నీ ప్రాబ్లమ్ ఏమిటి? అని అడిగాను. దానికి అతను నసుగుతూ ఉన్నాడు. సమస్య ఏమిటి చెప్పు బాబూ... చెప్పు అని అడిగాను. సార్ నా పేరు రాజు, అనంతపురం నుంచి వచ్చాను. మీతో పర్సనల్‌గా మాట్లాడాలి అన్నాడు. జూ. డాక్టర్‌ను బయటకు పంపించాక అతను నెమ్మదిగా చెప్పడం ప్రారంభించాడు. సార్, నేను 5 నెలల క్రితం మా ఫ్రెండ్స్‌తో కలిసి ఒక అమ్మాయి దగ్గరకు వెళ్లాను. తర్వాత బ్లడ్‌టెస్ట్ చేయించుకుంటే హెచ్ఐవి పాజిటివ్ అని వచ్చింది. ఇంట్లో ఎవరికీ చెప్పలేదు. నాకింకా పెళ్లికాలేదు. నాకు చనిపోవాలనిపిస్తోంది. మీరే నాకు ఏదో ఒక దారి చూపిస్తారని ఆశతో వచ్చాను అని కళ్ల నీళ్లు పెట్టుకున్నాడు. హెచ్ఐవి రిపోర్ట్ చూస్తే రియాక్టివ్ అని ఉంది. చూడు రాజా....అయిపోయిందేదో అయిపోయింది. బయపడకు. హోమియోలో మంచి మందులున్నాయి. నేనున్నాను అని ధైర్యం చెప్పి హెచ్ఐవి ఎయిడ్స్ గురించి వివరించాను.

## హెచ్ఐవి అంటే ఏమిటి?

హెచ్ఐవిని శరీరంలో రోగనిరోధక శక్తిని క్షీణింపచేసే ఒక వైరస్‌గా గుర్తించారు. ఈ వైరస్ శరీరంలో సహజసిద్ధంగా ఉండే రోగనిరోధక శక్తిని క్రమేణా బలహీనపరుస్తుంది. చివరకు ఎయిడ్స్ రూపంలో బయటపడుతుంది. ఇది నిజానికి బలహీనమైన వైరస్సే. శరీరం వెలుపల ఉంటే మరిగిస్తే చాలు సులువుగా నశిస్తుంది. కానీ ఈ వైరస్ మానవ శరీరాన్ని తన నివాసంగా చేసుకుంటే మాత్రం శరీరాన్ని పూర్తిగా దెబ్బతీస్తుంది. శరీరంలో వ్యాధి నిరోధక శక్తి తగ్గడం వల్ల వ్యాధి కారక సూక్ష్మక్రిముల ద్వారా కలిగే ఇన్‌ఫెక్షన్లను ఎదిరించే శక్తిని శరీరం కోల్పోతుంది.

## ఎయిడ్స్ లక్షణాలు

1) నెల రోజులుగా జ్వరం
2) విరేచనాలు కావడం, దానికి కారణం అంతుపట్టకపోవడం.
3) నెలరోజుల్లో శరీరం బరువు 10 శాతం తగ్గిపోవడం.
4) దీర్ఘకాలికంగా జలుబు, లింప్ గ్లాండ్స్ వాపు ఉండటం.
5) దగ్గు, సాధారణమైన దురద, చర్మసంబంధ వ్యాధులు.
6) గొంతు బొంగురుపోవడం, నోటిలో పూత తగ్గకపోవడం.

## చికిత్స

అతనికి లక్షణాలన్నీ వివరించాక చికిత్స మొదలుపెట్టాను. అతని లక్షణాలను బట్టి మందులు ఇచ్చాను. దానితో పాటు ఆహారంలో బాదం, అరటి పళ్లు, దానిమ్మ, పాలు, చేపలు తీసుకోమన్నాను. రెండు నెలల్లో చాలా మార్పు వచ్చింది. ఆకలి పెరిగింది. నీరసం తగ్గింది. రెండో సారి వచ్చినపుడు నాలో తెలియని శక్తి వచ్చింది సార్, మీ హోమియో మందులు బాగా పనిచేశాయి. నేను బతుకుతాననే నమ్మకం వచ్చింది. రెగ్యులర్‌గా ట్రీట్‌మెంట్‌కు వస్తాను సార్ అని అన్నాడు. 7 నెలల తరువాత మళ్లీ టెస్టులు చేయించాము. సిడి4 కౌంట్ 750కి పెరిగింది. అతని ఆనందానికి అంతు లేదు. మీరు నా ప్రాణాలు కాపాడరు. మీకెంతో రుణపడి ఉంటాను సార్ అన్నాడు. అతనికి మరో ఆరు నెలలు ట్రీట్‌మెంట్ కంటిన్యూ చేశాను. అతని రోగనిరోధక శక్తి బాగా పెరిగింది. ఇప్పుడు అతను ఆరోగ్యంగా ఉన్నాడు.




**దూరంలో మినుకుమినుకుమంటూ ఏదో వెలుతురు కనిపిస్తోంది. వాయు తన ముందు వెళ్తున్న గుర్రాలను, ఎడ్లబళ్లను, పాదచారులను అవలీలగా వెనక వదిలేసి, ముందుకు దూసుకెళ్తోంది. నిధి తనలో నవ్వుకున్నాడు. అంతవేగంగా వెళ్ళమని వాయుని తాను హెచ్చరించలేదు. అది శ్వేతాశ్వం సహజమైన వేగంలా ఉంది. జవనాశ్వాల సామాన్యమైన నడక వేగం అంతేనేమో!**

కాస్సేపట్లో, మినుకుమినుకుమంటూ కనిపించిన వెలుతుర్లు స్పష్టంగా దర్శనమిస్తున్నాయి. ప్రవేశ ద్వారంలా ఉన్న నిర్మాణానికి, రెండువైపులా అమర్చబడిన దివిటీలవి. అది హరిహరపురం ప్రవేశ ద్వారంలా ఉంది. మూడడుగుల ఎత్తులో కటకటాలు ప్రవేశాన్నీ, నిర్గమనాన్నీ నిషేధిస్తూ ద్వారంలో అడ్డంగా ఉన్నాయి. ఈటెలూ, శిరస్త్రాణాలూ ధరించిన భటులిద్దరూ రెండు వైపులా నిలుచున్నారు.

నిధి కటకటాలను సమీపించాడు.

"గుర్రం దిగాలి!" ఒక భటుడు హెచ్చరించాడు.

నిధి గుర్రం మీంచీ కిందికి జారాడు. భటులు అతన్ని ఎగాదిగా చూశారు. ఇద్దరి చూపులూ నిధి ఖడ్గం మీద క్షణకాలం ఆగాయి.

"వేషం చూస్తే ఈ పరగణా వ్యక్తిలా లేవు. ఏ ఊరు నాయనా!" ఒక భటుడు ప్రశ్నించాడు.

"కోటీరనగరం..."

"నీకు అర్ధవరహా; నీ అశ్వానికి అర్ధవరహా... సుంకం చెల్లించాలి హరిపురంలోకి ప్రవేశించాలంటే..."

"నాది కోటీరనగరం అని చెప్పాను. అది పట్టణం కాదు, రాజధాని నగరం. ఆ నగర ప్రవేశానికే సుంకం లేదు. ఇది చిన్న పట్టణం అని విన్నాను.." నిధి నవ్వుతూ అన్నాడు.

"సుంకం లేకపోతే, లేదా ఉండీ చెల్లించే ఉద్దేశం లేకపోతే, చిల్లిగవ్వ చెల్లించే అవసరం లేకుండా వెనక్కి తిరిగి, నీ కోటీరనగరానికి వెళ్ళిపోవచ్చు!" ఒక భటుడు ఎలుకతో ఆడుకునే పిల్లిలా... అన్నాడు.

"ఊరికే అన్నాను. ఇదిగో వరహా!" దట్టీలో నుంచి వరహా తీసి అందిస్తూ అన్నాడు.

భటుడు ఉల్లాసంగా అన్నాడు. "మరొక పని కూడా చేయొచ్చు... సుంకం లేని ద్వారం కోసం వెదుకుతూ రాత్రంతా కోటను ప్రదక్షిణంగా చుట్టి, తెల్లారేసరికి, ఇక్కడికే వచ్చి, సుంకం చెల్లించి, పుర ప్రవేశం చేయొచ్చు"

"నువ్వు మాంచి హాస్యప్రియుడివన్నా! ఇదిగో... తీసుకో!" నిధి వరహా ఇస్తూ అన్నాడు.

రెండవభటుడు ద్వారం దగ్గరగా, రెండు సన్నటి రాతిస్తంభాలమీద అడ్డంగా ఉన్న రాతిపలక నుండీ వేలాడుతున్న గుండ్రటి గంటను సుత్తితో మోదాడు. జేగంట ఖంగుమంది. ద్వారం అటువైపు నుండీ కందెన లేని అచ్చు ఆధారంగా తిరిగే చక్రం చేసే కీచుశబ్దంలా, లోహం మరో లోహానికి రాచుకుంటూ శబ్దం చేస్తోంది. ఆ శబ్దానికి స్పందిస్తున్నట్టు కటకటాలు పైకి లేస్తున్నాయి. సుంకం తీసుకున్న భటుడు వెళ్ళమన్నట్టు సైగ చేశాడు. నిధి కటకటాల చట్రం క్రిందుగా కదిలాడు. వాయు అతని నీడలా కదిలింది.

భటులిద్దరూ గుర్రం మీద బంగారు రంగు రేఖను అప్పుడే చూసినట్టున్నారు.

"ఆగు, సోదరా ఆగు!" ఒక భటుడు అరిచాడు.

నిధి ఆగి, తిరిగి చూశాడు.

"గుర్రం మీద... బంగారు పూతేనా?" ఒక భటుడు కుతూహలంగా అడిగాడు.

"తోకో?" రెండవ భటుడన్నాడు. "తోక బంగారు వెంట్రుకల కుచ్చా?"

"చెబుతాను. అయితే, మీ రెండు ప్రశ్నలకీ సమాధానాలు కావాలంటే రెండు వరహాలివ్వాలి! దారిపొడవునా ఈ ప్రశ్నలకి సమాధానాలు చెబుతూ సంపాదించిన సొమ్ము లోంచే మీకు సుంకం చెల్లించాను."

"నిజంగా!"

"నా వృత్తి అదేగా?" నిధి నవ్వుతూ గుర్రం ఎక్కాడు. గుర్రం ముందుకు కదిలింది.

"కూనయ్య, అతను చెప్పింది నిజమేనంటావా?" రెండవ భటుడు అడిగాడు.

"కావొచ్చేమో, బంగారు రంగు పూసి, సంపాదిస్తున్నాడేమో! కూటికోసం కోటి విద్యలన్నారుగా, రంగా!" కూనయ్య అన్నాడు.

ప్రవేశద్వారం దాటాక మార్గం ఒక రథం వెళ్ళగలిగేంత వెడల్పుతో ఇరుకుగా మారింది. రెండు వైపులా నల్లరాతి కోట గోడ. ఇరుకు మార్గం మెలికలు తిరుగుతూ వెళ్తోంది. ప్రయాణ వేగాన్ని నిరోధించడానికి నగర ప్రవేశమార్గాలు అలా వంకరటింకరగా నిర్మిస్తారని నిధికి తెలుసు. మలుపుల దగ్గర, రెండు వైపులా గోడకు అమర్చిన దివిటీలు వెలుగుతున్నాయి. కొన్ని నిమిషాల ప్రయాణం అతన్ని విశాలంగా ఉన్న వీధిలోకి చేర్చింది. ఇరువైపులా, స్తంభాల మీద మంటలు మండుతూ, అడుగు ఎత్తు లేస్తూ రాత్రిని పగలుగా మార్చే ప్రయత్నం చేస్తున్నాయి. స్తంభాల పైభాగాన గుండ్రటి పళ్లెం ఉంటుంది. ఆ పళ్లెం నిండుగా ఆముదపు గింజలు పోసి, వాటికి నిప్పు ముట్టిస్తారు. ఆ గింజలలోని ఆముదం మండడం ప్రారంభిస్తుంది. ఇలాంటి వీధి దీపాల వ్యవస్థ తన నగరంలో కూడా ఉంది. ఆ దీపాలను 'ఏరండ దీపాలు' అంటారు. ఏరండ బీజం అంటే ఆముదం గింజ... నిధి తన ఆలోచనలకు లోపలే నవ్వుకుంటూ అశ్వాన్ని ఆపాడు. ఒక ఇంటిలోంచి అయిదారుగురు వ్యక్తులు ఇవతలికి వచ్చి, వీధికి అడ్డం పడి గుంపుగా నడుస్తున్నారు. వెళ్తున్న వ్యక్తుల్ని చూస్తూ ఆ ఇంటి ముందు ఒక వ్యక్తి నిలుచున్నాడు. నిధి గుర్రాన్ని ఆయన సమీ

### జరిగిన కథ

**బాకీ**పడ్డ కప్పం వెంటనే చెల్లించాలని సుభిక్ష రాజ్య మహారాజుకు చక్రవర్తి విజయానందులు లేఖ పంపిస్తాడు. దాంతో జ్యోతిష్కుడు చెప్పినవిధంగా, నవనిధులను సాధించాల్సిందిగా నిధిని కోరతాడు మహారాజు. నిధి ముందు అశ్వత్థామ బహిర్గతమై, అతనికి సహాయం చేస్తానని చెబుతాడు. అశ్వత్థామ సలహాతో, అశ్వశాలలో శ్వేతాశ్వాన్ని ఎన్నుకుంటాడు నిధి. నవనిధుల సాధనకు బయలుదేరి, హరిహరపురం చేరతాడు.

ఆ తర్వాత...



CHANDU

పానికి పోనిచ్చాడు.

ఆ వ్యక్తి తల ఎత్తి నిధి వైపు చూశాడు.

నిధి చిరునవ్వు నవ్వాడు. "బాబాయ్... క్షమించండి... ఇది పూటకూళ్ళ ఇల్లా?"

"కాదు నాయనా... ఈ పట్టణంలో పూటకూళ్ళ వ్యవస్థ లేదు. ఇక్కడ అన్నం అమ్మరు" ఆ వ్యక్తి అన్నాడు.

"అలాగా?"

"ఎందుకంటే ఈ ప్రాంతంలోకెల్లా అతి పెద్దదైన అన్నసత్రం ఈ పట్టణంలో ఉంది. 'హరిహర నిత్య అన్నప్రసాద సత్రం' అంటారు దాన్ని. రెండు పూటలా ఉచిత భోజనం లభిస్తుంది. పట్టణ వాస్తవ్యులు ఇచ్చే ధనధాన్యాలతో అది నిర్వహించబడుతుంది. గడపకు ఇంత ధాన్యమనీ, ఇంత ధనమనీ ఏడాదికోసారి ఇవ్వాల్సిందే! నా మట్టుకు నేను ఏడాదికి సంక్రాంతి పండుగనాడు నాలుగు పుట్ల ధాన్యం, అయిదునూర్లు..." గృహస్థు చెప్పుకు పోతున్నాడు.

"బాబాయ్, ఆ సత్రం ఏ వీధిలో ఉందో చెప్పగలరా?" నిధి ఆయన వాక్ ప్రవాహానికి అడ్డు తగిలాడు.

"ఏ వీధో ఎందుకు నాయనా? ఈ వీధిలోనే! అలా వెళ్తుంటే తాలింపుల ఘుమఘుమలు నిన్ను పిలుస్తాయి! ఆవాలూ, మెంతులూ, ఇంగువా, నేతిలో..."

వీధిలో వేగంగా వస్తున్న రథాన్ని చూస్తూ ఆపేశాడతను. రథం ముందుకు వెళ్ళిపోయింది. రథం ముందూ, వెనకా నలుగురు అశ్వికులు వెళ్తున్నారు.

"మీరు వర్ణిస్తూంటే నోరు ఊరుతోంది బాబాయ్! వెళ్తొస్తా!" నిధి వాయుని స్పృశించాడు. వాయు ముందుకు కదిలింది.

"నీ అశ్వానికీ అక్కడ ఆహారం దొరుకుతుంది నాయనా!" గృహస్థు కేకేశాడు.

నిధి వినిపించుకున్న సంకేతంగా చెయ్యి పైకెత్తి దించాడు. వాయు తన సహజవేగాన్ని అందుకుంది. ఆముదం గింజలు కాలుతూ వెలుగునీ, కమ్మటివాసననీ వెదజల్లుతున్నాయి. ఈ ఏరండ సుగంధం తాలింపు ఘుమఘుమల్ని మ్రింగి వేయకుండా ఉంటుందా! నిధి నవ్వుకుంటూ ఇరువైపులా ఉన్న మేడల్నీ మిద్దెల్నీ చూస్తూ వెళ్తున్నాడు.

***

"మన కంట పడకుండా ఈగ కూడా పొలిమేర దాటదు దొరా!" విషకంఠుడు శరభాద్రి కాళ్ళు నొక్కుతూ అన్నాడు.

"నేనప్పుడే చెప్పాగా దొరా!"

"ఈగేంట్రా!" ఏదో ఆలోచనలో కూరుకుపోయిన శరభాద్రి విసుగ్గా అన్నాడు.

"ఈగంటే ఈగకాద్దొరా! తెల్లగుర్రం కోడెగాడు!"

శరభాద్రి ఉలికిపడ్డట్టు సర్దుకుని, నిటారుగా కూర్చున్నాడు.

"వాడిగురించే, వాడి గుర్రం గురించే ఆలోచిస్తున్నావేరా? అన్నట్టు పొలిమేర దాటకుండా ఎక్కడున్నాడు వాడు?"

"ఎక్కడుంటాడో, అక్కడే ఊహించాను దొరా! రాత్రయ్యేసరికి మనిషి అన్నం తినాలా? తినాలంటే తమరి చేతిచలవతో నడిచే అన్నసత్రానికి రావాలా?" విషకంఠుడు గొల్లున నవ్వాడు. "బుర్ర! బుర్రలో ఆలోచన, దొరా!"

"వచ్చాడా?" శరభాద్రి కంఠం బొంగురుగా ఉంది.

"వచ్చినట్టే దొరా! తెల్లగుర్రం సత్రం ముందుందిగా!" విషకంఠుడు గర్వంగా అన్నాడు. "కళ్ళారా చూసే వచ్చానుగా!"

"సూర్యుడు చంద్రుడైనా, చంద్రుడు సూర్యుడైనా సరే ఆ శ్వేతాశ్వం మన అశ్వశాలలో ఉండాలి!



మనం కావాలనుకున్నది రావాల్సిందే, వద్దనుకున్నది పోవాల్సిందే! అర్థమైందా?!" శరభాద్రి కంఠంలో ఆకు రాయి ఉందా? అన్నట్టుగా ధ్వనించింది అతని కంఠం.

"కాక! తమ అరచేతి గీతల్లో రాసిపెట్టింది అదేగా దొరా!"

"ఏంచేద్దాం?... ఊ..." శరభాద్రి భయంకరమైన, కర్ణకఠోరమైన శ్రుతిలో రాగం తీస్తూ ఉండిపోయాడు. తటాలున రాగం ఆగింది. ఎర్రటి కళ్ళు మెరిశాయి. "తట్టిందిరా! నువ్వెళ్ళి ఎండ్రకాయను తీసుకురా!"

"దొరా... ఎండ్రకాయా?"

"అదేరా... మన కర్కాటకంగాణ్ణి తీసుకురారా!" శరభాద్రి విసుగ్గా కసిరాడు. విషకంఠుడు ఆదరాబాదరా పైకిలేచాడు.

"ఒరేయ్, ఆగు!" శరభాద్రి అన్నాడు.

విషకంఠుడు ఆగి, వెనుదిరిగి వచ్చి, వినయంగా నిలుచున్నాడు.

"మన విదూషకుణ్ణి కూడా తీసుకురా. ఆ... ముఖ్యంగా ఈలోగా వాడు గుర్రంతో వెళ్ళిపోకుండా...."

"పోలేడు దొరా.. మూడో బంతికిగానీ వాడికి బువ్వ దొరకదు! సత్రం కిటకిటలాడుతోంది!"

"కిటకిటలాడితే, మనకు గిట్టుబాటు కాదనుకో... ఈ పూటకి మంచిదేలే! వెళ్ళు! ఇద్దర్నీ వెంట బెట్టుకురా?" శరభాద్రి ఆజ్ఞాపించాడు.

***

సత్రంలో ఆకలి తీర్చుకుని, నిధి గుమ్మం దాటి, వెలుపలికి వచ్చాడు. వెన్నెలను వెదజల్లుతున్నాడు అప్పుడే పైకి వస్తున్న చంద్రుడు. ప్రాంగణంలో ఉన్న నాలుగైదు ముదురు రంగు గుర్రాల మధ్య తన వాయు ఆ వెన్నెల్లో తళుక్కుమంటోంది. వెన్నెల బొమ్మ! వాయును ప్రేమగా చూస్తూ, దానివైపు అడుగులు వేస్తున్నాడు నిధి. ఈ రాత్రికి ఏ మండపంలోనో, ఏ గోపురం కిందో పడుకోవాలి. ఆలోచిస్తూ, నిధి తన అశ్వాన్ని సమీపించాడు. అతని రాకను గుర్తిస్తూ తల కదిల్చింది వాయు. ఉన్నట్టుండి, గోడచాటు చీకటిలోంచీ నలుగురు వ్యక్తులు నిధి దగ్గరకు వచ్చారు.

నిధి కళ్ళు చిట్లిస్తూ చూశాడు. నలుగురూ శిరస్త్రాణాలు ధరించి ఉన్నారు. నలుగురి చేతుల్లోనూ పొడుగాటి ఈటెలున్నాయి. నలుగురిదీ ఒకే రకమైన వస్త్రధారణ. భటులా?

"నీది కోటీరనగరం కదూ?" నిధి మీదికి నడుస్తూ అడిగాడు ఒక భటుడు.

"అవును..."

"ఈ గుర్రం నీదే కదూ!"

"అవును. నా గుర్రానికీ, నాకూ ప్రవేశ ద్వారం వద్దే సుంకం..."

"ఇది సుంకం వ్యవహారం కాదు. నాయకుడు గారు నిన్ను తీసుకురమ్మన్నారు. పద!" రెండవ భటుడు అన్నాడు.

ఇద్దరు భటులు నిధి వెనకవైపు జరిగారు.

"నాయకుడా? ఆయనెవరు?"

"ఈ పరగణాకి పాళెగాడు దొరగారు. పద!" మొదటి భటుడు నిధి జబ్బ పట్టుకుంటూ అన్నాడు. "శరభాద్రి దొరగారూ! తెలీదా?"

నిధి అప్రయత్నంగా చేతిని విదిల్చి, జబ్బను భటుడి పట్టులోంచి విడిపించుకున్నాడు. "ఎందుకు?"

"తీసుకురమ్మన్నారు, తీసుకెళ్తాం. బుద్ధిగా రాకపోతే తోసుకెళ్తాం! దొరగారిది మాట, మాది చేత! పద!" భటుడు మళ్ళీ నిధి జబ్బ పట్టుకున్నాడు.

"చెయ్యొదులు!" నిధి ముక్తసరిగా అన్నాడు. కండరాలు బిగుసుకుని, రోకలిలా గట్టిగా అయిన నిధి చేతిని భటుడి వేళ్ళు వదిలేశాయి. "నన్ను పట్టుకో నవసరం లేదు. ముందు నడవండి. నేనే వస్తాను. మళ్ళీ చెప్తున్నాను. నన్ను ముట్టుకోకండి!" నిధి స్పష్టంగా అన్నాడు.

"మాక్కావాల్సింది అదే! రా!" అంటూ భటుడు కదిలాడు.

నిధి గుర్రాన్ని ఒకసారి నిమిరి, కదిలాడు. కాసేపట్లో నిధి విశాలంగా ఉన్న వీధిలో నడుస్తున్నాడు. అతనిముందు ఇద్దరు భటులూ, వెనక ఇద్దరు భటులూ కాపలాగా నడుస్తున్నారు. వీధి చివర ఉన్న విశాలమైన భవంతి ముందు ఆగారు భటులు. ఎత్తైన భవనం. ఎన్నో మెట్లపైన, విశాలంగా ఉన్న ద్వారం. ద్వారానికి రెండు వైపులా గుళ్ళలో మూకుడుల్లాంటి ప్రమిదలలో దీపాలు వెలుగుతున్నాయి. గుమ్మం ముందర ఇద్దరు సాయుధులు నిలుచున్నారు.

"తీసుకురండి!" గుమ్మం ముందునుండీ ఒక సాయుధుడు అరిచాడు.

రెండవ సాయుధుడు తలుపుల్ని బలంగా లోపలికి తోసుకెళ్తున్నాడు.

"పద!" భటుడు నిధిని హెచ్చరించాడు. నిధి

**సత్రంలో ఆకలి తీర్చుకుని, నెమ్మదిగా వెలుపలికి వచ్చాడు నిధి. శ్వేతాశ్వం వైపు చూశాడు. పండువెన్నెల్లో మెరిసిపోతోందది. ప్రేమగా చూస్తూ, దానివైపు అడుగులు వేస్తున్నాడు నిధి. ఉన్నట్టుండి గోడచాటునుంచి నలుగురు వ్యక్తులు అతని ముందు ప్రత్యక్షమయ్యారు. శిరస్త్రాణాలు ధరించి ఉన్నారు. చేతుల్లో పొడుగాటి ఈటెలున్నాయి. అసలు వాళ్ళెవరు? నిధి దగ్గరకు ఎందుకొచ్చారు?**

మెట్లు ఎక్కసాగాడు. ముందు నడిచిన భటులు ఇప్పుడు అతని ఇరువైపులా నడుస్తున్నారు. అందరూ వెడల్పాటి ద్వారం దాటి, భవనంలోకి ప్రవేశించారు.

ద్వారానికి ఎదురుగా, ఎత్తుగా ఉన్న అరుగు మీద చిన్న సింహాసనంమీద కూర్చున్నాడు 'పాళెగాడు గారు'. ఆలయ ప్రాంగణంలో గుర్రం గురించి ప్రశ్నలు వేసిన నల్లటి పర్వతకాయుడు ఆయన పక్కన నిలబడి వింజామర వీస్తున్నాడు.

"దొరా, అపరాధి వద్ద కత్తి ఉంది..." ఒక భటుడు బిగ్గరగా అన్నాడు.

"ఉండనీ... కత్తులూ, కఠార్లూ మనల్ని ఏమీ చేయలేవు!" పాళెగాడు శరభాద్రి అన్నాడు.

అపరాధి! నిధి భటుడివైపు ఓరగా చూశాడు. తాను అపరాధం చేశాడా? తనను శరభాద్రి దొర ముందు అపరాధిగా నిలబెడుతున్నారా? ఏమిటి తాను చేసిన అపరాధం? నిధి ఆలోచిస్తూ నడుస్తున్నాడు.

శరభాద్రి దొరకు దగ్గరగా, అడుగుకింద ఇద్దరు వ్యక్తులు చేతులు కట్టుకుని నిలుచున్నారు. ఒకడు పొట్లకాయలా ఉన్నాడు. మరొకతను గుమ్మడికాయను గుర్తుకు తెస్తున్నాడు.

"వీడే దొరా! వీడే!" పొట్లకాయ వ్యక్తి అరిచాడు. "బంగారంలాంటి నా గుర్రాన్ని కొట్టేసింది వీడే!"

"ఆవేశపడొద్దు కర్కాటకా! గుర్రం నిజంగా నీదైతే, నీదే అవుతుంది!" శరభాద్రి దొర ఓదార్పుగా అన్నాడు. అతని కంఠం వానకారులో బోదురుకప్ప అరుపులా ధ్వనించింది.

"ఆలయం వద్దే కదలేశాను దొరా! అనుమానం వేసి, వెల అడిగితే 'తెలీదు' అనేశాడు! 'అమూల్యం' అనేశాడు. అమూల్యమంటే తేరగా వచ్చిందనేగా దొరా అర్థం? కర్కాటకుడు నా వద్దకు వచ్చి ఏడవగానే 'దొరగారికి మనవి చేసుకోవయ్యా' అన్నాను! వింజామర వీస్తున్న విషకంఠుడు అన్నాడు, సగర్వంగా.

"అందుకే దొరా, తమకు మనవి చేసుకున్నాను! ముచ్చటపడి కొన్న ముద్దుగుర్రం దొరా అది!"

"నీ పేరేమిటోయ్?" శరభాద్రి తన ముందు నిలుచున్న నిధిని ఎగాదిగా చూస్తూ అన్నాడు.

"నిధి అంటారు ఆర్యా నన్ను" నిధి గౌరవపూర్వకంగా అన్నాడు, కర్కాటకుడి వైపు ఆశ్చర్యంగా చూస్తూ.

"ఆర్యా కాదు; దొరా అనాలి. నువ్వు ఈ ప్రాంతాన్ని ప్రజారంజకంగా పాలిస్తున్న 'పాళెగాడు' అనబడే



ఉపప్రభువు సన్నిధిలో ఉన్నావు?"

"చిత్తం. అలాగే దొరా!"

"బంగారు గీతతో, తోకతో ఉన్న తెల్లగుర్రం ఎవరిది?"

"నాదే దొరా"

"అది ఎప్పటి నుండి నీదయింది?"

"నిన్న ఉదయం నుండీ దొరా.."

"నేన్జెప్పలేదా దొరా! నిన్న ఉదయం నా ఇంటి ఆవరణలోకి చప్పుడు కాకుండా వచ్చి, తస్కరిస్తూ ఉంటే ఈ చేతులతో వాణ్ణి పట్టుకున్నాను. వాడి బలం ముందు నా బలం ఎంత? నా ముఖం పగ లేశాడు. తలను రాతిస్తంభానికేసి, కొబ్బరికాయను కొట్టినట్టు కొట్టాడు. బుర్ర చీలిపోయి, కడివెడు నెత్తురు కారిపోయింది దొరా!" కర్కాటకుడు నిధి వైపు గుడ్లురుముతూ అన్నాడు.

"కర్కాటకా!" శరభాద్రి గర్జించాడు. "నీ ఆరోప ణలు ఏమిటో మనవి చేసుకున్నావు. అవసరమైతే, మళ్ళీ అడిగి ఆలకిస్తాం! గోడు వెళ్ళబోసుకోవడం మానెయ్!"

"చిత్తం దొరా!"

శరభాద్రి నిధి వైపు తీక్షణంగా చూశాడు. "ఆరోపణ విన్నట్టేగా! నేరం అంగీకరిస్తే, మొదటి నేరంగా, అదే మా పరగణాలో మొదటి నేరంగా భావించి, శిక్ష లేకుండా పంపివేస్తాం. ఇక్కడ న్యాయదేవత నిత్యమూ నాట్యం చేస్తూ ఉంటుంది. అసత్యాలకీ, అక్రమాలకీ, అన్యాయాలకీ, అపరాధా లకీ శిక్షలు చాలా కఠినంగా ఉంటాయి. గుర్రం నిన్న ఉదయం నుండీ నీది అన్నావు. క్రయం చేశావా? చేస్తే ఎవరి వద్ద, ఎంత సొమ్ముకి చేశావు? వివ రంగా మనవి చేసుకో?"

నిధి క్షణంసేపు మౌనంగా చూశాడు. "గుర్రాన్ని నేను కొనుగోలు చేయలేదు దొరా. బహుమతిగా ఇచ్చారు.."

"ఎవరు?" శరభాద్రి గద్దింపుగా అడిగాడు.

నిధి ఆలోచనలో పడ్డాడు. నిజం చెప్పాలి. అది తన విధి. ధర్మం. ఎవరో చెబితే 'ఎందుకు?' అని ప్రశ్నిస్తారు. ఎందుకో చెప్పలేడు తను. చెప్పకూ డదు. విషయాన్ని రహస్యంగా ఉంచడానికి తను, తన కుటుంబసభ్యులు వాగ్దానం చేశారు. వెల్లడి చేయడం ప్రమాదం కూడా..

"నిన్నేనోయ్! ఎవరు?" శరభాద్రి అరిచాడు.

"మా మహారాజుగారు.."

"అంటే..."

"సుభిక్ష రాజ్య మహారాజుగారు..."

"ఓహో... మా రాజ్యంలాగే మీదీ సామంతరా జ్యమే. సామంతరాజుని 'రాజు' అనాలి. మహ రాజు, చక్రవర్తి, సార్వభౌముడు అనరాదు. సరే. ఎందుకిచ్చాడు మీ రాజు?"

"ఎవరిచ్చారో చెప్పాను, ఎందుకిచ్చారో చెప్ప లేను..." నిధి నెమ్మదిగా అన్నాడు.

"కట్టుకథ దొరా! గుర్రం నాది దొరా! రాజుగారు ఇచ్చారంటే తమరు వదిలేస్తారని అసత్యం పలు కుతున్నాడు దొరా?" కర్కాటకుడు అరిచాడు.

"ఉష్! కర్కాటకా! అతనికి ఎవరో ఇచ్చారంటే అందుకు మాకు అభ్యంతరం లేదు. అయితే అందుకు సాక్ష్యం- సజీవ సాక్ష్యం కావాలి. నీ అశ్వాన్ని అతను అపహరించాడంటే అందుకు కూడా మాకు సాక్ష్యం కావాలి; సజీవ సాక్ష్యం!"

"సజీవ సాక్ష్యం నేనున్నా నుగా దొరా!" గుమ్మడి కా యలా ఉన్న వ్యక్తి కీచుగా అన్నాడు.

"నీ పేరు?" ఊరు?"

"వరాహవాటిక కూష్మాండుడు దొరా... ఊరు వరాహవాటికే. మా ఊరిపేరే మా ఇంటి పేరు. కర్కాటకుడిదీ, నాదీ ఇరుగిల్లూ, పొరుగిల్లూ. మా రెండిళ్ళకీ మధ్య కూలి పోయిన గోడ ఉంది. గోడవతల నుంచుని, జరిగిన నాటకాన్ని ఈ రెండు కళ్ళతో రెప్పవేయకుండా చూశాను. సుమారు నెలన్నరగా ఆ తెల్లబంగారు తోక గుర్రం మన కర్కాటకుడి దొడ్డిలో ఉండటం చూస్తూనే ఉన్నాను! గుర్రం..."

"ఒక్కక్షణం కూష్మాండా" శరభాద్రి కూష్మాండు డుగా నటన ఒలకబోస్తున్న విదూషకుడితో అన్నాడు. "ఈ యువకుడు గుర్రాన్ని తస్కరించి, కర్కాటకుడి తలను స్తంభానికేసి కొట్టడం చూశావా?"

"ఆహా! కళ్ళారా చూశాను. చెవులారా విన్నాను దొరా?"

"విన్నావా!"

"అవును దొరా! విన్నాను. అడ్డుపడుతూ కర్కా టకుడు అరిచిన అరుపులు విన్నాను. చోరుడు కర్కాటకుడి తలను రాతిస్తంభానికేసి బాదితే అయిన చప్పుడు విన్నాను!"

శరభాద్రి నిధివైపు తీక్షణంగా చూశాడు. "ఏమోయ్ మీ రాజు తెల్లగుర్రాన్ని నీకు ఇచ్చిన వ్యవ హారాన్ని చూసిన సాక్షులు 'సజీవ' అన్నమాట! ఉన్నారా?"

"లేరు.."

"ఇక్కడ కాదు; అక్కడ, మీ నగరంలో"

"లేరు... దొరా.."

"నేరం జరిగిందనడానికీ, జరగలేదనడానికీ ఆధారం సాక్ష్యమే! కళ్ళారా చూసిన, చెవులారా విన్న సాక్ష్యాలే! కర్కాటకుడు అనే ఈ వరాహవాటిక వాస్తవ్యుడు సాక్షిని ప్రవేశపెట్టి అశ్వం తనదే అనీ, నువ్వు దొంగిలించావనీ నిరూపించాడు...."

"క్షమించండి!" నిధి అడ్డు తగిలాడు. "వాళ్ళి ద్దరూ ఆడిన ప్రతీ అక్షరమూ అబద్ధమే దొరా! అది అక్షర సత్యం కాదు; అక్షర అసత్యం. గుర్రం నాది. మా రాజుగారు..."

"నిరూపించు! సాక్ష్యాల్ని సమర్పించు! నువ్వు సజీవసాక్ష్యాన్ని ప్రవేశపెట్టి 'నీ నిజాన్ని' నిరూపించు కునేదాకా, అశ్వం మా ఆధీనంలో ఉంటుంది.

"దయచేసి నా మాట వినండి. ప్రమాణ పూర్వ కంగా మనవి చేస్తున్నాను. నేను వరాహవాటిక అనే ఊర్లో అడుగు పెట్టలేదు..."

"నిరూపించు అన్నాం కదా! నిరూపించు! రెండు దినాల సమయం ఇస్తున్నాం. ఆ గడువు

## ఆ సినిమా చేసి ఉంటే బాగుండేదట!

'దర్శకుడు' హీరోయిన్ ఈషా 'అంతకు ముందు ఆ తరువాత' సినిమాతో టాలీవు డ్‌కి పరిచయమైన సంగతి తెలిసిందే! ఈ సినిమా తరువాత దిల్‌రాజుగారి సిని మాలో చేసే అవకాశం వచ్చిందట! అయితే కొన్ని కారణాల వలన ఆ సినిమా మిస్ అయిందనీ, ఆ సినిమా చేసి ఉంటే తన కెరీర్ ఇంకా బాగుండేదనీ అంటోంది. ఇప్పటికైనా తన కెరీర్‌కు ఎలాంటి ఢోకా లేదని మంచి మంచి పాత్రలు వస్తున్నాయని చెబు తోంది.

లోగా సాక్షిని తీసుకురా! కూట సాక్ష్యం అని మేం అభిప్రాయపడితే నీకూ, సాక్షికీ మూడేళ్ల కఠినకారాగారవాస శిక్ష విధిస్తాం! వెళ్ళు!"

"దయచేసి నా మాట.." నిధి ప్రారంభించాడు.

"అశ్వచోరుణ్ణి తీసుకెళ్ళండి!" శరభాద్రి గర్జించాడు. "అశ్వాన్ని మా అశ్వశాలలో సురక్షితంగా బంధించండి! విషకంఠా, వెళ్ళు. ఆ పని చూడు!"

నిధిని నలుగురు భటులు పట్టుకున్నారు. శరభాద్రి పైకి లేచాడు. కర్కాటకుడి వైపు వాలుగా చూశాడు.

"విన్నావుగా కర్కాటకా! వ్యవధిలోగా ఇతను నిజమైన సాక్ష్యం ప్రవేశపెట్టడంలో విఫలమయ్యాక, నీ గుర్రాన్ని నువ్వు తీసుకువెళ్ళొచ్చు! వెళ్ళు!"

"చిత్తం దొరా! ధర్మ ప్రభువులు తమరు!" కర్కాటకుడు వంగి వంగి దండాలు పెట్టాడు.

నిధిని భటులు బైటికి నెట్టుకుంటూ వెళ్తున్నారు.

***

అన్నాడు.

"అయితే, సాచ్చీకం తెచ్చుకో! పో"

నలుగురు భటులూ నవ్వుకుంటూ వెనుదిరిగారు. నిధి ముందుకు కదిలాడు. తెల్లవారే లోగా తను తన గుర్రాన్ని తిరిగి స్వాధీనపరుచుకోవాలి. ఈ శరభాద్రి పరగణాదాటి వెళ్ళిపోవాలి! అశ్వశాల ఎక్కడుందో, దాని రక్షణ విధానాలు ఏమిటో తెలుసుకోవాలి. అది కూడా అతి రహస్యంగా తెలుసుకోవాలి. అక్కడ రక్షణగా ఉన్న వ్యక్తులు నిద్రమత్తులోకి జారుకునే దాకా తాను వేచి ఉండాలి. సత్రంలో సద్దుమణగాలి. రాత్రి సగం గడిచిపోవాలి. నిధి బుర్రలో ఏదో ఆలోచన మొదలైంది.

శరభాద్రి దొర తొత్తులు తనమీద ఒక కన్ను వేసి ఉంచవచ్చు. హరిహర పట్టణాన్ని వదిలి, కోటీరనగరంవైపు కాకుండా, మరోవైపు వెళ్తున్న నాటకం ఆడాలి. శ్వేతాశ్వం తాను దొంగిలించి తెచ్చుకున్న గుర్రమే అని వాళ్ళు నమ్మాలి. నమ్మాలంటే గుర్రం మీదే ఆశ వదిలి తను వెళ్ళిపోతున్నట్టు నాటకం




చీకటిగా ఉన్న ఆవరణలో తనను తీసుకెళ్తున్నట్టు నిధి గుర్తించాడు. భవనంలోకి తీసుకెళ్ళిన ద్వారం గుండా కాకుండా, మరొకద్వారం గుండా వెలుపలికి తీసుకువచ్చారు. ఎందుకో! నిధి తిరగబడే శక్తి ధైర్యం లేని వాడిలాగా వెళ్తున్నాడు. తను ఏంచేసినా, అది తన లక్ష్యసాధనకు విఘాతం కల్పించకూడదు. తనకి తెలుసు. పాళెగాడు గారి సముఖంలో ఒక నాటకం ప్రదర్శించబడింది. కర్కాటకుడూ, కూష్మాండుడూ, పాళెగాడూ... చక్కగా పాత్ర పోషణ చేశారు. విషకంఠుడు అనబడే కారు నలుపు వ్యక్తి కూడా! తన గుర్రంమీద ఎవరి కన్నో పడింది. శరభాద్రి దొర కన్నా? అందరూ ఆయన కోసం నాటకం ఆడారా? తను శ్వేతాశ్వాన్ని కాపాడుకోవాలి. ఎలా? ఎప్పుడు? శరభాద్రి దొర అశ్వశాలకు రక్షణ ఎలా ఉంటుంది? నిధిని ఆలోచనలు చుట్టుముట్టాయి.

చీకటిగా ఉన్న ఒక వీధిలోకి ప్రవేశించాక, భటులు నిధిని వదిలేశారు. 'ఇంక నీదారి చూసుకో!' అన్నాడు ఒక భటుడు.

"నీ నడకా, నడుముకి కత్తీ నీ యవ్వారం చూస్తే పోటుగాడిలా ఉన్నావ్ కదయ్యా. గుర్రం దొంగతనం చేయాలా నువ్వు! ఛఛ" రెండవ భటుడు అన్నాడు.

"నేను దొంగిలించలేదు. గుర్రం నాది!" నిధి ఆడాలి. దెబ్బకు దెబ్బలాగే మాటకు మాటలాగే, నాటకానికి నాటకం. నిధి సత్రానికి చేరుకున్న దారికి వ్యతిరేక దిశలో, నడక ప్రారంభించాడు.

***

అరగంటపాటు సాగిన నడక, నిధిని హరిహర పట్టణానికి మరో వైపుకి చేర్చింది. కోట గోడలో రథం పట్టేంత వెడల్పుతో ద్వారం ఉంది. ఇద్దరు భటులు కాపలా కాస్తున్నారు. ఇద్దరూ ఒకేసారి ఈటెలను అడ్డుగా పెట్టారు.

"పేరు?"

"అటువైపున్న ప్రవేశ ద్వారం దగ్గర పేరు అడగలేదే!" నిధి అన్నాడు.

"అక్కడ ఊరు అడుగుతారు, ఇక్కడ పేరు అడుగుతారు. చెప్పు!" రెండవ భటుడు దర్పం ప్రకటిస్తూ కసిరాడు.

"నిధి..."

"ఏ ఊరు?"

"అక్కడ చెప్పానుగా?"

"ఇక్కడా చెప్పాలి, వెళ్ళాలంటే."

"కోటీరనగరం"

భటుడు దివిటీ దగ్గరగా ఉంచిన తాళపత్ర గ్రంథం తీసి, చూసి, తల ఊగించాడు. నిధి దగ్గరగా వచ్చాడు. "కోటీరనగరం ఇటువైపు కాదే! ఇటు ఎటు వెళ్తున్నావ్? ఆ ద్వారంలో నీకూ, గుర్రానికీ సుంకం చెల్లించావు. గుర్రం ఏదీ?"

"ఇచ్చేశాను.."

"ఎవరికి?"

"అశ్వదానం చేశాను. దానం తీసుకున్న వ్యక్తి పేరు చెప్పకూడదు".

"ఇటు ఎటు? అని అడిగాడు, చెప్పలేదే!" రెండవ భటుడు అన్నాడు.

"ఉత్తరదేశ యాత్ర!" నిధి ఆవులిస్తూ అన్నాడు.

"వెళ్ళు. మళ్ళీ ప్రవేశించాలంటే సుంకం చెల్లించాలి. ఆ!"

నిధి చిన్నగా నవ్వాడు. "ఈ ఊళ్లో ఇంక అడుగు పెట్టను!"

నిధి ఇరవై అడుగులు వెళ్ళేదాకా భటులు మౌనంగా చూస్తూ ఉండిపోయారు. ఒకటవ భటుడు తగ్గుస్వరంలో రెండవ భటుడితో అన్నాడు. "వెళ్ళు సుకేశా! గుర్రపోడు ఊరొదిలి ఉత్తర దిక్కుకేసి పారిపోయాడని దొరగారికి చెప్పమని ఆ కర్కాటకానికి చెప్పిరా!"

"ఓ!" అంటూ వెనుదిరిగాడు రెండవ భటుడు.

నిధి దారిని వదిలి చెట్ల మధ్యకు అడుగులు వేశాడు. భటుడు పట్టణంలోనికి వెళ్ళడం వాలుగా చూశాడు తను. తన సొంత ఊరికి కాకుండా ఎటో వెళ్ళిపోయాడని ఆ నటులందరికీ వార్త అందుతుంది! తాను దొంగే అనీ, గుర్రం తస్కరించబడిందే అనీ అనుకుంటారు. అయితే, తాను తస్కరించింది కర్కాటకుడి వద్ద కాదని వాళ్ళందరికీ తెలుసు! నిధి తనలో నవ్వుకుంటూ చెట్టు మొదట్లో కూర్చుని బోదెకు వీపు ఆన్చాడు. నడిరేయి రాకకోసం, కళ్ళు తెరచుకుని చీకట్లోకి చూస్తూ ఉండిపోయాడు. అతనికి తెలియకుండానే కళ్ళు ఎప్పుడో మూతలు పడ్డాయి. నిధిని గాఢ నిద్ర తనలో ఇముడ్చుకుంది.

ఉన్నట్టుండి నిధి ఉలికిపడి మేలుకున్నాడు. ఎవరో తట్టి లేపినట్టు మెలకువ వచ్చింది తనకు. అర్ధరాత్రి దాపులకు వచ్చిందా, లేక వచ్చి దాటుకుందా?

నిధి అరచేతుల్తో కళ్ళు నులుపుకుంటూ, గాఢంగా ఊపిరి పీల్చుకున్నాడు.

ఏదో... వాసన... తనకి పరిచయమైన కుళ్ళిన చర్మం కంపు.

"అర్ధరాత్రి దాటింది, నిధీ లే!" పురుష కంఠం!

నిధి అదిరిపడి లేచాడు. అశ్వత్థామ! "ఆర్యా.."

"స్వర్ణరేఖ, స్వర్ణవాలం ఉన్న జవనాశ్వం వాయు నా ఎన్నిక. నా మాటను గౌరవించి దానిని తీసుకున్నావు. అది నీ నుండి దూరమైంది. మళ్ళీ నీకు చేరువచేసే బాధ్యత తీసుకున్నా. ఇంక నా మాటల కోసం ఎదురుచూడవద్దు. నా దేహం వెదజల్లే దుర్గంధం దారి చూపుతుంది. దాన్ని అనుసరించు! రా!" అశ్వత్థామ కంఠం గంభీరంగా ధ్వనించింది.

లీలగా ఘ్రాణానికి సోకుతున్న దుర్గంధం దూరమవుతున్నట్టు నిధి గ్రహించాడు. ఘ్రాణేంద్రియ సహాయంతో అశ్వత్థామను అనుసరించ సాగాడు. శ్వేతాశ్వం గురించి తనకిక బెంగలేదు. అవలీలగా దూరమైంది. అంతే అవలీలగా చేరువ కాబోతోంది.

**(ఇంకావుంది)**




**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych),
P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ
ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి


# హెచ్ఐవి ఉన్నా హోమియోతో జీవితం

హెచ్ఐవి పేరు వింటనే తెలియని భయం. ఎందుకంటే చికిత్స లేని వ్యాధి అది. నిజమే. కానీ ఇప్పుడు అద్భుతమైన మందులు అందుబాటులోకి వచ్చాయి. వైరస్ పూర్తిగా శరీరంలో నుంచి తొలగిపోకపోయినా ఆ వైరస్ ఎటువంటి ప్రభావం చూపకుండా చేసే హోమియో మందులు అందుబాటులో ఉన్నాయి.

### హెచ్ఐవి అంటే....

హెచ్ఐవి గురించి చాలా మందికి సరియైన అవగాహన ఉండదు. హెచ్ఐవి అంటే ఒక వ్యాధి అని చెప్పడం కన్నా వ్యాధులు రావడానికి కారణమయ్యే వాతావరణాన్ని శరీరంలో కలగజేస్తుందని చెప్పవచ్చు. రోగనిరోధక వ్యవస్థను దెబ్బతీయడం ద్వారా అవకాశవాద వ్యాధులు వచ్చేలా చేస్తుంది. అంటే చిన్న వాతావరణ మార్పులకే జలుబు చేయడం, జ్వరం రావడం, టీబీ సోకడం, విరేచనాలు కావడం జరుగుతుంది. ఫలితంగా మృత్యువు చేరువవుతుంది. అంటే రోగనిరోధక వ్యవస్థ బలహీనపడితే వ్యాధులు వచ్చిపడతాయి. బలంగా ఉంటే హెచ్ఐవి ఏమీ చేయలేదు. సరిగ్గా హోమియో చికిత్స రోగనిరోధక వ్యవస్థను శక్తివంతం చేయడం పైనే దృష్టి పెడుతుంది.

### ఏం జరుగుతుంది?

హెచ్ఐవి టి-కణాలపై దాడి చేస్తుంది. ఈ కణాలను సీడీ 4 పాజిటివ్ లింఫోసైట్స్ అని కూడా అంటారు. ఒకసారి హెచ్ఐవి శరీరంలో ప్రవేశించగానే తనకు తానుగా కొన్ని లక్షల వైరస్‌లను ఉత్పత్తి చేసుకుంటుంది. అదే సమయంలో టి-కణాలను చంపడం ప్రారంభిస్తుంది. టి-కణాల సంఖ్య ఎప్పుడైతే తగ్గుతాయో అనేక వ్యాధులు చుట్టుముడతాయి.

### హోమియో చికిత్స ఎలా పనిచేస్తుంది

హోమియో మందుల వల్ల రోగనిరోధకవ్యవస్థ తిరిగి బలపడుతుంది. సీడీ 4 కణాల సంఖ్య గణనీయంగా పెరుగుతుంది. అవకాశవాద ఇన్‌ఫెక్షన్లకు చోటు లేకుండా పోతుంది. ఆకలి బాగా పెరగడంతో బరువు పెరగడం ప్రారంభిస్తారు. హెచ్ఐవి అని తెలియగానే ఇక చికిత్స లేదనే నిర్ధారణకు వచ్చేస్తారు. ఎన్నిరోజులున్నా మరణం తప్పదనే భావనలో ఉంటారు. కానీ అది నిజం కాదు. హోమియో చికిత్స తీసుకోవడం ద్వారా అందరిలాగే సాధారణ జీవితం గడిపే అవకాశం లభిస్తుంది.

# గ్యాస్ట్రిక్ సమస్యలను ఎన్నాళ్లు భరిస్తారు?

ఎసిడిటీ, గ్యాస్ట్రైటిస్, అల్సర్... ఈ మధ్యకాలంలో ఎవరినీ కదిలించినా ఇందులో ఏదో ఒక సమస్య ఉందనే చెప్తారు. జీవనశైలిలో మార్పులు అంటే సమయానికి భోజనం చేయకపోవడం, మసాలా, వేపుళ్లు ఎక్కువగా తీసుకోవడం, మాంసాహారం అధికంగా తినడం, మానసిక ఒత్తిడి, నిద్రలేమి వంటివి గ్యాస్ట్రైటిస్ సమస్యకు కారణమవుతాయి. ఆల్కహాల్ సేవించడం, గుట్కా తినడం కూడా కారణమే. పుల్లటి తేన్పులు, వాంతులు, కడుపులో మంట, కడుపు ఉబ్బరం వంటి లక్షణాలుంటాయి. కొద్దిగా ఆహారం తీసుకున్నప్పటికీ పొట్ట నిండినట్లుగా అనిపించడం, ఆకలి లేకపోవడం, బరువు తగ్గిపోతుండటం వంటి లక్షణాలు ఉంటాయి. నాభి పైభాగంలో నొప్పి ఉంటుంది.

అల్సర్స్(గ్యాస్ట్రిక్, పెప్టిక్) : మ్యూకస్ మెంబ్రేన్ యందు పుండులాగా కావడాన్ని అల్సర్ అంటారు. అల్సర్ ఏ భాగంలో అయితే ఆ పేరుతో పిలుస్తారు. ఆహారవాహికలో ఉన్నట్లయితే ఒసియోఫేగల్ అల్సర్, జీర్ణకోశంలో ఉన్నట్లయితే గ్యాస్ట్రిక్ అల్సర్, చిన్న పేగు మొదటి భాగంలో ఉన్నట్లయితే డ్యుయోడినల్ అల్సర్ అని పిలుస్తారు. కడుపులో నొప్పి, తినేముందు లేదా తిన్న తరువాత కడుపులో నొప్పి, కడుపు ఉబ్బరంగా ఉండటం, పుల్లటి తేన్పులు, తలతిరగడం, వాంతులు వంటి లక్షణాలు ఉంటాయి. వ్యాధి ముదిరినపుడు రక్తంతో కూడిన వాంతులు, భరించలేని కడుపునొప్పి ఉంటుంది.

అమీబిక్ డీసెంట్రీ : కలుషిత నీరు తాగడం, పరిసరాలు పరిశుభ్రంగా ఉంచుకోకపోవడం, కలుషిత ఆహారం వల్ల అమీబియాసిస్ వస్తుంది. ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాల్లో నివసించే వారిలో ఈ సమస్య ఎక్కువగా కనిపిస్తుంది. కడుపులోనొప్పి, పదేపదే విరేచనలకు వెళ్లడం, జిగురు, రక్తంతో కూడిన మలం, నీరసం, కాళ్లు, చేతులు లాగడం వంటి లక్షణాలు ఉంటాయి. కడుపులో ఏదో లాగుతున్నట్లుగా ఉంటుంది. మలం జిగటగా ఉండటం, రక్తం పడటం వంటి లక్షణాలు కనిపిస్తాయి.

హోమియో చికిత్స : అల్సర్‌ను సమూలంగా తొలగించే మందులు హోమియోలో ఉన్నాయి. ఆహారపు అలవాట్లు మార్చుకొని క్రమం తప్పకుండా మందులు వాడినట్లయితే సమస్య నుంచి శాశ్వత పరిష్కారం లభిస్తుంది. జీర్ణసంబంధ సమస్యలు ఏవైనా హోమియో మందులతో పరిష్కారం లభిస్తుంది. డాక్టర్ సూచించిన సలహాలు పాటిస్తూ హోమియో చికిత్స తీసుకుంటే శాశ్వత పరిష్కారం లభిస్తుంది.

# హెపటైటిస్, హెర్పిస్‌లతో సహవాసం ఎందుకు?

హెపటైటిస్ వైరస్ ప్రభావం ప్రధానంగా కాలేయంపై ఉంటుంది. ఈ వైరస్ మూలంగా అనేక మంది తీవ్రమైన కాలేయ వ్యాధి బారినపడి ప్రాణాలు కోల్పోతున్నారు. ఈ వైరస్ ముఖ్యంగా రక్తం ద్వారా వ్యాపిస్తుంది. వైరస్ ఉన్న రక్తాన్ని ఎక్కించడం, డ్రగ్స్ అలవాటు ఉన్న వారు ఒకరు ఉపయోగించిన నీడిల్స్ మరొకరు ఉపయోగించడం ప్రధాన కారణంగా చెప్పుకోవచ్చు. తల్లి నుంచి శిశువుకు కూడా సంక్రమించే అవకాశం ఉంది. లైంగిక సంబంధాల ద్వారా కూడా వ్యాపిస్తుంది. అయితే హెపటైటిస్ బి వ్యాధి చాలా ఆలస్యంగా బయటపడుతుంది. కొన్ని సందర్భాలలో సంవత్సరాల తర్వాత బయటపడవచ్చు. ఆకలి లేకపోవడం, వాంతులు వచ్చినట్టు అనిపించడం, ఒళ్లంతా నొప్పులు, మూత్రం పచ్చగా రావడం, కామెర్లు అభివృద్ధి చెందడం, చర్మంపైన దద్దుర్లు రావడం జరుగుతుంది. ఈ వ్యాధి కొన్ని సంవత్సరాల తర్వాత బయటపడినట్లయితే దాన్ని క్రానిక్ హెపటైటిస్ అంటారు. దీని వల్ల కామెర్లు వస్తాయి. ఎంతకీ తగ్గవు.

హెర్పిస్ సింప్లెక్స్ : పురుషాంగంపైన, స్త్రీలలో యోని ప్రాంతంలో చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు పడుతుంది. ఇటువంటి సమయంలో తగు చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు.

హోమియో చికిత్స : హెపటైటిస్ వైరస్‌ను సమర్థవంతంగా అడ్డుకునే చికిత్స హోమియోలో మాత్రమే ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది. హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది.




**కృష్ణుణ్ణి తృణీకరించడం తనకేమాత్రం క్షేమం కాదనుకున్నాడు దేవేంద్రుడు. అలా అనుకున్న మరుక్షణం ఐరావతాన్ని అధిరోహించి దివి నుండి భువికి చేరాడు. కృష్ణుణ్ణి సమీపించాడు. సాష్టాంగనమస్కారం చేశాడతనికి. తెలియక చేసిన తప్పును క్షమించమన్నాడు. గోలోకంలోని గోవుల కృతజ్ఞతను తెలియజేశాడతనికి. వాటి విన్నపం మేరకు వాటి పనుపున కృష్ణుణ్ణి అభిషేకించదలచాడు. అనుజ్ఞకోసం ఎదురు చూడసాగాడు. చెప్పాల్సింది ఇంకా చాలా ఉన్నదన్నట్టుగా గొంతు సవరించుకుని మళ్ళీ అన్నాడిలా దేవేంద్రుడు.**

రించాడు దేవేంద్రుడు. చెప్పాడిలా.

గోపాలకదేవా! ఒకపని పూర్తి అయింది. రెండవ దానిని గురించి నీతో కొంచెం మాట్లాడాలనుకుంటు న్నాను, దయచేసి కృపార్ద్రహృదయుడివై ఆలకించు.

చెప్పు అన్నట్టుగా తలెగరేశాడు కృష్ణుడు. దేవేంద్రుడు చెప్పసాగాడిలా.

ఈ అవతారంలో కూడా దానవులకూ, నీకూ శత్రుత్వం తప్పదు. దుష్టాత్ముడు కంసుడు నిన్ను ఆపదలపాలు చేయకమానడు. అయినా నీకేం కాదు. కొన్నాళ్ళకు నా తేజోవైభవంతో కుంతీదేవిగర్భంలో జన్మించిన అర్జునునికి నువ్వే దిక్కు అవుతావు. అతను నిన్ను ఆశ్రయిస్తాడు. స్నేహితుడై నిన్ను అనుసరిస్తాడు. నన్ను ఎలాగైతే కృపార్ద్రదృష్టితో కరుణించావో అలాగే అర్జునునికూడా నువ్వు ఆదరించాలి. నీ ఆదరణపొందిన అర్జునునికి లోకంలో తిరుగు ఉండదు.

# కృష్ణుని అభిషేకం:దావాగ్ని నివారణ

గోపాలశ్రేష్ఠా! గోలోకరక్షకా! గోమాతల ప్రార్థన కాదనకు! అదిగో! ఆ ఐరావతంమీద ఉన్నవే బంగారు కలశాలు. వాటినిండా ఆకాశగంగ ఉన్నది. ఆ గంగను స్వహస్తాలతో అమరులు నీకై నింపి పంపారు. వాటితో నిన్ను అభిషేకిస్తాను. అమరులకు అధీశ్వరుడవు అయిన నీవు, ఈ క్షణం నుంచి గోవులకు ఇంద్రుడవు అవుతావు. అలాగే గోవులను సంరక్షించిన కారణంగా నిన్ను ఈనాటి నుండి 'గోవిందుడు' అని వ్యవహరిస్తారు.

సన్నగా నవ్వాడు కృష్ణుడు.

ఇక ఆషాఢం మొదలుగాగల నాలుగు మాసాల్లోనూ రెండుమాసాలు నీకు అర్పిస్తున్నాను. మొదటి రెండుమాసాలూ లోకం నాకు పూజలర్పిస్తుంది. తర్వాత రెండు నెలలూ నిన్ను పూజిస్తుంది. ఉపేంద్రుడు అన్న నీనామం ఈరకంగా సార్థకం అవుతుంది. ఇకమీదట నువ్వు శ్రీమహావిష్ణురూపంతో వర్షాకాల ప్రారంభంలో నిద్రను ప్రారంభించి, కార్తీకంలో మేలుకొనగలవు అన్నాడు దేవేంద్రుడు.

ఆ మాటలకు సంతోషించాడు కృష్ణుడు. దేవేంద్రుణ్ణి ఆనందంగా చూశాడు. చల్లని ఆ చూపు చాలు, కృష్ణుడు అంగీకరించినట్టే అనుకున్నాడు దేవేంద్రుడు. పొంగిపోయాడు. చేతులు జోడించి కృష్ణునికి నమస్కరించాడు. ఐరావతం మీది బంగారు కలశాలు అందుకున్నాడు. అందులోని నీటితో కృష్ణుణ్ణి అభిషేకించాడు. కృష్ణుణ్ణి దేవేంద్రుడు అభిషేకిస్తున్న సంగతి ఎలా తెలిసిందో ఏమో! గోవులన్నీ పరుగందుకుని, కృష్ణుణ్ణి సమీపించసాగాయి. గోపాలురకది అర్థం కాలేదు. పరుగుదీస్తున్న గోవుల వెనుక పడ్డారంతా. ఆగండెహే! ఆగండంటూ హెచ్చరికలు చేశారు. అయినా వినిపించుకోలేదవి. కృష్ణుణ్ణి సమీపించి, తమ పొదుగుల నుండి వెలువడుతున్న గోరువెచ్చని క్షీరధారలతో అతన్ని అభిషేకించాయి. మేఘాలు ఆ దృశ్యం చూసి పరవశించాయి. మృదుమధురగర్జనలతో అభినందించి, కరిగి, పూలజల్లులా కృష్ణునిపై వర్షించాయి. చెట్లు మకరందబిందువులను అభివర్షించాయి. దేవాదిదేవుణ్ణి అభిషేకించేందుకు ఇంత కన్నా మంచితరుణం లేదన్నట్టుగా ఆకాశంలోని దేవతలంతా కృష్ణునిపై పుష్పవృష్టి కురిపించారు. జయాభినందనలు తెలియజేశారు. దేవదుందుభులు మ్రోగాయి అప్పుడు. గంధర్వులు ఆడిపాడారు. వసిష్ఠుడు, వామదేవుడు, అత్రి, భరద్వాజుడు, కౌశికుడు, కణ్వుడు ఆదిగా మునీంద్రులు కృష్ణుణ్ణి సిద్ధమంత్రాలతో వినుతించారు. అద్భుతతేజస్సుతో ప్రకాశించి, సూర్యుడు కన్నుల పండువైనాడు. దిశలెల్లడలా నిర్మలకాంతులు పరచుకున్నాయి. పూలసువాసనసహా పిల్లగాలులు వీచాయి. తాపసుల అగ్నిహోత్రాలు ప్రదక్షిణాకారంలో ప్రజ్వలించాయి. నదీనదాలు, కులపర్వతాలు, తరువులు, లతలు, విహంగమాలు, అరణ్యమృగాలు తమతమకు ఉచితమైనరీతిలో కృష్ణుణ్ణి అనేకవిధాల అభినందించాయి.

కృష్ణునికి దేవేంద్రుడు కొత్తబట్టలు కట్టబెట్టాడు. కొత్తకొత్త విభూషణాలు అలంకరించి ఆనందించాడు. మహాసౌందర్యంతో మెరిసిపోతున్న కృష్ణుణ్ణి మురిసిపోతూ చూస్తూ చేతులు జోడించి నమస్కరించాడు...

**స్నేహితులు, ఆలమందలతో అడవిమధ్యకు చేరుకున్నాడు కృష్ణుడు. ఆవులన్నీ దూరంగా సాగిపోయాయి. అంతలోనే దావాగ్ని చెలరేగింది. గోపాలురు పరుగుదీసి ఆవులను సురక్షిత ప్రాంతాలకు తరలించారు. దావాగ్ని అడవి నలువైపులా అలముకుంది. దట్టంగా పొగ వ్యాపించింది. చూస్తూండగానే అది గోపాలురనూ చుట్టుముట్టింది. భయపడ్డారంతా. అప్పుడు వాళ్ళు ఏం చేశారు?**

మహామునీంద్రుల సమక్షంలో నేను ఒకప్పుడు పాండవమధ్యముడు అర్జునుడు ప్రచండకోదండ పాండిత్యంలో తోటివారిని తలదన్నగలడని చెప్పాను. నా మాట ఒట్టిపోరాదు. అతనిని కంటికిరెప్పలా కాపాడి నా మాట నిలబెట్టాలి నువ్వు. కౌరవ పాండవులకు ఘోరమైన యుద్ధం జరుగుతుంది. ఆ సమయంలో నువ్వు వజ్రకవచంలా నిలిచి అర్జునుని సంరక్షించాలి. సంరక్షిస్తానని నాకు మాట ఇవ్వు చాలు. అంతకంటే నేను కోరదగింది మరొకటి లేదు.

మాట ఇస్తున్నట్టుగా సన్నగా నవ్వుతూ దేవేంద్రుణ్ణి చూశాడు కృష్ణుడు. అభయాన్నిచ్చి, అన్నాడిలా.

దేవేంద్రా! మా మేనత్త కుంతీదేవి కుమారులు అయిదుగురూ సచ్చరిత్రులు. దేవతల అంశాలతో అవతరించబోయే వారంతా అనతికాలంలోనే ఈ ధరణికి అధినాథులు అవుతారు. వారిలో అర్జునుడే అత్యధికబలపరాక్రమశాలిగా పేరొందుతాడు. అతనికి ఎలాంటి పరాజయమూ సంభవించదు. నాకు ఇదంతా ముందే తెలుసు. యుద్ధంలో అర్జునుడే గెలుస్తాడు. త్వరలో నీకు అన్నీ తెలుస్తాయి. నా మీది ప్రేమతో భువికి దిగి, నన్నిలా అభిషేకించినందుకు నాకెంతో ఆనందంగా ఉంది. వెళ్ళిరా! ఎలాంటి ఆందోళనలూ పడకు.

చాలు కృష్ణా! చాలు అన్నాడు దేవేంద్రుడు. కృష్ణుని పాదాలనంటి నమస్కరించాడు. తర్వాత ఐరావతం అధిరోహించి అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు. స్వర్గానికి చేరుకున్నాడు.

కృష్ణుడు గోవర్ధనగిరి దిగి, స్నేహితులూ, ఆలమందలుసహా పల్లెలోకి ప్రవేశించాడు. పల్లెలోనికి ప్రవేశించిన కృష్ణుని చూస్తూనే అక్కడి ప్రముఖులంతా చేతులు జోడించి నమస్కరించారతనికి. చుట్టుముట్టారతన్ని. వేడుకున్నారిలా.

కృష్ణా! గోవర్ధనగిరిని ఎత్తి, గొడుగులా పట్టుకుని, గోవులను సంరక్షించావు. నీకే చెల్లిందది.



దేవేంద్రుడంతటివాడు వచ్చి, నీ పాదాల మీద పడ్డాడంటే... నువ్వు సామాన్యుడివి కాదు. మామూలు గోపాలకుడివి అంతకన్నా కాదు. నువ్వు మాకు బాంధవుడివి అయినావంటే అది మా పూర్వజన్మసుకృతమే కాని, చిన్న భయం ఉన్నది మాకు. ఆ భయం పోవాలంటే నోరు తెరచి నువ్వు నిజం చెప్పాలి.

నువ్వు ఎవరు? వసువులు, రుద్రులు, మరుత్తులు, యక్షులు, గంధర్వులు, విద్యాధరులాదిగాగల దేవతా ప్రముఖుల్లో నువ్వు ఆద్యుడివా? నిన్నూ, నీ చర్యలూ చూస్తుంటే మాకు అలాగే అనిపిస్తున్నది. మాలో ఒకడిగా ఉంటూ, మాతోపాటుగా తిరుగుతున్నా నిన్ను చూస్తే చేతులు జోడించి నమస్కరించాలని పించడంసరే, భయం కూడా వేస్తున్నది. మేం తప్పు మాట్లాడితే మన్నించు. తప్పులు చేసి ఉంటే క్షమించు.

నువ్వు ఎవరైనా, ఎటువంటివాడివైనా మేమంటే నీకు అభిమానం ఉన్నది. అది చాలయ్యా! మమ్మల్ని కంటికి రెప్పలా కాపాడుతున్నావు, అంతకన్నా కావాల్సింది లేదు. మమ్మల్ని కరుణించు! కటాక్షించు!

పెద్దలంతా చేతులు జోడించి నమస్కరించి, నిల్చున్నారు. నిల్చున్న పెద్దలందరినీ చల్లగా చూసి చిరునవ్వు నవ్వాడు కృష్ణుడు. చెప్పాడిలా.

పెద్దలారా! లేనిపోని అనుమానాలూ, ఆలోచనలూ మీకు అనవసరం. నేను మీ ఆత్మీయుణ్ణి. మీ ఆప్త బాంధవుణ్ణి. అంతే! మీకు నేను మేలే చేస్తానుగాని, నా ప్రాణంపోయినా కీడు చెయ్యను. నన్ను నమ్మండి! నా చేష్టల్ని మీరు శ్రద్ధగా గమనిస్తే నేనెవరో మీకు తెలుస్తుంది. తెలుసుకోవడం మీకు శుభదాయకం కూడా.

తెలుసుకునేందుకు ప్రయత్నిస్తాం అన్నారు పెద్దలు. నవ్వుతూ కృష్ణుణ్ణి ఒకరి తర్వాత ఒకరుగా కౌగిలించుకుని నిష్క్రమించారక్కణ్నుంచి.

కొన్నాళ్ళు గడిచాయి.

ఒకనాడు స్నేహితులూ, ఆలమందలుసహా కృష్ణుడు అడవి మధ్యకు చేరుకున్నాడు. ఎప్పుడూ రాని తోవ అది. స్నేహితులు సరదాపడితే తప్పనిసరై అటుగా వచ్చాడతను. పసరిపచ్చికకోసం ఆవులన్నీ దూరంగా సాగిపోయాయి. కాసేపు గడిచింది. దావాగ్ని రగులుకుందెక్కడో! వేడిగా గాలిసోకడంతో ఆ వేడి గాలిని తట్టుకోలేక ఆలమందలు అంబా అంబా అంటూ ఆక్రోశించసాగాయి. గోపాలురు పరుగు దీశారటువైపు. పశువుల కాళ్ళతొక్కిడివల్ల ఏర్పడిన దారులను అనుసరించి చేరుకున్నారక్కడికి. అది వనమధ్యం. ఆవులను ఆయా పేర్లతో పిలిచారు. అవన్నీ తోకలెత్తి రాసాగాయి. వచ్చినవాటిని వచ్చినట్టే సురక్షిత ప్రాంతాలకు తరలించి, వ్యాపిస్తున్న దావాగ్నిని చూస్తూ నిల్చున్నారు గోపాలురు. అడవి నలువైపులా దావాగ్ని అలముకుంది. దట్టంగా పొగ వ్యాపించింది. ఆకాశం కనిపించకుండాపోయింది. చూస్తూండగానే దావాగ్ని గోపాలురను కూడా చుట్టుముట్టింది. భయపడ్డారంతా. భయపడి, మధ్యలో ఉన్న కృష్ణుణ్ణి చూశారు. చేతులు జోడించి నమస్కరించారతనికి. విన్నవించుకున్నారిలా.

హితుడా! స్నేహితుడా! కృష్ణా! దావానలం భీకరోద్ధతి చూశావుగా! మనల్ని కబళించేందుకు అది విరుచుకుపడుతున్నది. నీ హితుల్నీ, స్నేహితుల్నీ ఏ ప్రమాదం అంటదన్నావుగా, మేమే నీ హితులూ, స్నేహితులమైతే మమ్మల్ని ఆ కార్చిచ్చు అంటదుగాక అంటదు. అవునా? ఒకవేళ కనికరం లేని ఆ కార్చిచ్చు మమ్మల్ని దహించేందుకు ప్రయత్నిస్తే నువ్వే కాపాడాలి. మా ప్రాణభయాన్ని నువ్వే తొలగించాలి.

అలాగే అన్నట్టుగా నవ్వాడు కృష్ణుడు. ఆందోళన చెందుతున్న స్నేహితులకి అభయాన్ని ప్రసాదించాడు. అన్నాడిలా.

మీరంతా ఒక్కసారి కళ్ళు మూసుకోండి. మీరలా కళ్ళు మూసుకుంటే దావాగ్నిని అరక్షణంలో అణచివేస్తాను.

సరే అంటే సరేనన్నారంతా. కళ్ళు మూసుకున్నారు. అంతలోనే అగ్నిని కృష్ణుడెలా అణచివేసేదీ చూసేందుకు ఉత్సాహపడ్డారు. సన్నగా రెప్పలు పైకెత్తి చూడసాగారు. కృష్ణుడు దావాగ్ని జ్వాలలను కబళించసాగాడు. పెద్దగా నోరుతెరచి, అగ్నిని అతడు ఆపురావురుమంటూ మింగుతోంటే ఆశ్చర్యపోయారంతా. కృష్ణుడు యోగమాయాశక్తికే అది సాధ్యం అనుకున్నారు.

ఇంతటి యోగమాయాశక్తి కలిగిన కృష్ణుడు, హరిహరబ్రహ్మలలో ఎవరో ఒకరుగాక వేరుకాదు అనుకున్నారు.

మంట మసిబారింది. అగ్ని ఆరిపోయింది. చల్లగాలికి అడవి సేదదీరింది. కృష్ణుడుసహా అంతా వెనుదిరిగారు. మర్రిచెట్టునీడకు చేరుకున్నారు. ఆలమందలు కూడా వారిని అనుసరించి, ఆ చెట్టునీడలో విశ్రమించాయి. కాసేపటికి లేచారంతా. కృష్ణుడు మురళీగానాన్ని ఆలపించాడు. ఆ సంగీతలహరిలో బలరాముడుసహా అంతా పల్లెకు చేరుకున్నారు. పల్లెకు చేరిన పిల్లలను గుండెలకదుముకున్నారు గోపకాంతలు. దావాగ్నిని మింగిన కృష్ణుడు గురించి కథలు కథలుగా పిల్లలు చెబితే ఆశ్చర్యపోయారంతా. బలరామకృష్ణులు సాధారణమైనవారు కాదన్నారు. దివ్యపురుషులని జేజేలర్పించారు.

**(సప్తమఖండం సమాప్తం)**

జనమేజయమహారాజా! తర్వాత బృందావనం అంతటా శరదృతువు సోయగంతో ఒప్పారింది. గోపాలకులంతా ఆహ్లాదభరితులైనారు. ఆకాశంలో మేఘాలు తెల్లనిపూలలా ప్రశాంతంగా సంచరించాయి. నిర్మల కాంతులతో ఆకాశం తేజరిల్లింది. వేలాడుతున్న ముత్యాలమాలికల్లా తారకలెల్లెడలా ప్రకాశించాయి. వెన్నెలవెలుగు చల్లగా పరచుకుంది. పండి ఒరగా ఒరిగిన వరిచేలలో గలగలధ్వని శ్రవణపేయమైంది. పంటచేలలో గోపికల అదలింపులతో పైపైకెగిసిన చిలుకలబారుల కలకలధ్వని ఆకాశాన్నంటింది. కలహంస సారసాది పక్షుల కలకలరావాలతో కొలనులు ప్రతిధ్వనించాయి. నిర్మలమైన నదీప్రవాహాల తీరాలలో ఎత్తుగా, చక్కని ఇసుకతిన్నెలు ఏర్పడినాయి. వాటిమీద ఆసీనులై ప్రాతఃకాలంలో మునీంద్రులు సంధ్యావందనాది కార్యక్రమాలు ఆచరించసాగారు. వారి పర్ణశాలలలో మునికాంతలు పెంచిన బంతులూ, చేమంతులూ పసిమివెలుగులు విరజిమ్మాయి. అదే అదనుగా మన్మథుడు చెరకువింట బాణాలొకటొకటే సంధించి, పుంఖానుపుంఖంగా ప్రయోగించసాగాడు. విరహిణులను వేధించసాగాడు. అలాంటి మనోహరమైన శరత్కాలంలో కృష్ణుడు ఆలమందలను విహరింపజేస్తూ జగన్మోహనమైనస్వనంతో వేణుగానాన్ని వినిపించసాగాడు.

**–అరణి**




# నేను ఫెయిలైనా నన్నేమీ అనలేదు!

(గతవారం తరువాయి)

**అలా ఊళ్లో వాళ్ల ముందు పరువు పోగొట్టుకోవడం ఇష్టం లేక దాదాపుగా అందరూ ఎంతో కొంత ఇచ్చేసేవారు. ఆ రోజుల్లో రూపాయి అంటే చాలా గొప్పకదా. అయినా పిల్లలందరం నోరు తెరచి అడిగేసరికి ముచ్చటపడి ఇచ్చేసేవారు. అలా వినాయకచవితి చాలా సందడిగా, అల్లరిగా గడిచేది. ఇవన్నీ ఒక ఎత్తయితే దసరా ఇంకో ఎత్తు. అన్నీ శుభ్రం చేయడాలు, కడగడాలు, కొత్తగా బొట్లు పెట్టడాలు, అలంకరించడాలు వంటివన్నీ ఉండేవి. అయితే నేను పెద్దగా కడిగేవాణ్ణి కాదను కోండి. అయినా గుమ్మాలకి మావిడాకులు కడితే వచ్చే అందం చాలాగొప్పగా ఉంటుంది కదా.**

చిన్నప్పటినుంచి సిస్టమేటిగ్గా ఉండటంవల్ల గానీ, క్యూట్‌గా ఉండటంవల్ల గానీ నన్ను అందరూ కాస్త ప్రత్యేకంగా చూసేవారు. పండగపూట నేను కొత్తబట్టలు వేసుకున్నాక, మా అమ్మగారే తల దువ్వేవారు. తల దువ్వుతున్నంత సేపూ 'జాగ్రత్తగా ఉండాలి. దిష్టి తగులుతుంది. ఎవరి కంట్లోనూ పెద్దగా పడమాకు. ఎక్కడా అల్లరి చేయొద్దు' అని చాలా జాగ్రత్తలే చెప్పేవారు. అయినా అలా బయ టకు వెళ్లగానే సాయంత్రానికో, మధ్యాహ్నానికో నాకు బాగా జ్వరం వచ్చేసేది. తలనొప్పి చాలానే ఉండేది. నేను గుమ్మంలో అడుగుపెట్టగానే నా వాలకం చూసి మా అమ్మగారు కనిపెట్టేసేవారు. వెంటనే ఉప్పు దిగతీసిపోయడం వంటివన్నీ చేసే వారు. విభూది కూడా పెట్టేవారు. సాయంత్రాని క్కూడా తగ్గకపోతే ఏ డాక్టర్ దగ్గరకో తీసుకెళ్లే వారు. అప్పుడు ఆయన ఏదో ఓ మాత్ర రాసిస్తే అది వేసుకున్నాక తగ్గేది. అలా కొన్నాళ్లు దిష్టితగిలి బాధపడేవాణ్ణి.

అలాగే నాకు చిన్నప్పుడున్న మరో అనారోగ్యం ఏమిటంటే.. ముక్కు నుంచి రక్తం కారడం. చిన్న అదురుతగిలినా.. ముక్కులోంచి నీళ్ళు కారినట్టు బ్లడ్ కారిపోతుండేది. ఎందుకు కారేదో తెలియదు.. కొన్నిసార్లు చదువుకుందామని కూర్చుని తల ముందుకు వంచితే, దానంతట అదే బ్లడ్‌వచ్చి పుస్తకం మీద పడిపోయేది. ఒక్కోసారి భోజనం చేస్తుంటే ముక్కునుంచి రక్తం కారి విస్తట్లో పడిపోయేది. అది చూడగానే మా అమ్మగారి మనస్సు చివుక్కు మనేది. వెంటనే కాసేపు తల వెనక్కి వాల్చమనే వారు. అలాగే వాల్చి కూర్చునేవాడిని. కాసేపటికి అది గడ్డకట్టిపోయేది. అప్పట్లో ఈ సమస్య దృష్టిలో పెట్టుకుని నన్ను డాక్టర్ల దగ్గరకు కూడా బాగానే తిప్పారు. 'చిన్నప్పుడు ఇలాంటివి వస్తాయి, పిల్లలు కదా కాస్త వయసు వచ్చేకొద్దీ పోతుంది' అన్నారు డాక్టర్లు. వాళ్లు చెప్పింది నిజమే. ఒక వయసు వచ్చే సరికి నాకు ముక్కునుంచి రక్తం కారడం తగ్గి పోయింది.

## రొయ్యల అలర్జీ

కొల్లేరు పేరు విని ఉంటారు కదా. అది మా ఊరు పక్కనే ఉండేది. మా ఊరు దాటితే కొల్లేరు ఉండేదన్నమాట. ఆ సరస్సు చాలా పెద్దది. కొల్లేట్లో చేపలు బ్రహ్మాండంగా దొరికేవి. రొయ్యలు బాగా దొరికేవి. పిట్టలైతే ఎన్ని వెరైటీలు ఉండేవో. అందు వల్ల మా ఊళ్లో వాళ్లు అందరూ నాన్‌వెజిటేరియన్ చాలా బాగా తినేవారు. పక్కనే ఫ్రెష్‌స్టాక్ దొరకడం వల్ల మాంసాహారప్రియులు ఎక్కువన్నమాట. నేను కూడా చిన్నతనంలో చేపలు, రొయ్యలు వంటివి చాలా ఇష్టంగా తినేవాడిని. మా అమ్మ రొయ్యల కూర చేస్తే ఆఖరిముద్ద కూడా ఎంతో ఇష్టంగా తినే వాడిని. నా 15వ ఏట అనుకుంటా.. ఒకరోజు మా అమ్మ రొయ్యలు వేపుడు చేసింది. చాలా ఇష్టంగా తిన్నా. మధ్యాహ్నం బాగా నిద్రపోయా. సాయంత్రం లేచేసరికి ముఖం ఎర్రగా ఉబ్బింది.. కళ్ళన్నీ వాచి పోయాయి. మెడ, చెవులు వింతగా అనిపించాయి. వెంటనే డాక్టర్‌గారి దగ్గరకు వెళ్లా. 'ఏం తిన్నావ్.. ఈ రోజు' అని అడిగారు.

"రొయ్యల కూర తిన్నానండీ" అన్నా.

'ఇక ఈ జన్మకి నువ్వు రొయ్యలకూర తిన మాకు' అన్నారు.

"అదేంటండీ.." అన్నా.

'రొయ్యలు నీకు అలర్జీ తెచ్చేశాయి' అన్నారు.

"అయ్యో, నిన్నామొన్నా కూడా తిన్నాను.. అప్పుడు లేని అలర్జీ ఇప్పుడేంటండీ" అన్నా.

## బహుశా అదే తొలి, మలి చిత్రం

*నవ్య వీక్లి ఆగస్టు 9వ తేదీ సంచికలో ప్రారంభమైన ప్రముఖ నటుడు మురళీమోహన్ ముచ్చట్లు చూశాను. చాలా సంతోషం కలిగింది. ఆయన జీవిత చరిత్ర సీరియల్ చూడగానే నాకు ఒక విషయం జ్ఞాపకం వచ్చింది.*

*1976-77 సంవత్సరంలో ఒకసారి 'విజయ' మాసపత్రిక పల్లెటూరు వాతావరణంలో అలరించే ఆహ్లాదకరమైన సినిమా కథల పోటీ నిర్వహించింది. ఆ పోటీలో ఎంపికైన ఒకేఒక్క నవల నేను రాసిన 'కామరాజు కథ'. 1977లో 'విజయ' మాసపత్రికలో నవలానుబంధంగా ప్రచురితమైంది. కమల్‌హాసన్ హీరోగా, కె.రాఘవేంద్రరావు దర్శకత్వంలో ఈ నవలను 'కామరాజుకథ' పేరుతో సినిమాగా తియ్యాలని అప్పట్లో విజయబాపినీడు అనుకున్నారు. కానీ ఎందుకో అది పొసగలేదు. తర్వాత దర్శకుడు రాజాచంద్ర ఈ నవల హక్కులు కొనుక్కుని 'వారాలబ్బాయి' సినిమాగా తీశారు. ఒక వారాలబ్బాయి పాత్రను హీరోగా మలచిన తొలి, బహుశా చివరి సినిమా కథ అదే అనుకుంటాను. నటుడు మురళీమోహన్‌కి ఆ పాత్ర ఒక ప్రత్యేకం కావడం, ఆయన కెరీర్‌లో అదొక మైలురాయిగా నిలిచిపోవడం చాలా సంతోషదాయకం. మురళీమోహన్ ముచ్చట్లు చూశాక ఆ జ్ఞాపకాలను ఈ లేఖద్వారా పాఠకులందరితో పంచుకోవాలనిపించింది.*

—వసుంధర

'వచ్చేసింది అది అంతే. నీకు మొన్నా, నిన్నా పడింది, ఈ రోజు పడలేదు. కొందరికి ఒక్కోసారి అలర్జీ వస్తుంటుంది. అలా నీకు రొయ్యల అలర్జీ మొదలైంది' అన్నారు.

"డాక్టర్‌గారండీ, మరి నాకు రొయ్యలంటే ఇష్ట మండీ. జాగ్రత్తగా తినడానికి మార్గాలున్నాయా?" అన్నా.

'కావాలంటే ఒక సంవత్సరం తర్వాత మరలా ఒకసారి ట్రై చేసి చూడు, అంతవరకు ముట్టుకో వద్దు' అన్నారు.

ఏడాది ఎప్పుడవుతుందా అని బాగా వెయిట్ చేసి చూశా. కానీ మరలా అదే అలర్జీ. ఆ రోజు నుంచి ఈ రోజువరకు కూడా ఆ అలర్జీ పోలేదు. అలర్జీ ఎంతగా అయిందంటే లాస్ట్ టైమ్ ఒకసారి తానాకి వెళ్లినప్పుడు అక్కడి వాళ్లు ఫుడ్ మొత్తం తెచ్చిపెట్టారు కానీ, వడ్డించే గరిటెలు తేలేదు. సరే నని.. మాలోనే ఒకరు చేతులు శుభ్రంగా కడుక్కుని వచ్చి చేతులతోనే సర్వ్ చేశారు. అలా చేసిన వ్యక్తి ఏం చేశారంటే.. ఎవరికో రొయ్యలకూర పెట్టి, నాకు అదే చేత్తో చికెన్ సర్వ్ చేశారు. ఇక రాత్రయ్యే సరికి వామిటింగ్స్ మొదలయ్యాయి. ఆ రోజు ఇండియా బయలుదేరాల్సిన వాడిని, ప్రయాణం కేన్సిల్ చేసు కుని, రెండు రోజులు అక్కడే ఉండి, మరలా టికెట్స్ బుక్ చేసుకుని రావాల్సి వచ్చింది.

**చాటపర్రు పక్కనే కొల్లేరు సరస్సు ఉండేది. అక్కడి చేపలు బ్రహ్మాండంగా ఉంటాయి. ఎన్నో వెరైటీ పిట్టలు దొరుకు తాయి. అందుకే చాటపర్రులో మాంసా హార ప్రియులే ఎక్కువమంది. కోరుకు న్నప్పుడు ఫ్రెష్‌స్టాక్ దొరుకుతుంది. చిన్నప్పుడు మురళీమోహన్ కూడా చేపలు, రొయ్యలు బాగా ఇష్టంగా తినే వారు. ఇవన్నీ హైస్కూలునాటి సంగతులు. ఆ తర్వాత ఏలూరు కాలేజీలో సూపర్‌స్టార్ కృష్ణ ఆయన క్లాస్‌మేటయ్యారు. అదెలా గంటే....**

అంతకుముందు ఓసారి రొయ్యల పలావు చేశారు ఇంకొకరు. వాటిలో చాలా చిన్న చిన్న రొయ్యలు వేశారు. అవి అసలు కనిపించలేదు. జీడి పప్పులు, అవీ.. ఇంచుమించు ఒకేరకంగా ఉన్నాయి. ఏవో మాటల్లోపడి ఏం వడ్డించారో చూడకుండా తినేశా. కబుర్లు చెబుతూ తినేశాక 'అమ్మో రొయ్య లున్నాయా' అని అనుకుని చాలా సఫర్ అయ్యా. ఇప్పటికీ నేను రొయ్యలకు దూరమే.

### చదువులు.. కొలువులు!

ఎవరైనా చదువుల గురించి మాట్లాడితే నాకు వెంటనే చాటపర్రు గుర్తుకొస్తుంది. నేను ఎస్ఎస్ ఎల్‌సీ దాకా మా ఊళ్ళోనే చదివా. అప్పటిదాకా మా ఊళ్లో కరెంట్ కూడా లేదు. ఎవరు చదువుకో వాలన్నా లాంతర్ల వెలుతురులోనే. నాకు చదు వంటే చాలా ఇష్టం. ఏ పూటా స్కూలుకు ఎగ్గొట్టే వాడిని కాదు. ప్రతిరోజూ టైమ్‌కి వెళ్లేవాడిని. స్కూల్లో టైమ్ ప్రకారం తినేవాడిని. టైమ్ ప్రకారం చదివేవాడిని. మా అమ్మగారేమో ప్రతిరోజూ తెల్లారు జామునే నిద్రలేపి మరీ చదవమనేవారు. ఉద యాన్నే లేపి టీ ఇచ్చి, ఒక లాంతరు పెట్టేవారు. అక్కాచెల్లెళ్లు ఇద్దరు, అన్నదమ్ములం ఇద్దరం. మొత్తం నలుగురం కలిసి ఆ లాంతరుచుట్టూ కూర్చునేవాళ్లం. అంత ఉదయాన్నే నిద్రలేవడమే బద్ధకంగా ఉండేది. అయినా మా అమ్మగారు ఊరు కోరని లేచేసేవాళ్లం. కొంతసేపు అయ్యేసరికి అమ్మ గారు ఏ పనిమీదనో అటో, ఇటో వెళ్లేవారు. వెంటనే కాళ్లు పక్కకు జరిపి, కాసేపు అలా బోర్లా పడుకుని, కాసేపు పుస్తకం ముఖానికి అడ్డంపెట్టుకుని, మధ్యలో కాసేపు కునుకుపాట్లు పడుతూ ఇలా చాలానే తిప్పలు పడేవాళ్లం. అప్పటికీ మా అమ్మ గారు మధ్యమధ్యలో వచ్చి చూసేవారు. ముఖానికి ఎవరైనా పుస్తకం అడ్డుపెట్టుకుని నిద్రపోతుంటే తడిచేతితో వచ్చి కళ్లు తుడిచి, 'ఏయ్ చదువు అని గట్టిగా అనేవారు. కాసేపు కూరలు తరుక్కుంటూ మా పక్కనే ఉండేవారు. అంత జాగ్రత్తలు తీసు కుని చదివించినా నేను ఎస్ఎస్ఎల్‌సీ తప్పా. అందుకు కారణం లేకపోలేదు. నేను చదవడానికి బాగానే చదివినా, ఎందుకో నాకు చదివినవి గుర్తుండేవి కావు. బాగా చదువుకున్న ప్రశ్నకు కూడా పరీక్ష హాలులో కూర్చుని సమాధానం రాయాల్సి వచ్చినప్పుడు బిక్కమొహం వేసేవాడిని. చదివింది అసలు గుర్తుకొచ్చేది కాదు. అంతా వింతగా అనిపించేది. అయినా ఏదోలా గుర్తున్నది రాసి బయటకు వచ్చేసేవాడిని. ఏదైతేనేం ఫలితాలు వచ్చిన రోజున నేను పాస్ కాలేదని అందరికీ తెలిసి పోయింది. బేసిగ్గా బుద్ధిమంతుడిని, పైగా ప్రయత్న లోపం లేకుండా చదివినవాడిని అని అందరూ అర్థం చేసుకున్నారు. నన్ను ఎవరూ ఏమీ అనలేదు. 'ఈసారి జాగ్రత్తగా రాయి, పాస్ అవుతావు' అనే అన్నారు. సరిగ్గా ఆ సమయంలోనే మా ఊరికి కరెంట్ వచ్చింది. దాంతో దీపం చుట్టూ చేరి చదివే పరిస్థితిలో మార్పు వచ్చింది. కాస్త గట్టిగానే చది వాను, పాస్ అయిపోయా.

ఆ తర్వాత ఫస్ట్ టైమ్ కాలేజీకి వెళ్లా. కాలే జీకి, మా ఊరికి నాలుగు మైళ్ల దూరం ఉండేది. రోజూ నడుచుకుంటూ వెళ్లడం, రావడం కష్టమ య్యేది. అయినా నేను మా నాన్నగారిని "నాకు సైకిల్ కొనిపెట్టండి" అని అడగలేదు. మా నాన్న గారు ఆయనంతట ఆయనే కొనిపెట్టారు. వాటికి తోడు ప్యాంట్లు కూడా కొనిచ్చారు. అప్పటిదాకా నిక్కర్లు వేసుకునేవాడిని కాస్తా కొత్తగా ప్యాంట్లు వేసుకోసాగా. సైకిల్ వెనుక క్యారేజ్‌లో బుక్స్ పెట్టు కుని, కొత్త ప్యాంట్లు వేసుకుని వెళ్తుంటే చాలా హుషారుగా, స్టైల్‌గా ఉండేది. ఐదింటికి కాలేజీ అయిపోతే, మా ఊరికి రావడానికి గంటపైగా పట్టేది. చీకటి పడేలోపు ఇంటికి వచ్చేయాలనే ఉద్దే శంతో కాలేజీ బెల్లు కొట్టగానే హుటాహుటిన సైకిల్ స్టాండ్‌కెళ్ళి సైకిల్ బయటకు తీసేసేవాళ్లం. మిగిలిన వాళ్లు గేమ్స్ ఆడుతున్నా నేను అక్కడ నిలబడే వాడిని కాదు. నా ఇబ్బందులు చెప్పి అక్కడినుంచి వచ్చేసేవాడిని. మరి కొంతమంది అప్పటికే నాట కాలు వేసేవారు. నేను అలా నాటకాలు కూడా ఏమీ వేయలేదు. ఆ దశలో నాటకాలు చూడను కూడా లేదు. అసలు మా ఊరు పిల్లల ఆలోచనే నాటకాలమీద ఉండేదికాదు కదా.



### కృష్ణగారు నా క్లాస్‌మేట్

ఇక్కడొక ఆసక్తికరమైన విషయం చెప్పాలి. అదేమిటంటే, ఏలూరు కాలేజీలో కృష్ణగారు నా క్లాస్‌మేట్. వాళ్ల ఊరు ఏలూరు కాదు. తెనాలి. తెనాలి దగ్గర బుర్రిపాలెం. వాళ్ల ఫాదర్‌కి, మదర్‌కి ఏలూరు దగ్గర్లో కొన్ని తోటలు ఉండేవి. అందువల్ల వాటికోసం ఏలూరు దగ్గర ఉండేవారు. దాంతో ఈయన మా కాలేజీలో చేరారు.

**(ఇంకా ఉంది)**

**డా. చల్లా భాగ్యలక్ష్మి**
**సెల్: 88850 55528**

# సైలెన్స్ ఇన్ ద కోర్ట్

-తులసి బాలకృష్ణ

**"నీ పేరు?"**

**"తల్లిదండ్రులు పెట్టినపేరు గోదావరి. బజారుపేరు లక్కీ". ఎడారిలాంటి ముఖం, ఆమె చూపుల్లో సమాజంపట్ల అసహ్యంతో కూడిన నిర్లక్ష్యం, మనిషిలో తెగింపు.**

**"నీ తరఫున వాదించటానికి లాయర్ ఉన్నారా?" నిస్సారమైన నవ్వే ఆమె జవాబు.**

**"ప్రాణం నిలుపుకోవడానికి మానం అమ్ముకునేదాన్ని, లాయర్ని పెట్టుకునేంత స్తోమత నాకెక్కడిది సార్? అయినా మా దేహాన్ని కోరే వాళ్ళుంటారుగానీ, మా క్షేమం కోరేవాళ్ళెక్కడుంటారు?"**

"బజారులో సినిమాహాళ్ళ పక్కన నిలబడి మగ వాళ్ళని రెచ్చగొట్టి, నీతో తీసుకుపోయి సమాజాన్ని చెడ గొడుతున్నావని నీ మీద కేసు. నిజమేనా?"

ఒక్కసారిగా ఆక్రోశంతో అరిచింది ఆమె. "అది నావృత్తి సార్.. నా పొట్ట నింపుకోవడానికి వేరే మార్గం లేదు. లేకుండా చేసింది ఈ సమాజం" ఆవేశం అణచు కోవడానికి ప్రయత్నిస్తూ ఓ నిమిషం వగర్చింది. "ఓ మంచి కుటుంబంలో పుట్టిన నాకూ అందరు ఆడపిల్ల ల్లాగే చదువుకోవాలని, మంచి ఉద్యోగం చెయ్యాలని, పెళ్ళి చేసుకుని చక్కగా కాపురం చేసుకోవాలనే కోటి ఆశలూ, ఆశయాలూ, కోరికలు ఉండేవి. కాని అవన్నీ ఓ అందమైన దుర్మార్గుడి కారణంగా నాశనమైపోయాయి. ప్రేమపేరుతో వంచించి, వాడు నన్నీ రొంపిలోకి దింపి, క్యాష్ చేసుకుని మాయమైపోయాడు. నా బతుకుమారే అవకాశం లేదు. నా కోరికలూ, ఆశలూ, ఆశయాలన్నీ నాతోబాటు కాలిపోవాల్సిందే. నాకు మరో దారి లేదు. నేను చేస్తున్నది చట్టం దృష్టిలో నేర మైతే శిక్షకి సిద్ధమే సార్" అంది ఏడుస్తూ.

మూడునెలలు సాధారణ జైలుశిక్ష విధించారు న్యాయమూర్తి. నిర్వేదంతో ఓ నవ్వు నవ్వి తలవంచు కుని పోలీసులతో వెళ్ళిపోయింది ఆమె.

రెండవ కేసు... ఓ పాతికేళ్ళ యువకుడు. వస్త్ర ధారణలోనూ, ప్రవర్తనలోనూ కూడా మోడ్రన్‌స్టైల్లో నిర్లక్ష్యంగానూ, అస్తవ్యస్తంగానూ ఉన్నాడు. తీసు కొచ్చి బోనులో నిలబెట్టారు. అతని పేరు సతీష్. అతన్ని చూస్తూనే విజిటర్స్ గ్యాలరీలో ముందు వరుసలో కూర్చున్న భార్గవి ముఖం ఎర్రబడింది. ప్రక్కనే ఉన్న ఆమె తండ్రి పతంజలి దవడలు బిగుసుకున్నాయి. ఇద్దరి గుండెల్లో కోపం, ఉక్రోషం, అసహాయత ఒక్క సారిగా ఎగదన్ని, పళ్ళు గిట్టకరుచుకుపోయాయి. సతీష్ భగవద్గీతమీద ప్రమాణం చేశాక పబ్లిక్ ప్రాసి క్యూటర్ అతడిని కొన్ని ప్రశ్నలు అడిగాడు. అన్నిటికీ చాలా నిర్లక్ష్యంగా జవాబులు చెప్పాడతను. తనకి శిక్ష పడదన్న ధీమా అతనిలో కనిపిస్తోంది. తనుపెట్టు కున్న డిఫెన్స్ లాయర్ సామర్థ్యంమీద అతనికి గొప్ప నమ్మకం ఉంది. గ్యాలరీలో బెంచీలమీద జనం మధ్యలో సన్నని జరీఅంచు నీలంచీర కట్టుకుని కూర్చున్న ఓ యాభైఏళ్ళ స్త్రీవైపు పదే పదే చూస్తున్నాడు అతను. ఉన్నత ఉద్యోగం చేసే ఆమెని చూస్తుంటే అతనిలో ధైర్యం ద్విగుణీకృతం అవుతోంది. ఆమె గంభీరంగా కూర్చుని ఉంది. "బాధితురాలు కుమారి భార్గవిని బోనులోకి పిలిపించవలసిందిగా కోర్ట్ వారిని కోరుతు న్నాను యువరానర్" అన్నాడు పబ్లిక్ ప్రాసిక్యూటర్.

జడ్జిగారి అనుమతిమీద, ధైర్యం కలిగిస్తూ తండ్రి తన చేతిని తట్టాక బోనులోకి నడిచింది భార్గవి. ఆమె ముఖంలో సగభాగం చున్నీతో కప్పబడి ఉంది.

"అమ్మా! మీ మీద అత్యాచారానికి పూనుకున్నది ఈ వ్యక్తేనా?" అడిగారు పబ్లిక్ ప్రాసిక్యూటర్.

"ముమ్మూర్తులా వాడే సార్. ఖచ్చితంగా చెప్ప గలను" ఆమె కళ్ళు నిప్పులు కురిశాయి. గొంతు బాధగా, కోపంగా వణికింది.

"ప్లీజ్ నోట్ ది పాయింట్ యువరానర్"

ఆమెని క్రాస్ ఎగ్జామిన్ చేసేందుకు న్యాయమూర్తి అనుమతి తీసుకున్న డిఫెన్స్ లాయర్, "భార్గవీ! మీ క్యారెక్టర్ అంత మంచిదికాదనీ, మీకు మగవాళ్ళని రెచ్చగొట్టే నేచర్ ఉందనీ మీరుండే ఏరియాలో చెప్పు కుంటున్నారు. మీ సంజాయిషీ ఏంటిటి?" ఆమెను భయపెట్టే రీతిలో చూస్తూ అడిగాడు. ఆ అభియోగా నికి వణికిపోయింది భార్గవి. బాధతో కంపించి పోయాడు ఆమె తండ్రి పతంజలి.

"అబ్జెక్షన్ యువర్ ఆనర్. అసలే బాధితురాలు కుమిలిపోతుంటే, అమాయకురాలైన ఆమె శీలం మీదే అభియోగం తెస్తున్నారు డిఫెన్స్ లాయర్. ఇట్ ఈజ్ నథింగ్ బట్ క్యారెక్టర్ అసాసినేషన్ అండ్ సైడ్ లైనింగ్ ది మెయిన్ ఇష్యూ" అంటూ అభ్యంతరం చెప్పాడు పబ్లిక్ ప్రాసిక్యూటర్.

"అబ్జెక్షన్ సస్టైన్డ్! మిస్టర్ డిఫెన్స్ లాయర్, ఈ కేసుకు సంబంధించిన ప్రశ్నలే అడగండి" చెప్పారు న్యాయమూర్తి. "యస్ యువరానర్" అంటూ, "మీ మీద ఏ సమయంలో అత్యాచార ప్రయత్నం జరిగిం దంటారు?" ప్రశ్నించాడు డిఫెన్స్ లాయర్.

"రాత్రి సుమారు పదిన్నర అయ్యుండొచ్చు సర్"

"అంత రాత్రి! వేళ నిర్మానుష్యంగా ఉండే ఆ జూబ్లీహిల్స్ ప్రాంతంలో మీరేం చేస్తున్నారు?"

"నేను సాఫ్ట్‌వేర్ ఇంజినీర్ని. అప్పటిదాకా నాకు డ్యూటీ ఉంది సర్"

"అంత రాత్రివరకు డ్యూటీ ఉంటే కన్వేయన్సు ఏర్పాట్లు చేసుకునే ఉంటారు కదా?"

"రోజూ లిఫ్ట్ ఇచ్చే నా ఫ్రెండ్ రాలేదు ఆ రోజు"

"ఫ్రెండ్ అంటే... మేలా ఫిమేలా?"

"మేలే"

"అలా రాత్రుళ్ళలో డ్రాప్ చేసే బాయ్‌ఫ్రెండ్స్ ఎంతమందున్నారు మీకు?"

"అబ్జెక్షన్ యువరానర్" అన్నారు పబ్లిక్ ప్రాసిక్యూటర్.

"అబ్జెక్షన్ సస్టైండ్...మిస్టర్ డిఫెన్స్ లాయర్, ఇక మీరు ఆగండి" అని "అమ్మాయీ! అసలేం జరిగిందో నిర్భయంగా, వివరంగా చెప్పగలవా?" భార్గవివైపు చూశాడు న్యాయమూర్తి. బేలగా చూసింది ఆమె. "ఏం భయం అక్కర్లేదమ్మా. కోర్ట్ నీకు పూర్తి రక్షణ ఇస్తుంది"

తండ్రివైపు చూసింది భార్గవి. నెమ్మదిగా లేచి నిలబడి "నేను చెప్పనా సార్?" అన్నాడు పతంజలి.

"ఆయనెవరు?" భార్గవిని ప్రశ్నించారు న్యాయమూర్తి.





**ఓ కేసు విచారణ జరుగుతోంది. అసలు ఏం జరిగిందో నువ్వు చెప్పమ్మాయ్..అన్నారు న్యాయమూర్తి. ఆమె చెప్పిందంతా విన్నాక కోర్టుహాలంతా సానుభూతితో నిండిపోయింది. ఆ తర్వాత జరీఅంచు నీలంచీర స్త్రీ ఒకామె బోనులోకి ప్రవేశించింది. ఆమె ఎవరో తెలిశాక అంతా అవాక్కయ్యారు. ఆమె మాట్లాడాక కోర్ట్‌హాలులో ఎవ్వరికీ నోరుపెగలలేదు. న్యాయమూర్తి సైతం ఆలోచనలో పడ్డారు. ఇంతకీ ఆమె ఎవరు? ఏం మాట్లాడింది.**

"మా నాన్నగారు సార్."

"అంటే మీ నాన్నగారికి నువ్వు నీ మీద జరిగిన అత్యాచార ప్రయత్నం గురించి సవివరంగా చెప్పావన్న మాట?"

"చెప్పాను సార్. మా అమ్మక్కూడా చెప్పాను."

"అయితే నీకు మీ అమ్మానాన్నల మీదున్న గౌరవం, నమ్మకం ఈ కోర్ట్‌మీద లేవన్నమాట!"

అయోమయంగా చూసింది భార్గవి. తేలిగ్గా నవ్వారు న్యాయమూర్తి. "నేనూ నీ తండ్రిలాంటి వాడినే. న్యాయదేవత నీ తల్లిలాంటిది కాదూ? 'నా మీద అత్యాచార ప్రయత్నం జరిగింది' అని ఇంతధైర్యంగా వచ్చి న్యాయస్థానాన్ని ఆశ్రయించినదానివి, కోర్ట్‌కి వివరాలు చెప్పడానికి వెనకాడతావేం?" అడిగారు న్యాయమూర్తి.

"చెప్పమ్మా. భయం లేదు. జడ్జిగారు అడుగుతున్నారు కదా చెప్పు" కూతురికి ధైర్యం కలిగిస్తూ అన్నాడు పతంజలి.

తండ్రి, న్యాయమూర్తి అందించిన ధైర్యంతో చెప్పనారంభించింది భార్గవి.

***

"ఆ రాత్రి ఆఫీసులో డ్యూటీ పూర్తయ్యాక తెలిసిన ఫ్రెండ్స్ లిఫ్ట్ ఏదైనా దొరుకుతుందన్న నమ్మకంతో ఆఫీస్ నుంచి బయటకు వచ్చాను. తెలిసిన స్నేహితులెవరూ కనిపించలేదు. ఇక అంత రాత్రివేళ ఒంటరిగా టాక్సీ ఎక్కడానికి సాహసించలేక సిటీ బస్సు సేఫ్ అనుకున్నాను. బస్టాప్‌వైపు నడిచివెళుతుంటే, తనని దాటి వెళ్ళిపోయిన సతీష్ కారు రివర్స్‌లో వెనక్కి వచ్చింది. సిటీలో అల్లర్లు జరుగుతున్నాయని, అల్లరి మూకలు చెలరేగి పోతున్నారని, బస్సులు, ఆటోలు బంద్ చేసేస్తున్నారని నమ్మబలికి తనకి లిఫ్ట్ ఆఫర్ చేశాడు. తప్పని పరిస్థితుల్లో మంచి వాడిలా కనిపిస్తున్న అతని మాటలు నమ్మి, తను కారు ఎక్కితే, దారి మళ్ళించి నిర్జన ప్రదేశానికి తీసుకుపోయాడు. దౌర్జన్యంగా పశుబలం ప్రదర్శించాడు. తాళ్ళతో నా చేతులు కట్టేసి, అత్యాచారానికి పాల్పడ్డాడు. తన శక్తికొద్దీ అతడిని ప్రతిఘటిస్తున్న సమయంలో, దేవుడు పంపినట్లు అటుగా వచ్చిన ఓ ఊర కుక్క ఏదో కీడుని శంకించి, మెయిన్‌రోడ్డువైపు తిరిగి, భయంకరంగా హృదయవిదారకంగా దిక్కులు పిక్కటిల్లేలా మొరగడం ప్రారంభించింది. దాంతో అనుమానించిన పోలీస్ పెట్రోలింగ్ వ్యాన్ సైరన్‌తో వస్తూంటే, సతీష్ భయపడి కారులో పారిపోయాడు. నేను కారు నెంబర్ నోట్ చేసుకుని, నన్ను రక్షించిన పోలీసులకి అందజేశాను. ఆ తర్వాత సతీష్ అరెస్టయ్యాడు" జరిగినదంతా ఆవేశంగా వివరించాక దుఃఖంతో గొంతు పూడుకుపోతుండగా, "చూడండి సార్, నా చేతుల్ని తాళ్ళతో కట్టెయ్యడమే కాకుండా, నేను ప్రతిఘటించి కాలుతో తన్నానని బండరాయితో నా ముఖం మీద బాదాడు" అంటూ చున్నీ పక్కకు తొలిగించి ముఖం చూపించింది భార్గవి. ఆమె ముఖంమీద ఎడమకణత దగ్గర పెద్దగాయం. ఆ గాయం ఇంకా పచ్చిగానే ఉంది. చూడలేనంత బాధ, వెన్నులో జలదరింపు కలిగి, "ప్చ్... ప్చ్...." అంది కోర్ట్ మొత్తం ఒక్కసారే. ఆమెపై జాలితో ప్రతిస్పందించారు అందరూ. న్యాయమూర్తిసహా అందరూ సానుభూతిగా ఆమెవైపు చూశారు. జరీఅంచు నీలంచీర కట్టుకుని గ్యాలరీలో బెంచ్‌మీద కూర్చున్నావిడ కూడా కళ్ళొత్తుకుంటూ అందరికంటే ఎక్కువగా బాధపడడం చూసిన సతీష్ పిచ్చి ఆవేశంతో ఒళ్ళుమరచి, "అబద్ధం, కాలుతో నన్ను తన్నిందని కాదు. అది నా మొహం మీద కాండ్రించి ఉమ్మేసినందుకు కొట్టాను" అంటూ పిచ్చి కేక పెట్టాడు.

'దొరికిపోయావురా' అనే భావనతో అందరి తలలూ వాడివైపు తిరిగాయి. తన తొందరపాటుకి కంగారు పడుతూ, డిఫెన్స్ లాయర్‌వైపు చూశాడు సతీష్ అయోమయంగా. ఆయన తల పట్టుకుని కుర్చీలో కూలబడుతున్నాడు. కోర్టులో కలకలం రేగింది. సతీ




పచ్చపచ్చని పొలాల మధ్య
సరిహద్దు రేఖ నిద్రిస్తూ ఉంది
రెప్పపాటు మరచిన సైనిక బృందం
అప్రమత్తమై ఉంది

## సరిహద్దు రేఖ

ఎక్కుపెట్టిన తుపాకులు
ఎదురెదురుగా మాటువేశాయి!
ఇటు బలప్రదర్శన చేసిన భాస్కరుడు
అటు కంచెదాటి బలహీనమై ప్రయాణం
వాహ్యాళికొచ్చిన నూతన దంపతుల్లా
అటు మేఘ మాలికలు కంచె దాటాయి
పడమటి సంధ్యారాగానికి వీడ్కోలిచ్చి
ఎండిన నేలకు పండగ చేస్తూ వర్షించాయి
నీరు పల్లమెరుగన్న నిజాన్ని నిజం చేస్తూ



ఇటుపారి నేలను పలకరించింది!
మునిమాపు చీకట్లో మేఘాలు
అటు నుండి ఇటు పయనించి
అటు నేలతో ఇటు నేలను సమతుల్యం చేస్తూ
వర్షాన్ని కురిపించాయి
పల్లపు ప్రాంతమే పదిలమంటూ నీరు
ఇటు నుండి హద్దుదాటి అటు పారింది!
ఇటు జన్మించిన జీవనది అటు ప్రవహించి
నాలుగు మాడ వీధుల్లో దేవుడి ఊరేగింపులా
సరిహద్దుకు అటూ ఇటూ తిరిగి
హరిత విప్లవం నా ధ్యేయం
మానవ కళ్యాణం నా సందేశమంది!
అభ్యర్థి ప్రత్యర్థి
వైషమ్యాలు యుద్ధాలు తెలియని గాలి
సరిహద్దుకు అటూ ఇటూ
యథేచ్ఛగా తిరుగుతూ
ప్రాణం పోయడమే కర్తవ్యమంది!
సరిహద్దు రేఖపై రహదారులు వేస్తూ
వలస పక్షుల ఆగమనం
నిష్క్రమణం సాగుతుంది!
ఎదురెదురుగా నిల్చిన తుపాకులు
కవ్వించుకుని ఒక్కసారిగా పేలాయి
అటూ ఇటూ శవాల్ని శవపేటికల్లో
భద్రపరుస్తూ సహచర సైనికులు
కాయలు రాలినంతమాత్రాన చెట్టుపడిపోదంటూ
ఎదురెదురుగా మళ్ళీ ఎక్కుపెట్టిన తుపాకులు
పచ్చటి పొలాల మధ్య
రక్త తివాసీపై నిద్రలేమితో సరిహద్దురేఖ-

**—అడిగోపుల వెంకటరత్నమ్**
**సెల్:98482 52946**

ష్‌కి శాపనార్థాలు పెడుతున్నారు అంతా. "సైలెన్స్ ఇన్ ద కోర్ట్" ఆజ్ఞాపించిన న్యాయమూర్తి, సతీష్‌కు ఆఖరి అవకాశం ఇస్తున్నట్టుగా, "నువ్వు చెప్పుకునేదేమైనా ఉందా?" అని అతడివైపు చూశారు. ఒళ్ళు మరచి తను అరచి బయట పడడం, తన లాయర్ నిస్సహాయంగా కుర్చీలో కూలబడిపోవడంతో ఇక తనకు మరోదారిలేదని అర్థం చేసుకున్నాడు సతీష్. నోట మాట పెగలక తలదించుకున్నాడు. ఇక న్యాయమూర్తి తీర్పు చెప్పడమే తరువాయి.

అందరూ ఊపిరి బిగపట్టి ఎదురు చూస్తున్నారు. భయంకర నిశ్శబ్దం.

సైలెన్స్ ఇన్ ద కోర్ట్. ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ, "నాకు రెండు మాటలు మాట్లాడే అవకాశం ఇస్తారా యువరానర్?" పూడుకుపోతున్న స్వరాన్ని చీల్చుకుంటూ ఓ స్త్రీ గొంతు ఖంగుమంది. అన్ని తలలూ ఆ స్వరం వినిపించినవైపు తిరిగాయి. జనంమధ్య కూర్చున్న జరీ అంచు నీలంచీరావిడ లేచినిలబడి, వినయంగా న్యాయమూర్తికేసి చూస్తోంది. ఆమె గొంతు చాలా భారంగా ఉంది. ఆమె ముఖం కందగడ్డలా ఎర్రబడి ఉంది. తడి కనురెప్పలు.. కళ్ళల్లో ఎర్రటి రక్తపు జీరలు.

"మీరేం చెప్పదలచుకున్నారో బోనులోకి వచ్చి చెప్పండి" అన్నారు న్యాయమూర్తి.

బోనులోకి వచ్చి నిలబడిందామె. గొంతు సవరించుకుని, "అయ్యా! నా పేరు కాత్యాయని. నేను ఈ ముద్దాయి...కాదు కాదు నేరస్థుడైన సతీష్ కన్నతల్లిని" అందామె నిబ్బరంగా.

కుర్చీలోంచి ముందుకువంగి చెవులు రిక్కించారు న్యాయమూర్తి. కోర్ట్ హాల్లో గుసగుసల అలజడి.

"సైలెన్స్ ఇన్ ద కోర్ట్" ఆజ్ఞాపించారు న్యాయమూర్తి. "ఈ కేసు వాదనలన్నీ నేను పూర్తిగా విన్నాను. నా కొడుకు నేరస్థుడని నిస్సందేహంగా రుజువైపోయింది. నాకు తెలుసు. ఇప్పుడు మీరు వాడికి కఠినమైన శిక్షే విధిస్తారు. అయితే నాదో విన్నపం" అంది చేతులు జోడించి గొంతు గద్గదం కాకుండా జాగ్రత్త పడ్తూ. భ్రుకుటి ముడిచి చూశారు న్యాయమూర్తి.

కంగారుగా తండ్రివైపు చూసింది భార్గవి. 'తన కొడుక్కి క్షమాభిక్ష పెట్టమని వేడుకుంటుందేమో, న్యాయమూర్తి జాలిపడి వాడికి కఠినశిక్ష విధించరేమో' అన్నట్టున్నాయి ఆమె చూపులు. పతంజలితోబాటు చాలా మంది భావాలు అలాగే ఉన్నాయి. అపరాధ స్వరంతో ఆవిడ అంటోంది, "రత్నంలాంటి బిడ్డని జాతికి అందించలేకపోవచ్చు. కానీ ఓ దుర్మార్గుడికి జన్మనిచ్చి సమాజంమీదకు వదిలేసే అధికారం ఏ తల్లికీ లేనట్టే నాకూ లేదు. తల్లిగా ఎంత ప్రయత్నించినా వాణ్ణి ఓ బాధ్యతగల పౌరుడిగా తీర్చిదిద్దలేకపోయాను. మర్యాదస్థురాలు, అమాయకురాలైన ఓ ఆడబిడ్డ మీద క్రూరంగా అఘాయిత్యానికి పాల్పడిన వీడికి చట్ట ప్రకారం కఠిన శిక్ష పడాల్సిందే. తీర్పులో ఏ లోటూ ఉండకూడదు!"

ఆశ్చర్యంగా చూస్తూ గుసగుసలు పోతున్నారు అంతా.

"సైలెన్స్ ఇన్ ద కోర్ట్" న్యాయమూర్తి గొంతు ఖంగుమంది. అంతటా నిశ్శబ్దం.

తిరిగి చెప్పసాగింది ఆవిడ "అయితే తమరిప్పుడు వాడికి ఐదేళ్ళో, పదేళ్ళో, లేక యావజ్జీవ శిక్షో విధిస్తే వాడు జైలుగోడలమధ్యే పోతాడు. ఉరిశిక్ష విధిస్తే, కాలగర్భంలో కలిసిపోతాడు. జనం త్వరలోనే మరచిపోతారు. ఈ శిక్షలవల్ల చెడిపోయిన సమాజానికి చెప్పుకోదగ్గ లాభం కలగదు. కనుక ఈ విషయం దృష్టిలో ఉంచుకుని కోర్టువారు ఈ నేరస్థుడిని మరింత కఠినంగా శిక్షించవలసిందిగా కోరుతున్నాను"

అందరూ తెల్లబోయారు. తేరుకోలేక నిశ్శబ్దంగా ఊపిరి బిగపట్టారు. తల పంకించి, ఆమెను భ్రుకుటి ముడిచి చూశారు న్యాయమూర్తి. డెడ్ సైలెన్స్ ఇన్ ద కోర్ట్. ఆవిడ గొంతు తిరిగి ఖంగుమంది. "ఈ నేరస్థుడికి ఆ శిక్షల కంటే సరైనశిక్ష ఏంటో కోర్టువారికి తోచక పోతే, నేను సూచన చెయ్యొచ్చా అయ్యా?" అడిగింది ఆమె. న్యాయమూర్తిసహా అందరూ రెప్పలువాల్చకుండా ఆవిడనే చూస్తున్నారు.

మతిపోయి బేలగా తనవైపే చూస్తున్న కన్నకొడుకును శపిస్తున్నట్టు, కళ్ళతోనే అసహ్యించుకుని తర్జనితో బెదిరిస్తూ, కోర్ట్ హాలు ప్రతిధ్వనించే పెద్ద స్వరంతో అన్నది ఆమె, "దౌర్జన్యంగా ఆడపిల్లలమీద అఘాయిత్యానికి పాల్పడే ఇటువంటి నేరస్థులకి వేశ్యలుగా మార్చబడి రెడ్ లైట్ ఏరియాల్లో బ్రతుకుల్ని కుళ్ళబెట్టుకుంటున్న అభాగినుల జీవితాల్లో వెలుగు నింపడమే సరైన ప్రాయశ్చిత్తంతో కూడుకున్న శిక్ష! వీడిలాంటి మేకవన్నె పులులవల్ల మోసపోయి అత్యాచారాలకుగురై, అన్యాయంగా వేశ్యావృత్తిలోకి నెట్టబడ్డ లక్ష్మీలాంటి అభాగ్యురాలైన యువతినెవరినైనా పెళ్ళిచేసుకోవాలి. అందుకు ఆమె అంగీకారం తీసుకోవాలి. పదిరోజులకోసారి పోలీస్ స్టేషన్లో రిపోర్ట్ ఇస్తూ, మానసికంగా గానీ, శారీరకంగా గానీ ఆమెను ఏ బాధలకు గురి చెయ్యకుండా, రక్షణనిస్తూ సవ్యంగా ఏలుకుంటున్నట్టు ఎప్పటికప్పుడు రుజువు చేసుకోవాలి.... దయచేసి అలా తీర్పు చెప్పండి. ఓ నేరస్థుణ్ణికన్న ఓ పాపిష్టితల్లిగా ఇది నా వినయపూర్వక సూచన!" అపరాధభావంతో మ్లానమైపోయిన ఆవిడముఖంలో, సమాజం కోసం ఓ మంచిపని చేసి ప్రాయశ్చిత్తం చేసుకోవాలన్న ఆవేదన కనిపిస్తోంది.

ఆవిడ సూచన విని, సంభ్రమాశ్చర్యాలతో అవాక్కైపోయింది న్యాయస్థానం. న్యాయమూర్తి సైలెన్స్ అని చెప్పకుండానే, తనంత తానుగా నిశ్శబ్దాన్ని సంతరించుకుంది కోర్టు హాలు. అందరి చూపులూ ఆవిడవైపే... ఆశ్చర్యం... అభినందన...ఆరాధన...

ముందుగా తేరుకున్న భార్గవికి పట్టరాని ఆనందంతో కన్నీళ్ళు పొంగాయి. ఆవిడవైపు అభినందనగా చూస్తూ, అప్రయత్నంగా చప్పట్లు చరచడం ప్రారంభించింది. చరిత్ర ఎరుగని సంచలనతీర్పుకోసం ఆవిడ ఇచ్చిన సలహాకి ఆమోదముద్ర వేస్తున్నట్టు కోర్ట్‌హాలులో జతకలిసిన చప్పట్లకు సాయంగా ఎంతో సంతృప్తితో అన్ని తలలూ పరవశంగా ఊగాయి.

సంభ్రమంతో బాటు అభినందన నిండిన హృదయంతో కనురెప్పలు మూసుకుని తీవ్ర ఆలోచనలో నిమగ్నమైన న్యాయమూర్తి మస్తిష్కంలో, 'అరుదైన మాతృమూర్తి చేసిన ఆలోచించదగ్గ సూచన' అన్న అభిప్రాయం సుళ్ళు తిరుగుతూ బలపడుతోంది.

**సెల్: 87901 15544**

## పంచభూతములు - పంచేంద్రియములు
## 3. అగ్ని

సూర్యుడు ఒక నక్షత్రం... అగ్ని గోళం. నిరంతరం ప్రజ్వలిల్లుతూ ప్రకాశవంతమైన అగ్ని(ఉష్ణము)ని వెదజల్లుతూ ఉంటాడు. ఆ క్రమంలో సూర్యుడి నుండి విడుదలైన ఒక శకలం కాల క్రమంగా ఉపరితలం చల్లబడి భూగోళం అయింది.



ఉపరితలంలో 80% నీరు ఆక్రమించి ఉన్నపటికీ భూగర్భంలో ఇప్పటికీ అగ్ని రగులుతూనే ఉంది. సముద్రాలు కూడా రగులుతున్న అగ్ని (బడబాగ్ని), మరియు అనేక అగ్ని పర్వతాలతోనిండి ఉన్నాయి. మనిషితో సహా ప్రతి జీవిలోనూ అగ్ని '**ప్రాణదాత**'గా ఉంటుంది. తినే ఆహారం, జీవి కడుపులోని జీర్ణాశయంలో అగ్ని(జఠరాగ్ని) చేత దహింపబడి, జీర్ణమై ఆ శరీరానికి శక్తిని, పుష్టిని, కాంతిని, చలనాన్ని ప్రసరింపజేస్తుంది. అగ్నిలో ఎన్ని రకాలున్నప్పటికీ వాటన్నిటికీ మూలమైనది సూర్యగోళమని చెప్పక తప్పదు. అగ్ని ఏరకమైనదైనను రగిలే అగ్నిశబ్దాన్ని చెవిద్వార విన గలుగుతాము. అంటే.. అగ్నికి ఆకాశానికున్న '**శబ్దగుణము**' ఉంది. అగ్నిని మనం చర్మం ద్వార శృ్పషించి తెలుసుకోగలుగుతాము. అంటే అగ్నికి వాయువుకున్న '**స్పర్శ గుణము**' ఉంది. ఆకాశాన్ని, వాయువును కంటితోచూడలేము. కాని అగ్నిని కంటితో చూడగలము. అంటే '**అగ్నికి రూప గుణము**' కూడాఉంది. దానిని మనం కళ్ళతో చూడ గలుగుతాము. అలా పంచభూతాలలో మూడవ దైన అగ్నికి మన పంచేంద్రియాలలో ఒకటైన చక్షువేంద్రియము (కళ్ళు)కు ప్రత్యేక సంబంధము ఉన్నది.

### నాభార్య నా దగ్గరకి రావాలంటే...

- **నా భార్యకు నాకు మనస్పర్ధలు వచ్చి పది సం||లుగా వేరువేరుగా జీవిస్తున్నాము. సికింద్రాబాద్ ఉజ్జయిని మహంకాళి అమ్మవాకి గుడికి, కొత్తపేట అష్టలక్ష్మి మహాలక్ష్మి గుడికి ప్రతి నెల వెళ్లి, నా భార్యతో కలసి ఉండలాని ప్రార్థిస్తాను. నాభార్య నా దగ్గరకి రావాలంటే (కాపురానికి) ఏం చేయాలో చెప్పగలరు. నాకు ముగ్గురు పిల్లలు. వాళ్ల అమ్మతోనే ఉంటున్నారు.**

– **కె. శ్రీనివాస్**, మంచిర్యాల.

- ఇటువంటి సమస్య ఉన్నవాళ్లు చాలా మంది ఉన్నారు. భర్తపైన ఇష్టం ఉన్నప్పటికీ, '**అతనిచే నిరాకరింపబడి**' దూరంగా ఉండవలసి వస్తున్న భార్యలు ఎంతో మంది ఉన్నారు. అలాగే భార్య మీద ప్రేమ ఉన్నాప్పటికీ '**ఆమె వలన నిరాదరణకు గురై**' దూరంగా ఉండవలసి వస్తున్న భర్తలు ఉన్నారు. అంతేగాకుండా ఇద్దరికీ ఒకరిపైనొకరికి ప్రేమనురాగాలు దండిగా ఉన్నప్పటికీ, వేరే ఏదో ప్రత్యేక కారణం వలన (ఇద్దరూ వేరు వేరు ప్రాంతాల్లో ఉద్యోగాలు చేసుకోవటం చేత, వీసాలు దొరక్కపోవటం చేత) దూరంగా ఉండవలసి రావటం జరుగుతుంది. **వాస్తు దోషాల వలన ఇటువంటి ఎడబాట్లకు అవకాశం ఉంటుంది.**

ఇటువంటి ఎడబాటు సమస్య ఉన్నవాళ్లు వాస్తుపరంగా ఒక చిన్న పరిశీలన గావించుకోవాలి. తాము నివసిస్తున్న ఇంటికి లేదా స్వంత ఇంటిని ఈశాన్య, ఆగ్నేయ దోషాలున్నాయేమో పరిశీలించాలి. అవి ఉంటే వెంటనే సరిజేసుకోవటం వలన శ్రీఘ్రంగా మంచిఫలితాలను పొందుతారు.

### వ్యాపారం నష్టం, ఆర్థిక బాధలు

- **నా పేరు మీద జన్మ నక్షత్రం, పుట్టిన తేది తెలియదు. కావునా నా భార్య పేర్న కూపను పంపు చున్నాను. నా పేరు శ్రీనివాసరావు. మా తల్లిగారి పేరు వెంకట నర్సమ్మ. తన పేరున ఉన్న స్థలమును నేను మా తమ్ముడు ఇద్దరం పంచుకొగా నావాటాకు 38 చ||గజము వచ్చినది. అందులో ఇంటిని నిర్మించుకొన్నాను. అప్పటి నుంచి ఏమి కలిసి రావడంలేదు. ఏ వ్యాపారం పెట్టినా నష్టం ఆర్థిక బాధలు ఎక్కువ అవుతున్నాయి. దయచేసి నా సమస్యకు పరిష్కారం తెలియజేయ ప్రార్థన.**

– **శ్రీనివాసరావు**, విజయవాడ.




- వాస్తు నియమాల ప్రకారం కట్టబడిన స్థలానికి పూర్తి నైరుతి మూలన బాత్‌రూమ్/టాయ్‌లెట్స్ నిర్మాణం చేయకూడదు. మీరు అదే విధంగా నిర్మించారు. నైరుతి మూలను సద్వినియోగం చేసుకుంటే ఇంటి యజమాని ఆధిపత్యాన్ని, ఆర్థిక, ఆరోగ్య విషయాల్లో సత్ఫలితాలను సులువుగా పొందవచ్చును. మీరు నైరుతి మూలను సద్వినియోగం చేసుకొలేదు. అందుకే అనేక విధాల దుష్పరిమాణలను ఎదుర్కోవలసి వస్తుంది.

**మీ ఇంటి విషయం:** పూర్తి నైరుతి మూలన కట్టిన బాత్‌రూమ్‌ని తీసేసి ఆగ్నేయం నుంచి నైరుతి వరకు వంటగది, డైనింగ్ ఏర్పాటు చేసుకొండి. ప్రస్తుతమున్న పడక గదికి, ఇప్పుడేర్పాటు చేస్తున్న వంటగదికి మధ్యన ఒక బాత్‌రూమ్‌ను(పటంలో చూపిన విధంగా) ఏర్పాటు చేసుకోవచ్చును. ఈ చిన్నమార్పు వలన తప్పకుండా మెరుగైన ఫలితాలను పొందవచ్చును.

### వచ్చేవారం...
### 'సింహద్వారము ఏవిధంగా ఉండాలి? సింహద్వారముపై దేవుని బొమ్మలు చెక్కించ వచ్చునా?'

వాస్తు విద్వాన్, సాయిశ్రీ
**గౌ. డా. దంతూరి పండరీనాథ్**





వాస్తువిద్వాన్ **డా|| దంతూరి పండరినాథ్** పాఠకుల జాతక మరియు వాస్తు సమస్యలకు 'మహావాస్తు'లో సమాధానాలిస్తారు. ఈ కింది కూపన్ జతచేసి సమస్యలు పంపవలసినది.

పూర్తి పేరు:........................................................................
పుట్టిన తేది:............................ ఊరు:.........................................
జన్మనక్షత్రం:............................ తల్లి పేరు:...................................
చిరునామా:.........................................................................
........................................................ఫోన్:...........................

మా చిరునామా : **వాస్తుసాయి సేవా ఆశ్రమం**
**మహావాస్తు, 3-2-4, కింగ్స్‌వే, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్ - 500003.**




# వెం.ప.రాజు ధర్మసందేహం

**వయస్సు యాభై యేళ్ళుండవచ్చు.**

**తీర్చిదిద్దిన పంచెకట్టు, ముఖాన కాసింత కుంకుమబొట్టు, తరుచుగా పొందూరు ఖద్దరు పొట్టిచేతుల చొక్కా ధరించడం ఇష్టం. అరుదుగా ఉత్సవాలప్పుడు పెద్దాపురం సిల్కుచొక్కా వాడడం కూడా కద్దు.**

పూర్తి పేరు వెంకటపతిరాజు. సంక్షిప్తంగా వెం.ప. రాజుగారనడం నాటకసమాజాలవారికి అల వాటు. వెం.ప.రాజుది సంపన్న కుటుంబం. అన్న గారు సూరపరాజుగారు లౌక్యులు. వ్యవహర్త. వెం.ప.రాజులో అమాయకత్వం, నాటకాల వ్యామోహం, గోదావరిజిల్లావారి గడుసుతనం (అప్పుడప్పుడు) కళాసంబంధమైన వెటకారం, తను తలచిన విషయంలో పట్టుదల, సాధారణ లక్షణాలు. ఆ, యీ, కారణాలవల్ల, అన్నగారే వెం.ప.రాజు సంసారం చక్కదిద్దే పని చేస్తుండే వారు. కావలసినప్పుడు డబ్బుతీసుకుని, వెం.ప.రాజు కళారంగంలో నాటకసేవ చేస్తుండే వాడు. అయితే ఆయన ప్రధానవ్యావృత్తి పౌరాణిక నాటకాలు ఆడించడం. దేశంలో ప్రసిద్ధులైన నటు లందరూ ఆయనకు మిత్రులే. సాంఘికంగాని, పౌరాణికంగాని ఎక్కడైనా నాటకాల పరిషత్తులు జరుగుతున్నాయంటే చాలు, రెక్కలు కట్టుకుని వాలి, తగు పాత్ర పోషించి సహకరించేవారు.

మాఊళ్ళో తమ తండ్రిగారిపేరిట పరిషత్తు స్థాపించి నాటకాలపోటీలు ఏటా నిర్వహించడం, నెలవారీ సభ్యుల్ని చేర్చి ప్రతినెల సాంస్కృతిక (కేవలం నాటక) కార్యక్రమాలు నిర్వహించడం వల్ల వెం.ప.రాజు చాలా ప్రముఖవ్యక్తిగా మా ఊరివారికి పరిచితుడు. ఏది ఏమి కానివ్వండి, వెం.ప.రాజుకి పౌరాణిక పద్యనాటకాలంటే ప్రాణం. తెలుగుసంస్కృతి వాటిలోనే ఇమిడి ఉందని, ఆయన ప్రగాఢవిశ్వాసం. అంతటి కళారాధకుడు వెం.ప.రాజు ఒకరోజున భారత, రామాయణ ప్రవచనకారుడుగా రేడియోద్వారా విశేషకీర్తి గడించిన ఉషశ్రీగారి దగ్గరకి ఒక ధర్మ సందేహం తీర్చుకొనేందుకు వచ్చాడు. ఆయన కూడా ఒకప్పుడు మా ఊరివారే కావడం, హైస్కూలు చదువులకాలంలో వెం.ప.రాజుకి ఆయన రెండేళ్ళు సీనియర్ కావడం కూడా వారి ద్దరి చనువుకి అదనపు కారణం.



**వెం.ప.రాజు, ఉషశ్రీ మధ్య సంభాషణ ఇలా కొనసాగింది:**

"నమస్కారం ఉషశ్రీగారు"

"ఎవరూ? వెం.ప.రాజా. రా, రా ఇదేనా రావడం?"

"ఇదేనండి. రావడంకూడా తమ కోసమేఁ"

"పనికట్టుకు అంతదూరం నించా! ఏమిటి కథ"

"కతంటే కతేనండి మరి. గ్యానం కలగాలంటే ఎంత దూరవైనా యెళ్ళాల్సిందే కదండి"

"విషయం చెప్పు."

"ముందుకొంచెం చెప్పనియ్యండి. మనూళ్లో 'కల్చరు' గలోళ్లందరం, ఒక 'యూనియన్'గా ఉండే వాళ్లం గుర్తుంది గదండి..."

"మంచివాడివే, ఎందుకు గుర్తులేదు?"

"పొట్టి సుబ్బారావుగాడు గుర్తున్నాడు గదండి"

"మరే, మీరంతాకలిసి, నాటకాలు నడిపించే వాళ్లు కద! వాడేవైఁనా పొడుగు సాగాడా?"

"అదేంలేదండి. జెర్సీఆవులాగ అలాగే ఉన్నాడండి. ఆవు గడ్డితిని పాలిస్తదండి. ఈడు గడ్డి తిండం తప్ప పాలూగట్రా లేవండి, పాపాల భైరవుడు".

"అదేం? అలా అన్నావు?"

"అనక ఏం జెయ్యాలండి? ఆడీమద్దిన పోటీ 'యూనియ'నెట్టాడండి. ఆడు సెపరేటుగా 'సాంగిక' నాటకాల పోటీలంటండి. పొరదన్నేవోడులేక, పరి షత్తు లంటండి. మన్నించి ఇడిపోయాడులెండి. మనం కూడా తక్కువ సెయ్యలేదులెండి; మనవూఁ పౌరాణిక నాటకాల పోటీ యెట్టావండీమద్దిన..."

"అబ్బో...ఆ నాటకాలన్నీ చాల పెద్దవి కదా!"

"అబ్బెబ్బే... అలాక్కాదండి. కురుక్షేత్రం నాట కంలో, పడకసీను ఒక్కటేనండి. శ్రీకృష్ణుడు పడుకు నుంటే అర్జునుడు, దుర్యోధనుడు, 'హెల్పుకోసం' వస్తారుగదండీ, అదండి..."

"ఓహో! ఎన్ని టీములొచ్చాయంటావు?"

"పోటీకి కట్టిన టీములైతే పదేనుదాకా ఉన్నా రండి. పడుకుని ఆవలించే కృష్ణుడొకడండి. లెగిసి పద్యం సెప్పే దుర్యోధనుడొకడండి; కృష్ణుడి మంచం సుట్టూతా తిరుగుతూ పద్యంసెప్పే అర్జునుడొకడండి. నానాతీన్‌తారుగా ఉన్నారులెండి. అయితే 'స్క్రీనింగు' సేసి అయిదు టీముల్ని సెలెక్టు చేశావండి. గమ్మత్తు శూశారాండి! రాయపరాజుగారు కూడా తన ట్రూపు నించి పోటీకొచ్చారండి. అయ్యబాబో సెలెక్టు శేశామనుకోండి"

"రాయపరాజుగారంటే కురుక్షేత్రం నాటకంలో రాయబారం కృష్ణుడుగా పేరు కదా!"

"కదాండిమరి! వేషంతోబాటే బాగా 'మందు' కూడా వేసే అలవాటండి. కానైతే స్టేజి యెక్కా రంటే, పాటతో ఊపేసే నటుడండి – ఈసారి

ఒకటో కృష్ణుడి యేషవండి."

"పోటీకొచ్చి కూడా 'మందు' వేశాడా?"

"నేను చెప్పబోయే 'కత' అదేనండి. అది చెప్పడానికే తవం దగ్గరకొచ్చాను"

"ఓరి అసాధ్యుడా, ఏది చెప్పు"

"మిగతా'ట్రూపు' లోళ్లతో ఏం గొడవలేదండి. ఆళ్లయేషాలు ఆళ్లేసుకున్నారు. ఆళ్లపద్యాలాళ్లు పాడుకున్నారు. రాయపరాజుగారే, మేకప్పురూంలోకి రావడానికి ముందే బాగా మందేసేసి, గ్రీన్‌రూమ్‌లోకొచ్చి, పడుకుండి పోయారండి.

"కొంప ముంచేశాడా?"

"కత" అదేనండి. అసలే కాంపిటీషనండి. యెట్టింది మనవండి. టెన్షనండి. సరే, లెగదీసి కూచోబెట్టి మేకప్పు యేసేసి పూసలకోటు తొడిగేసి స్టేజీమీదికి తీసుకొచ్చి సెట్టులో మంచం మీద పడుకోబెట్టావండి. టైమైపోతోంది. కర్టెన్‌లెగదీసెయ్యాలి. కాంపిటీషనండి, టెన్షనండి.

"కాదూ మరీ!"

"సమస్య అక్కడితో ఆగలేదండి. గురువుగారు మందేశారని అర్జునుడు, దుర్యోధనుడు కూడా మందేసేశారండి. మాకు ట్రిబుల్ టెన్షనండి. కాంపిటీషనండి. ఎట్టింది మనవండి!"

"నువ్వు చెపుతోంటే నాకు టెన్షన్‌గా ఉంది."

"మా అవస్థ దేవుడికెరుకండి. అయితే రాయపరాజుగారు గొప్పజ్ఞానికదండి. ఫుట్‌లైటు తగలగానే లెగిసి కూసుంటాడని మా ధైర్యవండి. పైగా ఆడియన్సులో మొదటవొరసలో పొట్టి సుబ్బారావుగాడు కూచున్నాడండి. అసలే ఎద్దేవా శేషే మనిషండి... జనం సంగతంటారా? రాయపరాజుగారు కృష్ణుడని ఇరగబడి వొచ్చేశారండి. అసలే కాంపిటీషనండి. టెన్షనండి..."

"విషయంలోకి రా"

"ట్రబులంతా ఇప్పుడే మొదలైందండి. సెట్లో మంచంమీద పడుకున్న కృష్ణుడికి కునుకు పట్టేస్తదేమోనని మా బయవండి. కర్టెన్ లెగదీసేశావండి. ఆడియన్సు సైలెన్సు అయిపోయారండి. కత ప్రకారం ఏం జరగాలండి! తలాపుదిక్కున దుర్యోధనుడు కూసోవాలి. కాళ్ళదిక్కున అర్జునుడు కూసోవాలి కదండి? ఇప్పుడు దుర్యోధనుడు కాళ్ళదిక్కున కూసున్నాడండి. అర్జునుడు తలాపుదిక్కున కూర్చున్నాడండి. నయం ఈడి గద ఆడు, ఆడి బాణాలు యీడు. పట్టుకోలేదండి!

"ఓరి నాయనా! కొంపములిగింది కద!"

"లేదండి. జనం ఈలవేశారండి. రాయపరాజుగారు జ్ఞానికదండి, ఏదో గడబిడి అవుతోందని గ్రహించాడండి. ఈ దుర్యోధనుడు, అర్జునుడు, ఒకడి మొకాలొకరు సూసుకుంటూ సిరు నవ్వులు నవ్వుతున్నారండి. సీసామింగేసినోడికి సిరునవ్వు కాకేటి వస్తదండి?...

రాయపరాజుగారి కీర్తి నాశనమైపోయిందనే అనుకున్నావండి. కాని జ్ఞానికదండి. రాయపరాజుగారు ఎలాగమనించారో పొరపాటు గమనించారండి. శ్రీకృష్ణుడు లెగిసి చూశాడనుకోండి. కాళ్లకాడ దుర్యోధనుడు కనబడతాడు. లెక్కతప్పుద్ది. అందుకని రాయపరాజుగారేం శేశారు? పడుకున్నోడు పడుకున్నట్టే సటుక్కున అర్జునుడున్న తలాపుదిక్కుపక్కకి తిరిగి కళ్ళు తెరిశి "ఏంటిబావా? ఎప్పుడొచ్చా"వని ముందుగా అర్జునుడ్నైపేసూశాడు. అయ్యా! ఉషశ్రీగారూ ఆడియెన్సు తప్పట్లే తప్పట్లండి"

"సెబాస్"

గోల్డ్‌మెడలూ, క్యాషు అవార్డూ, రాయపరాజుగారి టీమ్‌కే ఇచ్చావండి. అయితే పొట్టి సుబ్బారావుగాడు "కత ప్రకారం సీనునడ్లేదని గడబిడ సెయ్యబొయ్యాడండి. నేనే తమబోటి పెద్దల సాంగత్యంవల్ల, నాకు తట్టిన సమర్థనశేశానండి. నేనుచేసింది తప్పో, రైటో 'ధర్మ సందేహం' తమరే తీర్సాలండి. నేను పొట్టిసుబ్బారావుగాడికి ఇలా, డోసు ఇచ్చానండి. "ఓరెదవా, దుర్యోధనుడెక్కడ కూసున్నాడు? అర్జునుడెక్కడ కూసున్నాడు? అనేది పాయింటు కానే కాదు; శ్రీకృష్ణుడు మొదటగా ఎవుడితో మాట్లాడేడు? అదీ, కతలో అసలు పాయింటు. అది తప్పలేదు కనుక, తప్పు జరక్కుండా సీను పండించాడుగనక, రాయపరాజుగారే రైటు" అని. "వెం.ప.రాజూ... నువ్వేరైటు. అసలైన పాయింటు అదే. వెళ్ళిపో" అంటూ ఉషశ్రీగారు ఆయన భుజం తట్టారు.

"తమ ఆశీస్సు. ఇక మనూళ్ళో శత్రుశేషం మిగల్నివ్వను శూశుకోండి" అని వెం.ప.రాజు ప్రతిజ్ఞ చేసి నిష్క్రమించాడు.

***

**(విశేషం: ఆల్ ఇండియా రేడియోలో నేనూ, ఉషశ్రీగారు పనిచేసిన 1980ల కాలంలో మా ఆర్టిస్ట్స్ అసోసియేషన్ రంగస్థలంమీద ప్రదర్శించే హాస్యకదంబాలలో ఒకటిగా వెం.ప.రాజుగా నేను, ఉషశ్రీగా ఉషశ్రీ ఈ సన్నివేశం ప్రదర్శించేవాళ్లం)**

నవ్య

## కఠిన పరీక్ష!

ప్రాంతాన్ని బట్టి ప్రజలు ఆచరించే ఆచారవ్యవహారాలలో చాలా తేడాలు ఉంటాయి. అందులో కొన్ని ఆచారాలు నవ్వు తెప్పించేలా ఉంటే మరికొన్ని ఆశ్చర్యకరంగానూ, ఇంకొన్ని భయంకరంగానూ ఉంటాయి. మనది ప్రజాస్వామ్య దేశం. ఇక్కడ అబ్బాయి అయినా అమ్మాయి అయినా మేజర్ అవ్వాలంటే పద్దెనిమిది సంవత్సరాల వయసు నిండి ఉండాలి. చాలా దేశాల్లో ఇలా వయసునుబట్టి అబ్బాయిలు, అమ్మాయిలను మేజర్, మైనర్‌లుగా నిర్ధారిస్తారు. కానీ ఆప్రాంతంలోని వారు మాత్రం అబ్బాయి పరిపూర్ణమైన మగాడుగా ఎదిగాడనిపించుకోవడానికి కఠినమైన పరీక్షలు ఎదుర్కోక తప్పదు. ఏంటా పరీక్ష? ఏంచేస్తారో మీరూ తెలుసుకోండి!

అది పశ్చిమ ఆఫ్రికాలోని సెనెగల్ దేశంలోని జిగ్వింకర్ ప్రాంతం. గిరిజన జాతులు నివసించే ఆప్రాంతం వారికి కొన్ని విషయాల్లో కొన్ని ఆచారాలు ఉన్నాయి. ముఖ్యంగా అబ్బాయి మగవాడు అనిపించుకోవాలంటే అబ్బాయిలకు కఠిన పరీక్ష తప్పనిసరి. ఏంటా పరీక్ష అంటే అప్పట్లో రాముడు, కైకేయి కోరిక మేరకు వనవాసం చేసినట్లే వారు కూడా నెలరోజుల పాటు అడవిలో వనవాసం చేయాలి. దీన్ని వారు బౌకౌట్ అని పిలుచుకుంటారు. అలా వనవాసం చేసి వచ్చిన తర్వాతే తమ



నివాస ప్రాంతంలోకి అబ్బాయిలను తిరిగి రానిస్తారు. చిన్ననాటి నుంచి అల్లారుముద్దుగా పెంచుకున్న అబ్బాయిల్ని వారి కుటుంబీకులే ఓ వయసు వచ్చాక అడవిలోకి పంపుతారు. అయితే కేవలం అబ్బాయిలు మాత్రమే కాకుండా వారితోపాటు వారి తండ్రులు కూడా నెలరోజుల వనవాసానికి వెళ్తారు. తండ్రి తోడుంటాడుగా ఇంకా కఠిన పరీక్ష అంటారేంటి అనుకుంటున్నారా? అక్కడే ఉంది ట్విస్ట్. అబ్బాయిని అడవిలోకి పంపేముందు వారు కొన్ని ఆచారాలను పాటించాలి. ఇలా అబ్బాయిలను అడవిలోకి పంపడాన్ని జిగ్వింకర్‌లో ఒక్కొక్క గ్రామం ఒక్కో ఏడాది నిర్వహిస్తుంది. అడవిలోకి అబ్బాయిలను పంపే ముందు వారిని సంప్రదాయబద్ధంగా అలంకరిస్తారు. తర్వాత కొందరు గ్రామస్థులు తమ శారీరక దృఢత్వాన్ని, మనోశక్తిని నిరూపించుకునేందుకు కత్తులతో శరీర భాగాలను కోసుకుంటారు. అయితే, ఇలా కత్తులతో శరీరాన్ని గాయపరుచుకునే సమయంలో వారి ఒంటిపై ఆభరణాలు అలానే ఉంటాయి. అవి వారికి రక్షణ కవచంలా పనిచేస్తాయని నమ్మకం. గ్రామస్థుల ప్రదర్శన అనంతరం అడవిలోకి పంపే అబ్బాయిలందరికీ గుండు చేయిస్తారు. అది మొదలు వారు తిరిగొచ్చేవరకూ స్త్రీల మొహం చూడటం, తాకడం లాంటివి చేయకూడదు. అబ్బాయిలు వెళ్లినతర్వాత ఇంటి వద్ద ఉండే ఆడవాళ్లందరూ ఒకేచోట నివసించడం ప్రారంభిస్తారు. నెల రోజుల పాటు అడవిలో ఉండటంవల్ల అబ్బాయిలు శక్తిమంతులు అవుతారని వారి నమ్మకం. అయితే, కొందరు అటవీ పరిస్థితులు తట్టుకోలేక మరణిస్తారు కూడా. అడవి నుంచి తిరిగివచ్చిన వారిని ఓ గుడిసెలో ఉంచి మహిళలు ఒక్కొక్కరుగా వచ్చి చూస్తారు. ఆ తర్వాతే వారిని గ్రామంలోకి రానిస్తారు. జిగ్వింకర్ ఆచారాలకు ఆకర్షితురాలైన ఫొటోగ్రాఫర్ డయానా బగ్నోలి వారి సంప్రదాయాలను తన కెమెరాలో బంధించి ఓ డాక్యుమెంటరీగా మార్చారు.

నవ్య




**కదురు గొట్టపు పరికరానికి తగిలించి ఉన్న సిగరెట్ పొగను సుతారంగా పీలుస్తూ, చాలా నెమ్మదిగా తల ఊపాడు హుహుశాన్.**

**గుండెల మీద ఉన్న బరువు ఏదో కిందికి దిగిపోయిన అనుభూతి కలిగింది మిచిషీకి. 'హుహుశాన్ సారు అనుమతి ఇస్తే నేను నా స్టేషన్‌కి పోయి, ఇకముందు జరుగవలసినది ఏమిటో నా పై అధికారులతో చర్చించి వారు చెప్పినట్టు ముందుకు పోతాను' నెమ్మదిగా అన్నది ఆమె.**

సమాధానం ఇవ్వలేదు హుహుశాన్. ఆమె ముఖం మీది నుంచి చూపుల్ని పక్కకు తిప్పలేదు.

కిందికి దిగిపోయిందని అనుకున్న బరువు తిరిగి తన గుండెలమీదికి ఎక్కినట్టు అనిపించింది మిచిషీకి.

'పోనీ... ఏం చేయమంటారో మీరే ఆజ్ఞ ఇవ్వండి...' అని అభ్యర్థించింది ఆలస్యం చేయకుండా.

'ఇంటికి వెళ్ళు. నీ వెంట నా మనుష్యులు కొంత మంది వస్తారు' ముక్తసరిగా అన్నాడు హుహుశాన్.

చెమటలు పట్టేశాయి మిచిషీకి. ఎంతో ప్రయత్నం మీద తన కలవరపాటు అతనికి కనిపించకుండా జాగ్రత్తలు తీసుకుంది.

'నడివీధిలో నలుగురూ చూస్తుండగా నా మనుష్యుల్ని చితక్కొట్టి తప్పించుకున్న ఆ దుర్మార్గులు సామాన్యులుగా కనిపించటం లేదు. కుంగ్‌ఫూ విద్యాపీఠానికి కాబోయే అధిపతినని చెప్పుకుంటున్న ఫ్యుజీశాన్‌కీ కనిపించని నేర్పరులు వాళ్ళు. నగరం విడిచి దూరంగా పారిపోతారని నేను అనుకోవడం లేదు' ఖచ్చితమైన కంఠంతో చెప్పాడు హుహుశాన్.

చెప్పటంతో ఆగలేదు. నోటిలో పెట్టుకుంటున్న సిగరెట్ ఊచని యాష్‌ట్రే మీదికి విసిరి చేయి ఊపాడు.

ఒకరి తరువాత ఒకరుగా ఆ ప్రదేశంలోకి వచ్చారు అతని అనుచరులు అనేకమంది. 'వెళ్ళండి... మిచిషీ మేడమ్ ఇంటి దగ్గర కాపలా నిలబడండి' ముక్తసరిగా ఆర్డర్ ఇచ్చాడు అతను.

తన ఆలోచన దారుణంగా దెబ్బతిని పోయిందని ఒకళ్ళు చెప్పవలసిన అవసరం లేకుండానే తెలిసి పోయింది మిచిషీకి.

తనతోపాటు వస్తారు వాళ్ళు. రాతి విగ్రహాల మాదిరి ఇంటి చుట్టూ నిలబడతారు. ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా, ఏదో ఒక సమయంలో ఏడ్వటమో, ఏదో ఒక శబ్దం చేయటమో చేసి తీరుతుంది తమ దగ్గర ఉన్న పాపాయి.

వెంటనే వచ్చేస్తుంది వారికి అనుమానం. పదే పది సెకన్లలో బట్టబయలు అయిపోతుంది తమ గుట్టు.

### జరిగిన కథ

*జపాన్ వెళ్ళి, కుంగ్‌ఫూ విద్యాపీఠంలో చేరిన షాడో, ఫ్యుజీశాన్‌కు శత్రువుగా మారతాడు. అక్కడినుంచి తన స్నేహితుడు గంగారాంతో కలిసి కాంటన్ సిటీ చేరి, హుహుశాన్ మనుషులతో గొడవపడతాడు. తనను రక్షించిన షాడోని తన ఇంటికి తీసుకువెళుతుంది ఇన్‌స్పెక్టర్ మిచిషీ. పోలీస్ లాకప్‌లో ఉన్న షాన్‌సూ ద్వారా కునీ ద్వీపం గురించి తెలుస్తుంది షాడోకి. బురద నేలలకు ఆవలిపక్కన ఉన్న సెటిల్మెంట్ చేరుకుని, షాడో, గంగారాంల కోసం అక్కడే తిష్టవేస్తాడు ఫ్యుజీశాన్.*

*ఆ తర్వాత...*




'వెళ్ళు మిచిషీ... వెళ్ళి విశ్రాంతి తీసుకో' ఖంగుమంటున్న కంఠంతో హుహుశాన్ చెప్పడంతో, అర్థం టుగా అదుముకున్నది ఆమె తన ఆలోచనల్ని. వినయంగా ముందుకు వంగి, వెనుతిరిగింది అక్కడి నుంచి బయటికి వెళ్ళిపోవటానికి.

అదే సమయంలో ఆ ప్రదేశానికి అవతలగా ఉన్న గదుల దగ్గర చెలరేగింది ఒక గందరగోళం.

'ఏమిటది? ఏమిటా గలాటా?' నొసలు ముడి వేస్తూ కోరగా తన ప్రధాన సహాయకుడిని అడిగాడు హుహుశాన్.

పరుగులాంటి నడకతో ఆ ప్రదేశపు ఎంట్రన్స్

దగ్గరికి బయలుదేరాడు అతను. ద్వారం దగ్గరికి పోక ముందే గభాలున తెరుచుకున్నాయి మూసి ఉన్న తలుపులు. బరువుగా ఊపిరి పీలుస్తూ లోపలికి వచ్చాడు ఒక సేవకుడు.

'చిలుకలు సారూ..... ఎక్కడినించి వచ్చాయో గాని, రెండు చిలుకలు భవనంలోకి వచ్చాయి. పట్టుకోవటానికి ప్రయత్నిస్తుంటే జలగల మాదిరి జారిపోతున్నాయి' అంటూ రిపోర్ట్ చేశాడు.

'కాల్చేయండి. కాల్చి అవతల పారేయండి' నుదురు చిట్లిస్తూ ఆ మాటల్ని విన్న హుహుశాన్ వెంటనే చెప్పాడు.

ఝల్లుమన్నాయి మిచిషీ గుండెలు.

తన తాత పంపించిన చిలకలే అయివుంటాయి అవి? అక్కడికి ఎలా రాగలిగాయి?



ఆమె సందేహాలకు సమాధానం లభించలేదు. ప్రధాన సహాయకుడు అందించిన రివాల్వర్ తీసుకుని తిరిగి బయటికి పరిగెత్తాడు లోపలికి వచ్చిన సేవకుడు.

'వద్దు... వద్దు... వాటిని చంపవద్దు' అని బిగ్గరగా అరవాలన్న కోరిక కలిగింది మిచిషీకి. అరిచిన మరుక్షణం తన పరిస్థితి మరింత ట్రబుల్‌సమ్‌గా మారిపోతుందన్న భయంతో ఆ కోరికను బలవంతంగా అదుముకున్నది.

ఆ ప్రదేశంలో నుంచి అవతలికి పోయిన వెంటనే తనకు ఇవ్వబడిన రివాల్వర్‌ని ఉపయోగించి నట్టున్నాడు హుహుశాన్ సేవకుడు. చెవులు చిల్లులు పడే శబ్దం వినవచ్చింది.

ఒక్కగంతులో బయటికిపోయి అదేమిటో చూడాలని కూడా అనిపించింది మిచిషీకి.



క్రింద ఉన్న చలువరాయి ఫ్లోరింగ్‌కి అతుక్కుపోయినట్టున్న తన పాదాలను అతి ప్రయత్నం మీద కదిలించి, రెండే రెండు అడుగులు వేసింది ఆమె. మూడో అడుగు వేయకముందే రెక్కల్ని తపతపమని కొడుతూ దూసుకువచ్చాయి చిలుకలు.

'మిచిషీ.... ఓయ్ మిచిషీ...' ఆమెను చూసి ఆనందంగా పలుకరిస్తూ కుడి భుజం మీద వాలింది ఒకటి.

'అమ్మ... చెప్పింది... ఆపద... ఆపద..' ఎడమ భుజం మీద వాలుతూ అన్నది రెండవది.

'ఎవరికీ? ఆపద ఎవరికి?' తన ఆందోళన రెట్టింపు అయిపోతూ ఉండగా అడిగింది మిచిషీ.

'హుహుశాన్ సారుకి....' చెప్పింది మొదటిది.

'బాంబు... భవనంలో బాంబులు' అన్నది రెండవది.

తన చెవులు తనను ఏమారుస్తున్నాయేమో నన్న అనుమానం వెంటనే కలిగింది మిచిషీకి.

'బాంబు... భవనంలో బాంబు.. ఆపద... హుహుశాన్ సారుకి ఆపద' ఈసారి రెండూ కలిసి అంతకు ముందుకంటే బిగ్గరగా చెప్పాయి.

దగ్గర్లోనే ఉన్న ప్రధాన సహాయకుడి ముఖం రక్తం లేకుండా పోయినట్టు తెల్లగా మారిపోవటం మిచిషీకి కనిపించింది.

అతని కంటే చాలా ముందుగా రియాక్ట్ అయ్యాడు హుహుశాన్. ఛెంగున లేచాడు తను కూర్చున్న చోటునుంచి. 'ఖాళీ చేయండి... భవనాన్ని ఖాళీచేసి, ఒక్క అంగుళాన్ని కూడా వదిలిపెట్టకుండా గాలించండి' కీచుగా మారిపోయిన కంఠంతో ఆర్డర్ ఇచ్చి, ఆ ప్రదేశానికి అవతలగా ఉన్న ఇంకో గదిలోకి పరిగెత్తుకుంటూ పోయాడు.



అంతకుముందు ఒక్కక్షణం వరకూ ఎంతో గంభీరమైన నిశ్శబ్దంతో నిండి ఉన్న ఆ భవనం ఒక్కసారిగా తీవ్రమైన గందరగోళంలో చిక్కుబడిపోయింది.

గొంతులు చినిగిపోయేటట్టు కేకలుపెడుతూ అటూ ఇటూ పరుగులు మొదలుపెట్టారు పనివాళ్ళు అందరూ.

తన భుజాలమీద ఉన్న చిలుకల్ని గట్టిగా పట్టుకుని తను కూడా వారితో కలిసి బయటికి పరిగెత్తుకు వచ్చింది మిచిషీ.

అప్పుడే ఆమెకు కనిపించాడు హుహుశాన్. అవతలి గదిలో ఉన్న ఒక రహస్యద్వారం ద్వారా బిల్డింగ్ బయటికి చేరుకున్నాడు అతను. అత్యంత ఖరీదయిన ఒక వెహికల్‌లో మెయిన్‌రోడ్డు మీదికి దూసుకు పోతున్నాడు.

బాంబు అన్నమాట చెవులపడిన మూడో నిమిషంలో, బిల్డింగ్ మొత్తం ఖాళీ అయిపోయింది. అటువంటి ఎమర్జెన్సీలను సమర్థవంతంగా ఎదుర్కోవటానికి అవసరమైన శిక్షణ ఇవ్వబడిన అనుచరులు కొందరు, అందుకు అవసరమైన పరికరాలను పట్టుకుని బిల్డింగ్ చుట్టూ ప్రదక్షిణలు చేయడం మొదలు పెట్టారు.

'ఇంటికి పోదాం మిచిషీ.' అన్నది మొదటి చిలుక.

'వెంటనే వెళ్ళిపోదాం' చెప్పింది రెండవది.

ఆ రెండింటినీ చూసిన తర్వాత తన మనస్సులోకి ఎంతైన సందేహాలన్నిటికీ సమాధానం అప్పుడు లభించినట్లు ఫీల్ అయింది మిచిషీ.

పొరపాటుగా రాలేదు అవి...

ఏం మాట్లాడాలో, ఎలా మాట్లాడాలో, ఎప్పుడు మాట్లాడాలో సవివరంగా చెప్పి పంపించబడ్డాయి. తన తాతకు మాత్రమే ఉన్నది ఆ నేర్పు. తన తల్లికి గాని, తనకు గాని లేదు.

జ్యుయలరీ షాపు దగ్గర తమను చుట్టుముట్టిన హుహుశాన్ అనుచరుల్ని ఎడాపెడా మర్దించిన పరదేశీ, అతని జతగాడు వెంటనే ప్రత్యక్షం అయ్యారు ఆమె కనులముందు.

యస్... వారి పనే అయి ఉంటుంది ఇది. హుహుశాన్ దగ్గర తను ఏదైనా ఇబ్బందిని ఎదుర్కొంటూ ఉండి ఉండవచ్చని ఊహించి, డైవర్షన్

క్రియేట్ చేశారు.

ఆ మాట మనసులో మెదిలిన మరుక్షణం, మరింత వేగంగా కదిలింది ఆమె. భవనానికి కొంచెం అవతలగా పార్క్‌చేసిన తన వెహికల్ స్టార్ట్ చేసి, తన ఇంటివైపు పరుగులు తీయించింది.

***

'మీ తాతగారి గురించి హుహుశాన్‌కి తెలుసునా?' కారు దిగి లోపలికి వచ్చిన వెంటనే ఆమెను అడిగాడు పొట్టిమనిషి.

పెదవి విరిచింది మిచిషీ. కాంటన్ ఏరియా ఒక్కటేకాదు. ఆ చుట్టుపట్ల ఉండే చాలా నగరాలు హుహుశాన్ పిడికిట్లో చిక్కుకుని గిలగిలా కొట్టుకుంటూ ఉంటాయి.

'కుంగ్‌ఫూ విద్యాపీఠం గురించి తెలిసిన మనిషికి, తనను తరుముకుంటూ వచ్చే శత్రువుల నుంచి తప్పించుకునే విధానాలు కూడా తెలిసే ఉంటాయి...' ముక్తసరిగా అన్నాడు పొట్టిమనిషి జతగాడు.

'ఇప్పుడు ఈ మాటలు మాట్లాడుకోవాల్సిన అవసరం ఏమొచ్చింది?' ఒక కుర్చీలో కూలబడి, తన తల్లి తీసుకువచ్చిన టీ కప్పును అందుకుంటూ అడిగిండి మిచిషీ.

'బాంబు కలకలం సద్దుమణిగిన వెంటనే హుహుశాన్ మళ్ళీ నీ గురించి ఆలోచన మొదలు పెడతాడు. ఈసారి ఖచ్చితంగా దెబ్బకొట్టి తీరతాడు. కొద్దికాలం పాటు దూరంగా పోయి తలదాచుకోవటం చాలా బాగుంటుంది' అన్నాడు పొట్టిమనిషి.

'తలదాచుకోవాల్సిన అవసరం నాకేముంది? నేను చేసిన తప్పు ఏమిటి?' ఆశ్చర్యంగా అడిగింది మిచిషీ.

'మాకు ఆశ్రయం ఇవ్వటం, షాన్‌సూ భార్యాబిడ్డను నీ దగ్గర పెట్టుకోవటం' అన్నాడు ఆ యువకుడు.

'కష్టంలో ఉన్నవారిని ఆదుకోవటం బాధ్యతగల ఒక పోలీస్ అధికారిగా నా కర్తవ్యం. హుహుశాన్‌కి కావాల్సింది షాన్‌సూ ఒక్కడే... అతని భార్యాబిడ్డలు కాదు' నిబ్బరంగా చెప్పింది మిచిషీ.

'షాన్‌సూ ఒక్కడే వాడికి కావాల్సిన మనిషి అయితే, మరి తన తోడేళ్ళను షాన్‌సూ ఇంటి మీదికి పంపి, గలాటా ఎందుకు చేస్తున్నాడు?' అడిగాడు యువకుడు.

సమాధానం లేదు మిచిషీ దగ్గర. కాని పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో చాలా అధికారాలున్న తను, చేత కాని పిరికి మనిషిలా దూరంగా పారిపోవటం మాత్రం నచ్చలేదు ఆమెకు.

'నా పై అధికారులకు జరిగినదంతా చెపుతాను' అన్నది వెంటనే.

'బాగా చెప్పు.. అర్థం అయ్యేటట్టు విశదంగా వివరించు. వాళ్ళు వెంటనే హుహుశాన్‌కి ఫోన్‌చేసి పిలిపిస్తారు. అప్పుడు అతనికి కూడా అవే మాటలు చెప్పవచ్చు' వెక్కిరింపుగా అన్నాడు పొట్టిమనిషి.

అతని మాటల్లోని యదార్థాన్ని గ్రహించి విసురుగా తల విదిలించింది మిచిషీ.

'నా మానాన నేను నిజాయితీగా నా ఉద్యోగం ఏదో నేను చేసుకుంటున్న సమయంలో – నాకు సంబంధం లేని ఈ ఉచ్చులో ఎందుకు చిక్కుబడ్డానో తెలియటం లేదు...' తనలో తను అనుకుంటున్నట్టు పైకే అన్నది.

'జీవితం అనేది ఒక చిత్రమైన అడవి దారి. ఎటుపోతుందో, ఎన్ని మలుపులు తిరుగుతుందో, ఎందుకు అలా జరుగుతుందో ఎవరికీ తెలియదు...' అవతలి గది గుమ్మం దగ్గర నిలబడి చిన్నగా చెప్పింది. షాన్‌సూ భార్యకోసం ఎక్కడినుంచో పడుతూ లేస్తూ వచ్చి, ఆ గొడవల్లో చిక్కుపడిన వృద్ధురాలు.

'నువ్వు ఆలోచిస్తూ కూర్చుంటే పుణ్యకాలం గడిచిపోతుంది. హుహుశాన్ ఎలర్ట్ అయితే తోడేళ్ళ మాదిరి వచ్చేస్తారు అతని చంచాలు' ఉన్నట్టుండి హెచ్చరించాడు పొట్టిమనిషి.

చటుక్కున కుర్చీలో నుంచి లేచింది మిచిషీ. చేతుల్లో ఉన్న టీ కప్పును క్రిందపెట్టి, టెలిఫోన్‌ని అందుకుంది.

'హల్లో మేడమ్..' రింగ్ ఇచ్చిన వెంటనే ఆ కాల్ ఎక్కడి నుంచి వస్తున్నదో తెలుసుకున్నది కాబోలు – తడుముకోకుండా మాట్లాడింది టెలిఫోన్ ఆపరేటర్.

'బురదనేలలో జరిగిన సంఘటన నా హెల్త్ మీద పెద్ద దెబ్బ తీసింది. నేను ఒక నెలరోజులు సెలవు పెట్టాలని అనుకుంటున్నాను. నా స్టేషన్‌కి కబురు పంపించండి. కెన్ యూ డూ ఇట్?' అడిగింది మిచిషీ.

'ష్యూర్ మేడమ్... తప్పకుండా! మీరు మీ




**కనులు మూసుకుని ధ్యానంలో ఉన్నాడతను. ఉన్నట్టుండి అతడి చెవులకు చేరిందో ఆర్తనాదం. చటుక్కున కనులు తెరిచి, తను కూర్చుని ఉన్న వేదిక మీద నుంచి లేచాడు. చుట్టూ చూశాడు. విద్యాపీఠపు మహాద్వారం దగ్గర అతడి చూపులు నిలిచిపోయాయి. గ్రామీణులు కొంతమంది గుమికూడి ఉన్నారక్కడ. వాళ్ళను చూసి లోపలికి రమ్మని సైగ చేశాడతను. ఇంతకీ ఎవరతను? అసలేం జరిగింది?**

హెల్త్‌ని జాగ్రత్తగా చూసుకోండి. మంచి మందులు తీసుకోండి' చెప్పింది ఆపరేటర్.

రిసీవర్‌ని ఫోన్ మీద పడేసి తన తల్లివైపు చూసింది మిచిషీ.

'ఈ పరిస్థితి వస్తుందని నాకు ముందుగానే చెప్పారు వాళ్ళు. అన్నీ సర్దేశాను. బయలుదేరటం ఒక్కటే ఆలస్యం' నవ్వుతూ చెప్పింది తల్లి.

తన డ్రెస్ కూడా మార్చుకోకుండా బయటికి దారితీసింది మిచిషీ. ఆమె వెనుకే బయటికి వచ్చి ఆమె కారులో కూర్చున్నారు షాన్‌సూ భార్య, వృద్ధురాలు, వాళ్ళ పాపాయితోసహా.

'ఎక్కడా ఆగవద్దు. ఎవరితోను మాట్లాడవద్దు' జ్యుయలరీ షాపులో సంపాదించిన డబ్బు మూటని, ఆమె తల్లికి అందిస్తూ చెప్పాడు పొట్టిమనిషి.

అయిష్టంగానే కారును కదిలించి సిటీ లిమిట్స్ వైపు పరిగెత్తించింది మిచిషీ. అరగంట తరువాత మెయిన్‌రోడ్డును వదిలి, ఒక అడవి దారిని వెతికి పట్టుకుని, అటుగా ప్రయాణం సాగించింది.

***

'మనం చేసిన పని ఏమంత మంచిగా ఉన్నట్టు నాకు అనిపించడం లేదు గురూ' మిచిషీ ఇంటి వెనుక ఉన్న ఒక అబుటో వృక్షం క్రింద కూర్చుని, తన తొడల మీద తలపెట్టుకు పడుకున్న షాడోకి చెప్పాడు గంగారాం.

'షాన్‌సూ భార్యని, పాపాయిని ఇంకేదైనా ప్రదేశానికి తీసుకుపోయి వేరే ఏర్పాట్లు చేసి ఉండాల్సింది... ఈ అమ్మడితో కనెక్షన్ పెట్టుకోవటం చాలా పెద్ద తప్పు' తన జతగాడి దగ్గరినించి సమాధానం కోసం ఎదురు చూడకుండా మళ్ళీ తనే అన్నాడు.

'జరిగిపోయిన దాన్ని సరిచేసే శక్తి నీకు ఉంటే నాకు చెప్పు. మళ్ళీ వెనక్కిపోయి ఫ్రెష్‌గా మొదలు పెడదాం' కనులు తెరవకుండానే అన్నాడు షాడో.

ఏదో చెప్పటానికి నోరు తెరిచాడు గంగారాం. శబ్దం బయటికి రాకముందే టక్కున మూసుకున్నాడు.

అతను అలా రియాక్ట్ అవటాన్ని తను కనులతో చూడకపోయినా, అతని శరీరంలో ప్రారంభం అయిన వైబ్రేషన్స్ తనకు తెలియటంతో చటుక్కున లేచి కూర్చున్నాడు షాడో.

'హుహుశాన్ జనం ఎవరైనా వస్తున్నారా?' తన బూటు పక్కనే ఉన్న డాగర్ మీద చేయివేస్తూ అడిగాడు.

## తమిళం నేర్చుకుంటోందట!

*తెలుగులో కొద్దిగా అవకాశాలు తగ్గిన హీరోయిన్లందరూ ఇప్పుడు కోలీవుడ్ బాట పడుతున్నారు. తమిళ తంబీలను ప్రసన్నం చేసుకోవడానికి బాగానే కష్టపడుతున్నారు. వీరి బాటలోనే నడుస్తోంది రాశీఖన్నా. రాశీ కెరీర్‌లో పెద్దగా ఫ్లాపులు లేకపోయినా సక్సెస్‌ఫుల్ హీరోయిన్ అని మాత్రం అనిపించుకోలేకపోయింది. తెలుగులో ఒకటి రెండు సినిమాలు తప్ప పెద్దగా చేయడం లేదు. దాంతో తన దృష్టిని కోలీవుడ్ వైపు పెట్టింది. ఓ త్రిష, ఓ నయన తారలాగా పేరు తెచ్చుకోవాలనీ, తమిళ తంబీల మనసు గెలుచుకోవాలని తెగ తహతహలాడిపోతోంది. ఇందులో భాగంగా తమిళం నేర్చుకుంటోందట! త్వరలోనే తను నటించే తమిళ సినిమాకి తానే డబ్బింగ్ చెప్పుకునే ఆలోచనలో ఉందట!*



'హుహుశాన్ కాదు, ఎవరో కొత్తముఖం... బురద వాసన..' ముక్కును రుద్దుకుంటూ అన్నాడు గంగారాం. చెట్టు కింది నించి లేచి, ఇంటి పక్క భాగంలోకి పోయాడు.

అతని ఎస్సెన్‌మెంట్ సెంట్‌పర్సంట్ కరెక్టని వెంటనే తేలిపోయింది. తను ధరించి ఉన్న యూనిఫాం మొత్తం బురదతో నిండి, దారుణమైన దుర్వాసనను వెలువరిస్తూనే ఉన్నా, లెక్కచెయ్యకుండా ఆ ఇంటి ముందుకు వచ్చాడు వయస్సు చాలా ఎక్కువగా ఉన్నట్టు కనిపిస్తున్న కానిస్టేబుల్ ఒకతను.

'మేడమ్... ఓయ్ మేడమ్' ముఖద్వారం దగ్గర నిలబడి కాలింగ్ బెల్‌ని ప్రెస్ చేస్తూ బిగ్గరగా పిలిచాడు.

మాట్లాడకుండా నిలబడితే, అతను అరిచి అరిచి ఆఖరికి తనంతట తనే వెనక్కి వెళ్ళిపోతాడని తెలుసు గంగారాంకి. అయితే వట్టిగా వెళ్ళడు... తమ మేడమ్ ఇంట్లో లేని విషయాన్ని అందరికీ చెప్పుకుంటూ పోతాడు. ఆ సంగతి అతని నోటిని దాటి ఇంకెవరి చెవులకైనా చేరిన మరుక్షణం... తెలిసిపోతుంది హుహుశాన్‌కి. అప్పటికప్పుడు వెతుకులాటను మొదలు పెట్టిస్తాడు. అది జరగకూడదు.

'ఎవరూ? ఎవరూ కాలింగ్ బెల్ మోగిస్తున్నది?' ఇంటి వెనుకభాగంలో తెరచి ఉంచిన తలుపుల్లో నుంచి ముందుగదిలోకి పోయి, ముఖద్వారాన్ని తెరిచి చూస్తూ అడిగాడు గంగారాం, ఆరు సెకన్ల తర్వాత.

'నేను మేడమ్ గారి స్టేషన్‌లో కానిస్టేబుల్‌ని. మేడమ్ గారి కోసం వచ్చాను' అటెంక్షన్‌లో నిలబడుతూ చెప్పాడు అతను.

'బురదనేలలో దారితప్పి చాలా పెద్ద ప్రమాదం నుంచి తప్పించుకుంది మేడమ్. కారు ఊబిలో మునిగి కనిపించకుండా పోయింది' ద్వారబంధాన్ని ఆనుకుని విశ్రాంతిగా నిలబడుతూ చెప్పాడు గంగారాం.

'ప్రమాదం నుంచి బయటపడవేసినందుకు కృతజ్ఞతాసూచకంగా తమ కులదేవరకు పూజలు చేయించటానికి వెళ్ళారు. పనిలోపనిగా మంచి డాక్టరుగారిని కూడా కలుసుకుని, తనకు తగిలిన దెబ్బలకు వైద్యం చేయించుకు వస్తారు. ఆలస్యం అవుతుంది' అని కూడా అన్నాడు.

పది క్షణాలు ఆలోచించి తన దుస్తుల్లో నుంచి ఒక మురికిగుడ్డలో మూటకట్టిన ఎముకల నాణేల్ని అతనికి అందించాడు ఆ కానిస్టేబుల్. బురదనేలకు ఆవలి పక్కన ఉన్న సెటిల్మెంట్‌లో తను చూసిన మనిషి గురించి, అతన్ని గురించి కుంగ్‌ఫూ వస్తాదు మాట్లాడిన మాటల్ని గురించి వివరంగా చెప్పాడు.

'ఎముకలతో చేయబడినందువల్ల ఈ నాణేల్ని మా వాళ్ళు ఎవరూ తమ దగ్గర ఉంచుకోవటానికి అంగీకరించటం లేదు.. ఈ మాటను మేడమ్‌కి చెప్పండి. ఏంచేస్తే బాగుంటుందో ఆమెగారికే వదిలేస్తున్నాము' అన్నాడు.

'ఆ కుంగ్‌ఫూ వస్తాదు ఎక్కడ ఉన్నాడు ఇప్పుడు?' అతను అందించిన మూటను అసహ్యించుకోకుండా అందుకుని, మర్యాదగా అడిగాడు గంగారాం.

'అక్కడే తిష్టవేశాడు. అందరినీ తికమకపెడుతున్న ఆ అనామకులు తప్పకుండా ఆ సెటిల్మెంటు దగ్గరికి వస్తారని ఎదురు చూస్తున్నాడు' అంటూ నవ్వాడు ఆ కానిస్టేబుల్.

'ఎందుకు నవ్వటం?' ఆశ్చర్యంగా అడిగాడు గంగారాం.

'బురద నేలలో ఎప్పుడో ఏనాడో చనిపోయిన సైనికుల అస్థిపంజరాలు కనిపిస్తూ ఉంటాయట. వాటి దగ్గర అమోఘమైన సంపద కూడా ఉండి ఉంటుందట. ఆ సంపద కోసం తాను వెతికే అనామకులు తప్పకుండా వస్తారని ఆ పెద్దమనిషి అభిప్రాయం' అన్నాడు కానిస్టేబుల్.

'నీ అభిప్రాయం ఏమిటి?' అనవసరమని అనిపిస్తున్నా అడగకుండా ఉండలేక పోయాడు గంగారాం.

ఒక్కక్షణం కూడా ఆలోచించలేదు కానిస్టేబుల్. 'కుంగ్‌ఫూ వస్తాదు గుడిని మింగేరకం. అతనికి కావాల్సిన వాళ్ళు గుడితోపాటు గుడిలోని విగ్రహాన్ని కూడా గుటుక్కుమనిపించే రకం. ఇంకో వంద సంవత్సరాలు అక్కడే పీఠం వేసుక్కూర్చున్నా, ఆయనకి వాళ్ళు కనిపించరు గాక కనిపించరు' అన్నాడు.

'మరి మీ పోలీసులకి?' వద్దని అనుకుంటూనే మరో ప్రశ్న వేశాడు గంగారాం.

'తిరిగి వచ్చేశాం. బురదలో పడి పొర్లిగింతలు పెట్టటం అనవసరమని నిర్ణయించుకుని అందరమూ తిరిగి వచ్చేశాం. అలుపు తీరిన తర్వాత మేడమ్ దగ్గరికి వచ్చి రిపోర్ట్ చేస్తారు మా అధికారులు' అన్నాడు అతను.

బురద నేలలో నడిచిన అలుపు ఆయాసాలు తీరటానికి ఎలా లేదన్నా పది పన్నెండు గంటలు పడుతుందని గంగారాంకి తెలుసు. మిచిషీ తన ఇంటిని వదిలి అవతలికి వెళ్ళిపోయిన సంగతి వారికి అప్పటిదాకా తెలియదు. అందరికంటే ముందుగా ఒక్క హుహుశాన్‌కే తెలుస్తుంది. ఎందుకంటే ఏ క్షణంలోనైనా వచ్చి పడిపోతారు అతని చంచాలు.

'నువ్వు చెప్పినవన్నీ మేడమ్‌కి చెప్పి అప్‌డేట్ చేస్తాను. మీ అధికారులు వచ్చి మాట్లాడే సమయానికి ఆమె సిద్ధంగా ఉంటుంది సరైన సమాధానాలతో' అన్నాడు.

తలవంచి నమస్కరించాడు ఆ కానిస్టేబుల్. స్టిఫ్‌గా శాల్యూట్ కూడా చేసి వెనక్కి వెళ్ళిపోయాడు.

అంతకుముందు గంగారాం తొడమీద తల పెట్టుకు పడుకున్న షాడో, ఇప్పుడు ఒక లావుపాటి ఇటుక రాయిని వెతికి దానిమీద తల పెట్టుకుని ఉన్నాడు.

కానిస్టేబుల్ తనకు ఇచ్చిన మూటను అతని దగ్గర పెట్టాడు గంగారాం. దానికి అంటుకొని ఉన్న బురదను చూసి, అసహ్యంగా నొసలు విరుస్తూ, ముడివిప్పి అదిరిపడినట్టు వెనక్కి జరిగాడు షాడో.

తనకు కనిపించని ప్రమాదకరమైనది ఏదో ఆ మూటలో ఉండటం వల్లనే అతను కంగారు పడుతున్నట్టు భావించాడు గంగారాం. చటుక్కున పక్కకు వంగి, అప్పటివరకూ షాడో తన తలకింద పెట్టుకున్న ఇటుక రాయిని చేతుల్లోకి తీసుకున్నాడు.

'తప్పుకో గురూ... పక్కకి తప్పుకో' అని హెచ్చరిస్తూ, రాయిని ఆ మూటలోని నాణేల మీదికి విసర బోయాడు.

'తప్పు గంగూ... చాలా తప్పు... ఆగిపో' అంటూ అతనికి చేయి అడ్డం పెట్టి ఆపేశాడు షాడో.

పైకి ఎత్తిన రాయిని అలాగే పట్టుకుని అతని కేసి ఆశ్చర్యంగా చూశాడు గంగారాం.

'ఇవి దూడూ సామ్రాజ్యానికి చెందిన నాణేలు' చేతిని చాచి మూటలో నుంచి ఒక నాణేన్ని బయటికి తీసి పట్టుకుంటూ అన్నాడు షాడో.

'ఎముకలతో చేసినవి గురూ... ఎందుకు పనికి వస్తాయ్?' చేతుల్లోని రాయిని కిందపడేస్తూ అన్నాడు గంగారాం.

'ఇది చాలా విలువ కలిగిన నాణెం. ఆ రోజుల్లో దీనికి పాతిక గుర్రాలను ఖరీదు చేసే విలువ ఉండేది. ఈ నాణేలన్నీ కలిపితే ఒక కుటుంబం ఏడు సంవత్సరాలపాటు ఎటువంటి పనీ చేయకుండా హాయిగా బ్రతకవచ్చు' మూటలోని నాణేలన్నిటినీ కలియచూస్తూ చెప్పాడు షాడో.

'ఎప్పుడో ఏనాడో ఉపయోగంలో ఉన్నటువంటివి ఇవి. ఇప్పుడు ఉన్నట్లుండి బయటికి ఎందుకు వచ్చాయి? వాటిని తీసుకువచ్చిన మనిషి మాట్లాడిన మాటలు ఆ కానిస్టేబుల్‌కి అర్థం కాలేదట' కానిస్టేబుల్ తనకు చెప్పిన మాటల్ని గుర్తు చేసుకుంటూ చెప్పాడు గంగారాం.

'మన ఫ్యుజీశాన్ అభిప్రాయం ఎలా ఉన్నదిట?' అడిగాడు షాడో.

కానిస్టేబుల్ మాటల్ని మరింత గట్టిగా గుర్తు చేసుకున్నాడు గంగారాం.

'ఏమైపోయిందో తెలియని సామ్రాజ్యం. ఏనాడో వెనకాముందూ చూసుకోకుండా చేసుకున్న ఒప్పందం. ఎందుకూ పనికిరాని ఈ ఎముకల గుట్ట తెచ్చి ముఖంమీద కొడితే, పెంపుడు జంతువులు మాదిరి తోకలు ఊపుకుంటూ బయలుదేరతామనుకుంటున్నాడు'.

కనురెప్పలు కూడా కదిలించకుండా విని తల ఊపాడు షాడో. 'ఆ మాటలకు కానిస్టేబుల్ ఏమని అన్నాడు?' అని అడిగాడు.

'ఒప్పందం అన్న తరువాత ఎముకలైనా, తల మీద వెంట్రుకలైనా మనం ఒప్పుకు తీరాలి కదా అన్నాడు' చెప్పాడు గంగారాం.

'అందుకు మన ఫ్యుజీశాన్ గారు ఏమని సెలవిచ్చారు?' అడిగాడు షాడో.

'ఆ ఒప్పందం కంటే మనల్ని పట్టుకోవటమే ముఖ్యమట... మనకి బుద్ధి చెప్పటమే ప్రధానమట'.

నిటారుగా నిలబడ్డాడు షాడో. చేతుల్ని ముడిచి తలవంచి ఆ మూటలోని నాణేలకు అభివాదం చేశాడు.

అంతులేకుండా పోయింది గంగారాం ఆశ్చర్యానికి. 'ఏమిటి గురూ... ఏమైంది నీకు?' అని అడిగాడు.

'ఎనిమిదివందల సంవత్సరాలకు పై మాట ఇది. చైనా మహాసముద్ర మధ్యభాగంలో ఉండేదిట ఒక మహాద్వీపం. కుంగ్‌ఫూ విద్యాపీఠానికి ఇరవై నాలుగవ గురువైన సూసీయన్ టైము అది...' అర మూసిన కనులతో చెప్పటం మొదలుపెట్టాడు షాడో.

***

పద్మాసనం వేసుకుని, కనులు మూసుకుని, మహాధ్యానంలో ఉన్న సూసీయాన్ చెవులకు చేరింది ఒక ఆర్తనాదం.

చటుక్కున కనులు తెరిచి, తను కూర్చుని ఉన్న వేదికమీది నించి లేచాడు అతను.

విశాలమైన ఉద్యానవనం మధ్యభాగంలో ఉన్నాయి కుంగ్‌ఫూ విద్యాపీఠపు కట్టడాలు. ఆ ఉద్యానవనం చుట్టూ ఏడు అడుగులు ఎత్తున నిర్మించబడి ఉన్నాయి గోడలు.

ఒకే ఒక మహాద్వారం ఉన్నది ఆ ఆవరణ మధ్యలో. అక్కడ గుమికూడి ఉన్నారు అనేకమంది గ్రామీణులు.

'లోపలికి రానీయండి.... మేము సూసీయన్ వస్తాదుతో మాట్లాడాలి... మా కష్టాల్ని చెప్పుకోవాలి' అంటున్నాడు ఒక వృద్ధుడు.

సహనం నశించింది కాబోలు తన దగ్గర ఉన్న పొడవాటి బరిశెను వెనక్కి తిప్పి అతని భుజాల మీద మోదాడు మహాద్వారం దగ్గర కాపలా నిలబడి ఉన్న భటుడు.

## తొలి నాటక ప్రదర్శనశాల



కొంగర సీతారామయ్య దుగ్గిరాలలో 'శ్రీకృష్ణ విలాస సభ' అనే నాటక సమాజాన్ని స్థాపించాడు. తెనాలి నుండి బుర్రిపాలెం వెళ్ళేరోడ్డులో 1918లో ఒక పక్కా హాలు నిర్మించి అందులో నాటకాలు వేశాడు. దాని పేరు 'శ్రీకృష్ణ సౌందర్య భవనం'. అయితే నేటి రత్నాటాకీస్ ఉన్న స్థలం అదే అని డా.పెద్ది రామారావు గారు 'యవనిక' పుస్తకంలో పేర్కొన్నారు.

*సేకరణ: ఎన్.తారకరామారావు*

దెబ్బ బలంగా తగిలింది కాబోలు – దీనంగా ఆర్తనాదం చేసి నేలమీద చతికిల పడిపోయాడు ఆ వృద్ధుడు.

'పొండి... వెళ్ళిపొండి... సూసీయన్ వస్తాదు ధ్యానంలో ఉన్నారు. అందుకు అభ్యంతరాలు కల్పిస్తే కోపం చేస్తారు. సూసీయన్ వస్తాదుకు కోపం వస్తే ఎలా ఉంటుందో మీకు తెలియదు. భూకంపం వచ్చేస్తుంది' అంటున్నాడు మరో భటుడు.

తన ప్రజ్ఞాపాటవాలను వాళ్ళు ఎంతగా ఎక్కువ చేసి అవతలి వాళ్ళను అదరగొడుతున్నారో చూసేసరికి చిరాకు కలిగింది సూసీయన్‌కి. నవ్వు కూడా వచ్చేసింది.

'ఆర్తులకు, ఆపదలో ఉన్నవారికి రక్షణ కల్పించవలసిన మనం లేనిపోని మాటలతో వాళ్ళని భయపెట్టకూడదు. అందరినీ లోపలికి రానీయండి' వేదిక దగ్గరినించే బిగ్గరగా అరిచి భటుల్ని హెచ్చరించాడు.

తమ మాటలు అతని చెవులకు చేరుకున్నాయని గ్రహించి, సిగ్గుతో కొంత, భయంతో మరికొంత తడబడ్డారు ఆ భటులు. నేలమీద చతికిలబడిపోయిన వృద్ధుడికి చేతులు అందించి పైకి లేపారు.

బిలబిలలాడుతూ ఆవరణలోకి అడుగులు వేశారు మహాద్వారం ముందు గుమికూడి ఉన్న గ్రామీణులు. జేగురు రంగు కొండరాయితో చెక్కబడిన మహాశిల్పం మాదిరి వేదిక దగ్గర నిలుచుని ఉన్న సూసీయన్ ముందు మోకరించి తలల్ని నేలకు ఆనించారు.

'భగవంతుడి సృష్టిలో అందరూ సమానులే. ఎక్కువ తక్కువలు మనం సంపాదించుకున్న జ్ఞానాన్ని బట్టి లెక్కించబడతాయి' అంటూ తలను పక్కకు తిప్పి, దూరంగా నిలబడి వింతగా చూస్తున్న కుంగ్‌ఫూ విద్యార్థులవైపు చూశాడు సూసీయన్.

పరుగు పరుగున వచ్చి వినయంగా తలలు వంచి నిలబడ్డారు వాళ్ళందరూ. 'ఆర్తులు వారందరూ. ఆకలిదప్పుల్ని లెక్కచేయకుండా చాలాదూరం నించి వచ్చారు. మధ్యాహ్న భోజనాదులు ఏర్పాటు చేయండి' ఆజ్ఞ ఇచ్చాడు సూసీయన్.

'స్వామీ... మేము..' అంటూ ఆర్తిగా ఏదో చెప్పబోయాడు వృద్ధుడు.

'వింటాను... ముందు మీ అలుపు ఆయాసాలు తగ్గిపోవాలి' ఆప్యాయంగా అన్నాడు వస్తాదు.

**(ఇంకా వుంది)**



# రుమటాయిడ్ ఆర్థరైటీస్

శరీరంలోని రోగ నిరోధక వ్యవస్థలో జీవక్రియల మార్పుల వలన, జన్యుపరమైన మార్పుల వలన వచ్చే కీళ్ళజబ్బులలో రుమటాయిడ్ ఆర్థరైటీస్ ఒకటి. ప్రపంతంలో 0.5 శాతం నుండి 1 శాతం వరకు ఈ జబ్బుతో బాధపడుతున్నారు. 15 సం॥లలోపు వయస్సుగల వారిలో ఈజబ్బురావడం చాలా అరుదు. 20 సం॥ల నుండి 80సం॥ల మధ్య వయస్సు వారిలో వచ్చే అవకాశం చాలా ఎక్కువ. పురుషులలో కంటే స్త్రీలలో మూడింతలు అధికంగా వచ్చే అవకాశం ఉంటుంది.

**కారణాలు:** శరీరంలోని జీవక్రియల అసమతుల్యత వలన, రోగ నిరోధక వ్యవస్థలోని మార్పుల వలన జబ్బు వస్తుంది. దీనితో పాటు శారీరక, మానసిక ఒత్తిడి కూడా ఒకకారణం. మానసికఒత్తిడివలన జన్యుపరమైన మార్పులు సంభవించి ఈ జబ్బు వచ్చేఅవకాశంఎక్కువగా ఉంటుంది. సరైన ఆరోగ్య పద్ధతులు పాటించనివారు, ధూమపానం, మద్యపానం చేసేవారిలో ఈ జబ్బు వచ్చే అవకాశం ఎక్కువ. **లక్షణాలు:** ఈ కీళ్ళ జబ్బు వలన కీళ్ళలో సైనవియల్ మెంబ్రేన్ దెబ్బతింటుంది. కీళ్ళలో అనవసరమైన ఫైబ్రస్ టిష్యూ పేరుకుపోతుంది. దానిని ఫ్యానస్ అంటారు. ఈ ప్యానస్ అనే చెడు పదార్థం వలన కీళ్ళలో కార్టిలేజ్ దెబ్బతింటుంది. కీళ్ళలో వాపులు తరుచు వస్తూపోతూ ఉంటాయి.

ఈ జబ్బుతో లక్షణాలు కొన్నిసార్లు అధికంఅవడం, కొన్నిసార్లు తాత్కాలికంగా ఉపశమనం లభించడం జరుగుతుంటుంది. లక్షణాలు అధికంఅయినపుడు జ్వరం, కీళ్ళలో వాపులు, కీళ్ళు ఎరుపెక్కడం, కీళ్ళు బిగుసుకు పోవడం, తీవ్రమైన నొప్పితో కదలికలు తగ్గి పోతాయి. ఆకలి తగ్గినపుడు రుమాటాయిడ్ ఆర్థరైటీస్ చేతి మణికట్టు కీళ్ళు, చేతివేళ్ళు, మోచేతి కీళ్ళు, మోకాళ్ళు ఎక్కువగా దెబ్బతినే అవకాశం ఉంటుంది.ఈ ఆర్థరైటీస్కేవలం కీళ్ళుదెబ్బతినడమే కాకుండా, శరీరంలోఇతర అవయువాలు కూడా దెబ్బ తింటాయి. ఊపిరితిత్తులలోని పైపొర, గుండె పైపొర దెబ్బతినే అవకాశం ఉంటుంది. తద్వారా గుండెనొప్పి వచ్చే అవకాశం ఉంటుంది. తరుచుగా ఊపిరితిత్తులలో నెమ్ము కారణంగా తుమ్ములు రావడం, దగ్గురావడం జరుగుతుంది. రక్తకణాల సంఖ్యపడిపోయి అనీమియాకి కారణం అవుతుంది. ప్లీహం వాపు వస్తుంది. కళ్ళు,నోరు పొడి బారి పోతాయి. చర్మం కింది భాగంలో గుళికల్లాంటి ఆకారాలు ఏర్పడతాయి. వీటిని రుమటాయిడ్ నాడ్యుల్స్ అంటారు.






డా. మురళి అంకిరెడ్డి
M. D (Homeo)
స్టార్ హోమియోపతి

**వ్యాధి నిర్ధారణ:** రక్తంలోని యాంటీబాడిస్ కనుగొనే పరీక్ష రుమటాయిడ్ ఫ్యాక్టర్పరీక్ష ద్వారా నిర్ధారించవచ్చు. ఏఎన్ఏ పరీక్ష ద్వారా కూడా నిర్ధారించవచ్చును. కీళ్ళని ఎక్స్రే తీయించి, ఎముకలలో ఎరోషన్స్ గుర్తించి నిర్ధారించవచ్చును. సాధారణ పరీక్షలు సీబీపీ, ఈఎస్ఆర్, సీఆర్పి పరీక్షలు కూడా వ్యాధిని నిర్ధారించడంలో సహాయపడతాయి.

**జాగ్రత్తలు:** ఇలాంటి కీళ్ళజబ్బుల బారిన పడకుండా ప్రతిరోజు వ్యాయామంచేయాలి.సరైనపోషకాహారం తీసుకోవాలి. ఎలాంటి వైరల్ ఇన్ఫెక్షన్స్ రాకుండా జాగ్రత్తలు తీసుకోవాలి. శారీరక, మానసిక ఒత్తిళ్ళని తగ్గించుకోవడానికి ప్రతి నిత్యం యోగా, ధ్యానం చేయాలి. **హోమియోవైద్యం:** రోగి మానసిక, శారీరక లక్షణాలను అనుసరించి హోమియోవైద్యం ఇవ్వడం జరుగు తుంది.లెడంపాల్,బ్రయోనియా, రస్టాక్స్, డల్కెమరా, కాల్చికమ్, బెంజోయిక్ ఆసిడ్, కాలిమూర్, పల్సటిల్లా తదితర మందులు ఉపకరిస్తాయి.



# సంతానలేమిని జయించవచ్చు

**ప్రస్తుత తరుణంలో యువత, యువ దంపతులు ఉద్యోగ రీత్యా ఎదుర్కొంటున్న మానసికఒత్తిళ్ళవలన హార్మోన్లమార్పులతో, సహజంగా కలగాల్సిన సంతాన ప్రక్రియ నేడు సంక్షోభంలో పడింది. దంపతుల్లో ఒకరికి లేదా ఇద్దరికి లోపం ఉన్నాసంతానలేమికి కారణం కావచ్చు. అయినా ఇప్పుడు సంతానలేమికి ఆందోళన చెందాల్సిన అవసరం లేదంటున్నారు ప్రముఖ ఫర్టిలిటీ స్పెషలిస్టు డాక్టర్ సి.జ్యోతి. ఆధునిక విధానాల వల్ల సంతానలేమికి దూరం కావచ్చని చెబుతున్నారు.**

సంతానలేమిసమస్యకు 30% స్త్రీలసమస్యలు ప్రధాన కారకాలుగా పరిశోధనలుతెలియజేస్తున్నాయి. సాధారణంగా అండాశయంలో అండం ఏర్పడి అండవాహిక ద్వారా గర్భాశయంలో చేరి శుక్రకణంతో సంయోగం చెంది పిండంగా మారుతుంది. ఏదైనా శస్త్రచికిత్స ఫలితంగా... అంటే అపెండిక్స్ఆపరేషన్ఓవరిన్కు గాయమైనా లేదా ఏదైనా వైరల్ బ్యాక్టీరియల్, లైంగిక సంబంధితవ్యాధుల వలన అండవాహికలు దెబ్బతింటే పిల్లలు కలుగకపోవచ్చు. స్త్రీలలో సంతానోత్పత్తి పైన మన జీవన విధానం, వృత్తి, వయసు, ఆహారపు అలవాట్లు ప్రభావం ఉంటుంది. శాస్త్రీయ అధ్యయనాల ప్రకారం 35సం॥రాలు పైబడిన స్త్రీలలో సంతానోత్పత్తి అవకాశాలు తక్కువ. లెడ్ వంటి రసాయనాలు విడుదలయ్యే కార్మాగారాలలో పని చేసే వారిలో డీబీసీబీ వంటి క్రిమిసంహారకాలు వాడిన ఆహారాన్ని తీసుకోవడం వలన, ఎక్స్రే, రేడియేషన్లకు గురయ్యే వారిలో అండాశయానికి సంబంధించిన వ్యాధులు కలుగుతాయి. ఫలితంగా సంతానం కలగదు.

**ప్రధాన కారణాలు:** మహిళలలో సంతానలేమికి అనేక కారణాలున్నాయి. వాటిలో ప్రధానమైనది. హార్మోనుల సమస్య హార్మోనులు అండం అభివృద్ధి విడుదలను ప్రభావితం చేస్తాయి. శరీరంలోని చిన్న మెదడు మరియు కీలకమైన పిట్యుటరీ గ్రంథుల్లో లోపాల కారణంగా అండం అభివృద్ధికి, ఎదుగుదలకు అవసరమైన ఫాలిక్యులర్ స్టిమ్యులేటింగ్ హార్మోన్ (ఎఫ్.ఎస్.హెచ్.), ల్యూటినైజింగ్ హార్మోన్ (ఎల్.హెచ్.)ల ఉత్పత్తి తగ్గి సంతానోత్పత్తికి ఆటంకం కలుగుతుంది. అధిక మానసిక శ్రమ, తక్కువ శారీరక శ్రమ కలిగిన యుక్తవయసు, మధ్య వయసు మహిళల్లో పి.సి.ఓ.డి. (పాలిసిస్టిక్ ఓవరియన్ డిసీస్)వలన కూడా సంతానలేమి ఏర్పడవచ్చు. ఇందులో ఎఫ్.ఎస్.హెచ్. హార్మోన్ల ఉత్పత్తి తగ్గి,ఈస్ట్రోజన్, టెస్టోస్టిరాన్ హార్మోనుల విడుదల మోతా దు అధికమై అండోత్పత్తి జరగదు. అందుకే ఈ వ్యాధి ఉన్న మహిళలకు సంతానం కలుగదు. కొంతమంది మహిళలలో సాధారణ మెనోపాజ్ వయసు కన్నా ముందే రుతుచక్రం నిలిచిపోతుంది. దానిని ప్రీమెచ్యూర్ మెనోపాజ్ అంటారు. ఈ పరిస్థితి క్రీడాకారిణి లలో, జన్యు పరంగానూ కొద్దిమంది మహిళల్లో సంతానలేమికి కారణంఅవుతాయి. 30-40% ఎండో మెట్రియోసిస్తోనూ, పాలిప్స్ మరియు ఫైబ్రాయిడ్ యుట్రస్ లతో బాధ పడే మహిళల్లో సంతానోత్పత్తి జరగదు. థైరాయిడ్, ఫిట్స్, మధుమేహం వంటి వ్యాధులతో పాటు తక్కువ బరువు,అధికబరువు, మానసికఒత్తిడి, ఆందోళనలు సంతానలేమిలో ప్రధాన భూమికను పోషిస్తున్నాయి.

**నిర్ధారణ పరీక్షలు:** అల్ట్రాసోనోగ్రఫీ, లాప్రోస్కోపి, హిస్టిరోసాల్ఫింజుగ్రఫీ, హార్మోనుల నిర్ధారణ పరీక్షలు, ఇంకా ఎల్.హెచ్,ఎఫ్.ఎస్.హెచ్.,ప్రొజెస్టిరాన్.

**ఆధునికపరిష్కారాలు:** అండాశయసమస్యలు, వీర్యకణాల సమస్యలను తొలగించడానికి పలురకాల మందులు అందుబాటులో ఉన్నాయి. కాకపోతే ఒక దశవరకే ఈ మందులతో ఫలితం ఉంటుంది. ఒకవేళ సమస్య అప్పటికే తీవ్రమైతేఏమాత్రం ఉపయోగం ఉండదు. అయితే అధునిక విధానాలు కొన్ని అసాధ్యాల్ని సుసాధ్యం చేస్తున్నాయి. ఐ.వి.ఎఫ్, ఇంట్రాయుటిరీస్ ఇన్సెమినేషన్ వంటి విధానా లతో సంతానం కలిగించే అవకాశాలు ఉన్నాయి. అలాగే టెసాటిక్కిక్ అండ్ ఇక్సీ విధానం ద్వారా సంతానం పొంద వచ్చు. ఆధునికవిధానాల్లో అండాలను లేదా శుక్ర కణాలను తీసి భవిష్యత్ అవసరాల కోసం ప్రయోగశాలలో అతి శీతలంగా (క్రైరో ప్రిజర్వేషన్) భద్ర పరిచి ఉంచడం సాధ్య మవుతుంది. ఈక్రమంలో ప్రయోగశాలలో ఫలదీకరణ చెందిన సూక్ష్మపిండాలను గర్భాశయం లో ప్రవేశపెడతారు. మిగిలిన అదనపు పిండా లను అతి శీతలం లో ఉంచి,వాటినే ఆ తర్వాత వాడతారు. అవసరాన్ని బట్టి అండాలనుగానీ, శుక్రకణాలను గానీ దాతల నుంచి స్వీకరించి వాడటం కూడా జరుగుతుంది. అందుకే సంతానం కలగడం లేదని ఇప్పుడు బాధపడా ల్సిన అవసరమే లేదు. దీనికి సరైన మార్గం ఫర్టీ9హాస్పిటల్...మీశ్రేయస్సుకొరకు మీ అందుబాటు లోకి వచ్చింది.

- డా॥ సి.జ్యోతి ఫెర్టిలిటీ స్పెషలిస్ట్
ఫర్టీ 9 హాస్పిటల్ & పరిశోధనకేంద్రం







# మిస్టరీ చెట్లు

ప్రకృతిలోని ప్రతిచిన్న విషయమూ అద్భుతమే. ఎన్నెన్నో మిస్టరీలు. వాటిల్లో కొన్ని మన ఊహకు అందితే, మరికొన్ని ఊహించుకోవడానికి కూడా అవకాశంలేని మిస్టరీలు ఉంటాయి. అయితే మేధోపరిమితి పెరుగుతున్న కొద్దీ మనిషి ఆ మిస్టరీలను క్రమంగా ఛేదిస్తున్నాడు. అయినప్పటికీ బోలెడు వింతలు, వాటి వెనుక కారణాలు ఇంకా మిగిలే ఉన్నాయి. అలాంటి వింతల్లో కొన్నింటిని చూద్దామా!!



చెట్టును చూసి పరవశించిపోని వారుండరు. కాసేపు పచ్చనిచెట్లను చూస్తూ గడిపితే మానసిక సమస్యలు దూరమవుతాయని ఇప్పటికే అనేక సర్వేలలో వెల్లడైంది. మనచుట్టూ రకరకాల ఆకర్షణీయమైన చెట్లు ఉన్నాయి. వాటి రూపురేఖల్లో ఎన్నో రకాల తేడాలుంటాయి. ఇప్పుడు చెప్పబోయే చెట్ల గురించి చదివితే మాత్రం తప్పకుండా మీరు ఆశ్చర్యపోతారు. ఆ చెట్లు అలా ఎందుకున్నాయన్న కారణాన్ని ఇప్పటివరకు ఎవరూ కనుక్కోలేకపోయారు. ఆ మిస్టరీచెట్ల కథాకమామీషు ఏంటో మీరూ చదివేసేయండి మరి!

## క్వశ్చన్‌మార్క్ చెట్టు

పొడుగ్గా ఉండే పైన్ చెట్ల గురించి మనందరికీ తెలిసిందే. అలాంటి పైన్ చెట్లే పోలాండ్‌లో క్రేజీ వేలోని క్రూకుడ్ ఫారెస్ట్‌లో కూడా ఉన్నాయి. కానీ మొదటిసారి చూసిన వారెవరూ వాటిని పైన్‌చెట్లని మాత్రం అనుకోరు. ఎందుకంటే వాటి ఆకారం అలా ఉంటుంది. కాస్త వంగి పైకి నిటారుగా కనిపించే ఈ చెట్లు చూడ్డానికి ఎలా ఉంటాయో తెలుసా? క్వశ్చన్‌మార్క్‌ని రివర్స్ చేస్తే ఎలా ఉంటుందో అలా ఉంటాయి. ఈ ఫారెస్ట్‌లో దాదాపు నాలుగు వందల పైన్ చెట్లు ఉన్నాయి. ఇంకా వింత ఏంటంటే అన్నీ నార్త్ డైరెక్షన్‌ని చూపిస్తూ ఉంటాయి. ఆ చెట్లన్నీ ఆ ఆకారంలో ఎలా ఉన్నాయి? అసలు అన్ని చెట్లు అక్కడికి ఎలా వచ్చాయనేది మాత్రం ఇప్పటి వరకూ పర్యావరణ శాస్త్రజ్ఞులకు అంతుబట్టట్లేదు. స్థానికుల అభిప్రాయం ప్రకారం, రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో ఆ చుట్టుపక్కల ప్రదేశాలతో పాటు ఆ అడవి కూడా పూర్తిగా నాశనమైంది. మళ్లీ అక్కడ ఎవరైనా మొక్కనాటితేతప్ప అడవి ఏర్పడే అవకాశం లేని పరిస్థితులవి. అయితే చెట్లవయసును బట్టి చూస్తే 1930లో కొంతమంది రైతులు వాటిని నాటారని తెలుస్తోంది. మూడునుంచి తొమ్మిది అడుగుల మధ్య వంగి యాభై అడుగుల ఎత్తులో ఈ చెట్లుంటాయి. కానీ పర్యావరణంలో చోటుచేసుకుంటున్న మార్పుల వల్ల ఈమధ్యకాలంలో ఆ చెట్లు కొన్ని కూలిపోతున్నాయట. ఇప్పటికే అక్కడి ప్రభుత్వం ఈ అడవిని రక్షించడానికి తగిన చర్యలు తీసుకుంటోంది.

### చెట్టును కోస్తే రక్తం

యెమెన్ చెట్టును డ్రాగన్ బ్లడ్ ట్రీ అని కూడా పిలుస్తారు. ఈ చెట్టు దాదాపు 32 అడుగులు పెరుగుతుంది. దీని ఆకారం మామూలు చెట్టులా ఉండదు. విభిన్నంగా ఉంటుంది. పొడుగాటి కాండం ఉండి పైన ఒక పళ్లెంలా కనిపిస్తుంది. ఫిబ్రవరి నెలలో వికసిస్తుంది. అసలింతకీ ఈచెట్టుకు డ్రాగన్ బ్లడ్ ట్రీ అనే పేరు ఎందుకు వచ్చిందనేగా మీ డౌటు. దీన్ని కోసినప్పుడు రక్తవర్ణ ద్రవం స్రవిస్తుంది. అందుకే దీనికి ఆ పేరు వచ్చింది. అంతేకాక ఈ చెట్టునుంచి వచ్చే ఈ ఎర్రని ద్రవాన్ని రకరకాలుగా ఉపయోగిస్తారు. పద్దెనిమిదవ శతాబ్ద కాలంలో వయోలిన్‌కి వార్నిష్ చేయడానికి ఈ ద్రవాన్ని ఉపయోగించేవారు. ఈ ఎర్రని ద్రవాన్ని నేడు వైద్యంలో ఉపయోగిస్తున్నారు. డయేరియా, చేతిపుండ్లు, బ్లీడింగ్, అల్సర్స్, విరోచనాలు, జ్వరంలాంటివి తగ్గించేందుకు వాడతారు. కేవలం వైద్యానికే కాక అద్దకపు రంగులు, వార్నిష్, అగరువత్తుల తయారీ, లిప్‌స్టిక్ వంటి సౌందర్య సాధనాలలో కూడా ఉపయోగిస్తున్నారు. ఈ ద్రవానికి ఎరుపురంగు రావడం ఆ చెట్టు స్వాభావిక గుణం అని కొందరు చెప్పినా ఈ చెట్టును కోసినప్పుడు ఎందుకు ఎరుపు రంగులో ఉంటుందన్న విషయం మాత్రం ఇప్పటివరకు కారణం తెలుసుకోలేకపోయారు.

### దేవుడి చెట్టు!

చెట్టు ఎదగాలంటే నేల, నీరు, సూర్యకాంతి ఉంటే చాలు కదా. కానీ ఇప్పుడు చెప్పబోయే మొక్క గురించి తెలుసుకుంటే మీరు ఆశ్చర్యపోకతప్పదు. బహ్రెయిన్‌లోని అరేబియన్ ఎడారిలో ఒక చెట్టు ఉంది. ఎడారి అంటే కనీసం తాగడానికే నీళ్లు దొరకడం కష్టం. అలాంటి చోట చెట్టు ఎలా పెరుగుతుంది అనుకుంటే పొరబాటే. ఆ చెట్టు సంవత్సరంలో అన్ని రోజులూ పచ్చగానే ఉంటుంది. దాని వేళ్లన్నీ ఎడారినేలలో బాగా లోతుకు చొచ్చుకుపోయి ఉంటాయి. అస్సలు ఎండిపోదు. ఎడారిలో ఓ పచ్చనిచెట్టు కళకళలాడుతూ కనిపించడం నిజంగా ఒక వింతే! ఎందుకంటే ఆ చెట్టుతప్ప ఆ చుట్టుపక్కల ఎక్కడా ఎలాంటి చెట్లూ లేకపోవడం ఇంకో వింత. ఇప్పటివరకు పర్యావరణవేత్తలకు ఆ చెట్టు ఎలా నీటిని గ్రహిస్తుందో ఎలా పెరుగుతుందో అంతుపట్టట్లేదు. ఆ చెట్టును చూసేందుకు ప్రతిసంవత్సరం చాలామంది పర్యాటకులు వస్తుంటారు. ఇది దేవుడి సృష్టి అని అక్కడివారు చెప్పుకుంటారు. అందుకే ఈ చెట్టును 'ట్రీ ఆఫ్ లైఫ్' అని పిలుస్తారు.

### చెట్టుమీద అనకొండలు, డైనోసార్లు!

మిస్టరీ ప్రదేశాల గురించి తెలియవచ్చు, మిస్టరీ ఆలయాల గురించి కూడా తెలిసివుండవచ్చుగానీ మిస్టరీ చెట్టు గురించి ఎప్పుడైనా విన్నారా? మిస్టరీ చెట్టా ఈపేరు వినడానికి భలే గమ్మత్తుగా ఉందే అనుకుంటున్నారా? అడవిలో ఎలాంటి అరుపులు, అల్లర్లు లేని నిర్మానుష్యమైన, నిశ్శబ్ద ప్రదేశంలో ఈ చెట్టు ఉంది. చూడడానికి పెద్ద మర్రివృక్షంలా కనిపిస్తుంది. ఈ చెట్టును చూస్తే ఒళ్లు జలదరించక మానదు. ఒకవేళ ఎవరైనా ఈ చెట్టును ముట్టుకోవడానికి సాహసించారనుకోండి ఆ భయం మాటున మనసు కకావికలం కాకతప్పదు! అబ్బ! చెట్టును ముట్టుకోవడానికే అంత భయమా? అదేమైనా దయ్యాల చెట్టా! అసలు ఆ చెట్టు నిజమై ఉండదు అని చాలామంది కొట్టిపడేస్తుంటారు. కానీ ఈ చెట్టు నిజమైనదనీ దమ్ముంటే ముట్టుకోండనీ సోషల్ మీడియాలో సైతం దీని మీద సవాళ్ల మీద సవాళ్లు విసురుతున్నారు నెటిజన్లు. ఇంతకీ ఈ అంతుచిక్కని చెట్టు ఎక్కడ ఉందో మీకు తెలుసా? ఇంకెక్కడ? మన తెలుగురాష్ట్రంలోనే ఉంది. ఈ మిస్టరీచెట్టు నల్గొండజిల్లా నల్లమల అటవీ ప్రాంతంలో ఉంది. చాలామంది స్థానికులు ఈ చెట్టు దగ్గరకి రావడానికి, అటువైపు వెళ్ళడానికి కూడా జంకుతున్నారట. ఈ చెట్టును పరిశీలనగా చూస్తే మీకు కొన్ని విషయాలు తెలుస్తాయి. ఈ చెట్టును చుట్టుకుని ఓ పెద్ద అనకొండలాంటి పాము ఆకారం ఉంటుంది. సాధారణంగా చెట్లపైన పక్షులు వాలతాయి. కానీ ఈ చెట్టు చుట్టూ మొసళ్ల ఆకారాలు ఉంటాయి. చెట్టుపైన తేళ్ళు, బల్లులు, కోతులు, డైనోసార్లు లాంటి భీకరమైన జంతువుల చిత్రాలు ఉంటాయి. ఈ ఆకారాలన్నీ ఎవరో చెక్కినవనుకుంటే పొరపాటు పడినట్టే. ఈ చెట్టుపైన ఈ భయంకరమైన జంతువుల ఆకారాలు ఎందుకున్నాయో ఎలా వచ్చాయో ఇప్పటివరకు ఎవరికీ తెలియదు. అదొక అంతుచిక్కని మిస్టరీగానే మిగిలిపోయింది.

### విషవృక్షం

మనచుట్టూ అన్నీ మంచిచెట్లు అంటే పరిమళాలు వెదజల్లే చెట్లు ఉండాలనే నిబంధన ఏదీ లేదు. కొన్ని కొన్ని విషవృక్షాలు కూడా ఉంటాయి. అలాంటివాటిల్లో అతిపురాతనమైన వృక్షం ఇది. ఈ చెట్టుపేరు బాటిల్ ట్రీ. పేరునుబట్టే చెప్పవచ్చు ఇది బాటిల్ ఆకారంలో ఉంటుంది. ఈ చెట్టు నమీబియాలో ఉంది.

ప్రపంచంలోనే అత్యంత విషపూరితమైన వృక్షాలలో ఇదొకటి. విలుకాళ్ళు తమ బాణాలకు ఈ చెట్టుపాలు రాసి, శత్రువులపై ప్రయోగించేవారు. ఈ చెట్టు విషవృక్షమైనా దీని పూలు పింక్, వైట్ కలర్‌లో ఎంతో ఆకర్షణీయంగా కనిపిస్తాయి.

**—విజేత**

## సొరంగం చెట్టు!

ఎప్పుడైనా గాలివాన వచ్చినప్పుడు చెట్లుపడిపోవడం మామూలే. చెట్టు పడిపోతే వెంటనే దాన్ని అక్కడ నుంచి తీసే ప్రయత్నాలు జరుగుతుంటాయి కదా! అలాంటి గాలివానల తాకిడి వల్ల కాలిఫోర్నియాలోని సేక్యోయియా నేషనల్ పార్క్‌లో ఓ చెట్టు కూలిపోయింది. దాదాపు ఎనిమిదిమీటర్ల వెడల్పు, 85 మీటర్ల ఎత్తున్న ఈ రెడ్‌వుడ్ చెట్టును ప్రక్కకు తొలగించడం చాలా కష్టమైపోయింది. ఈ చెట్టును తొలగించలేక దానిలోంచి ఒక సొరంగ మార్గం ఏర్పాటు చేశారు. ఈ రెడ్‌వుడ్‌చెట్టు ప్రపంచంలోని అతిపెద్ద వృక్షజాతికి సంబంధించినది. ఈ సొరంగమార్గం తయారుచేసి ఇప్పటికి సుమారు 75 సంవత్సరాలైంది. ఇలాంటి వృక్ష సొరంగమార్గాల్లో ఇదే పురాతనమైనది!



## చెట్టులో పబ్, బార్ !

*బార్ ఎక్కడ కడతారు? ఎక్కడేంటి ఏదైనా మంచి ప్రదేశంచూసి కడతారు అంటారు, అవునా! కానీ ఈబార్‌ను ఓ చెట్టు తొర్రలో నిర్మించారు. దక్షిణ ఆఫ్రికాలో దాదాపు ఆరువేల సంవత్సరాల వయసున్న బావోబాబ్ చెట్టుంది. అదిప్పుడు డొల్లగా మారింది. ఇప్పుడు ఆ తొర్రలో ఏకంగా ఓ పబ్, బార్ నిర్మించారు. బావోబాబ్ చెట్టును తెలుగులో బ్రహ్మామలిక అని పిలుస్తారు. ఈ చెట్టు నుంచి వచ్చే పళ్లరసంతో షర్బత్ తయారు చేస్తారు. వెల్వెట్‌రంగులో ఉండే ఈ చెట్టుపళ్ళు పెరుగు వాసన వస్తాయి. ఇది ఎక్కువగా ఆఫ్రికాలో పెరుగుతుంది. దీన్ని అప్‌సైడ్ డౌన్ ట్రీ అని కూడా పిలుస్తారు. బావోబాబ్‌చెట్టు జాతులు మొత్తం తొమ్మిది ఉన్నాయి. వీటిల్లో ఆరురకాల వృక్షజాతులు మడగాస్కర్‌లో, రెండురకాలు ఆఫ్రికాలో, ఒకరకం వృక్షాలు ఆస్ట్రేలియాలో, అరేబియన్ పెనిసులాలో ఉన్నాయి.*





# విజయానికి 'మాస్క్' తగిలించకు

**"ప్రతి మనిషిలో సృజనాత్మకశక్తి ఉంటుంది. ఏదో ఒకరోజు దానికి విజయం లభిస్తుంది. దానిని ఏ క్షణంలో బహిరంగపరచడం ఆరంభిస్తావో అప్పుడు ప్రపంచాన్ని మార్చడం మొదలు పెడతావు"**

—పాలో కోయిూ

ఇతరులకు నిస్వార్థమైన ప్రేమాభిమానాలు పంచివ్వగల్గితే వాళ్ళు కూడా అవే మీకు పంచుతారు. ఎదుటివారి వ్యక్తిత్వాన్ని, అభిరుచుల్ని గౌరవించినప్పుడే ఇరువురిమధ్య అనుబంధం ఏర్పడుతుంది. ఆ 'అనుబంధాలే' మీ విజయానికి వారధులు.

సమాజంలోని ప్రతి అంశం విజేతలకు ఏదో ఒక సమయంలో, ఏదో ఒకరకంగా తోడ్పడే ఉంటుంది.

అందలం ఎక్కాలంటే నిచ్చెన మెట్లుండాల్సిందే. పదిమందితో పంచుకోలేని ఆ విజయం ఒంటి చేతి చప్పుడు లాంటిదే. గుర్తింపు ఉండదు. నీవైపు ఎవ్వరినీ చూసేలా చెయ్యదు.

నీ విజయాన్ని పదుగురితో పంచుకోవటమే విజయం. అంటే నిన్ను నువ్వు జయించుకోవటం అన్నమాట.

"నిన్ను నువ్వు జయిస్తే విశ్వమంతా నీకు స్వాధీనమైనట్టే"

—ఐన్‌స్టీన్

### నిన్ను నువ్వు జయించడమంటే...

"నాకు అద్భుతమైన తెలివితేటలు, ఆర్థికవనరులు ఉన్నాయి. నాకెవరితో పన్లేదు" అనుకుని ఓ వ్యాపారమో, కంపెనీయో ప్రారంభించి దానికి నేనే సి.ఇ.ఓ. అని ప్రకటించగానే విజయం వచ్చి ఒళ్ళో వాలిపోదు.

ఓ వ్యాపారం అభివృద్ధి చెందాలన్నా, ఓ కంపెనీ మంచి విజయాలు సాధించాలన్నా వివిధ స్థాయిల్లో ఉద్యోగులుండాలి. కంపెనీకి డైరెక్టర్లుండాలి, మార్కెటింగ్, సేల్స్ శాఖలు ఉండాలి. ఇలా యజమాని ప్రతి అంశంలోనూ అందరినీ ఆకట్టుకోగల సమర్థవంతుడై సత్సంబంధాలు కొనసాగిస్తేనే యాభై శాతం విజయంవైపు మనం పయనిస్తాం. మిగిలిన యాభైశాతం విజయానికి నీ దగ్గరున్న తెలివితేటలు, ఆర్థికవనరులు తోడ్పడతాయి.

పాఠకులు ఆదరించినప్పుడే రచయిత గొప్పరచయితగా మారతాడు. ప్రేక్షకాదరణే సినిమా దర్శకుడి విజయం. అలాకాకుండా నేనేం రాసినా చదువుతారు, నేనే సినిమా తీసినా చూస్తారు అనుకునేవారికి లభించే జయం చాలా స్వల్పం.

"నిన్నునువ్వు జయించాలంటే ముందు నీలోని విజయకాంక్షకి "నేనే" అనే మాస్క్ తొలగించి 'మనం' అనే పారదర్శకత ప్రదర్శించాలి.

**ఒక మంచి ఆలోచన ఇతరులతో పంచుకో. వాళ్ళే దాని విజయానికి వారధి కడతారు.**

—మార్టిన్ లూథర్ కింగ్

"సంపాదన పెరిగితే ధనవంతుడివవుతావు
వయసు పెరిగితే వృద్ధుడివవుతావు.
వాటితోబాటు మంచితనమూ పెరిగితే
'మంచి మనిషివి' అవుతావు.

మేధావుల మాటలు, చేతల్ని ప్రపంచం ఎప్పుడూ గమనిస్తూనే ఉంటుంది. అనగా ప్రజల మనస్సులలో, ప్రజల నాలుకపై ఎవరుంటారో వారెప్పటికీ సజీవులుగానే ఉంటారు.

నాటి బుద్ధుడు, వివేకానంద, మహాత్మాగాంధీ మొదలుకుని మనకి తెలిసిన అబ్దుల్‌కలాం వరకూ అందరూ భౌతికంగా కనుమరుగైనా సమాజంలో వారంతా సజీవులే.

### 'జయం' నుండి 'వి'జయానికి:

'జయం' ఒక వ్యక్తికి సంబంధించిన అంశం. "కష్టపడి చదివి పరీక్ష పాసయ్యాడు", "సముద్రాన్ని ఈది ఆవలితీరం చేరాడు" వంటివన్నీ వ్యక్తిగతమైనవి. నువ్వు సాధించిన ఆ జయం విజయంగా మారాలంటే అది ఇతరులకు మేలు చేకూర్చేదిలా ఉండాలి.

రామోజీరావుగారు సాధించిన జయం ఫలాలు విజయవటవృక్షంగా మారడంవల్ల ఆయన సంస్థలలో వేలాది మంది ఉపాధి పొందుతున్నారు.

అట్టడుగు ఉద్యోగినుంచి పైస్థాయి ఉద్యోగుల వరకూ తమతమ విధులు సక్రమంగా నిర్వర్తించడం వల్ల ఆయన విజయానికే విలాసంగా మారారు.

### ప్రోత్సాహమే ఉత్సాహం

కిందివారిని ప్రోత్సహించే మనసు చాలా మందికి ఉండదు. తనో యజమానిననో, బాస్‌ననో, మేధావిననో తమచుట్టూ పరిధి గీసుకుంటారు. ఎదుటివారి స్థాయినిబట్టే పలకరిస్తుంటారు. ఎదురైనప్పుడు నమస్కారం పెట్టినా కనీసం కన్నెత్తయినా చూడని ఎంతోమందిని నిత్యం చూస్తుంటాం.

నీకింద పనిచేసేవారికి నువ్వు పంచివ్వగలిగేది

12

# విజయ విలాసం-2

## స్టెప్స్ టు సక్సెస్



-ఎం. వెంకటేశ్వరరావు, సెల్: 90307 07037

ఓ చిరునవ్వు, ఓ మంచిమాట. అవే వాళ్ళకి ప్రోత్సాహాన్నిచ్చి ఉత్సాహాన్నిస్తుంది. అంతేకానీ నువ్వు ఏడాదికోసారిచ్చే బోనస్సో లేక ఇన్సెంటివ్‌లో నీపట్ల వారికి గౌరవాన్ని పెంచవు. కిందివాళ్ళు తప్పుచేస్తే, దాన్ని సరిదిద్ది ఆ తప్పు మరోసారి జరగకుండా జాగ్రత్తలు చెప్పి ప్రోత్సహిస్తే అద్భుత ఫలితాలు వస్తాయి. అలా కాకుండా కఠినశిక్షల వల్లనో, దూషించడం వల్లనో ఫలితాలు తారుమారవుతాయని గ్రహించాలి.

"అంతర్జాతీయ క్రికెట్‌క్రీడలోకి అతను 2005లో ప్రవేశించాడు. మొదటి ఆటలోనే 'డక్ అవుట్' అయ్యాడు. ఆ తర్వాత కూడా పెద్దగా రాణించలేకపోయాడు. జట్టులో స్థానం కోల్పోతానని భయపడ్డాడు. టీమ్ కెప్టెన్ అది గమనించాడు. "నీలో ఉన్న సత్తా నీకు తెలియదు. ఈ పరాజయాలన్నీ తాత్కాలికం. నువ్వు జట్టులో ఇంకో పదేళ్ళైనా ఉంటావు. వికెట్ తేలిగ్గా ఇవ్వను అనుకుని ఆడితే ఎంతసేపైనా క్రీజ్‌లో ఉంటావు" అని ప్రోత్సహించిన మాటలే అతనిలోని సత్తాని బయటపెట్టాయి.

### టెస్ట్ మ్యాచ్‌లో అవకాశం

"మొదటి మ్యాచ్ ఆడుతున్నావు. జీవితంలో మరచిపోలేని రోజు కావాలిది. ఆటని ఎంజాయ్ చేస్తూ ఆడు" అని సీనియర్ ప్లేయర్ ఇచ్చిన భరోసాతో తొలి టెస్ట్‌మ్యాచ్‌లో తన సత్తా చూపించి సెంచరీ దాటాడు. అతడే సురేష్ రైనా. అతడిని ప్రోత్సహించిన కెప్టెన్ రాహుల్ ద్రావిడ్, సచిన్ టెండూల్కర్.

సీనియర్ ప్లేయర్లిద్దరూ తమ విజయాలకు మాస్క్ తగిలించుకోకుండా ఇచ్చిన ప్రోత్సాహం వారిద్దరి విజయాల స్థాయిని పెంచింది.

చిన్నవయసులోనే కెప్టెన్‌గా ఎదిగిన రెండోవ్యక్తి కూడా సురేష్ రైనానే. కాబట్టి చిటికెడంత ప్రోత్సాహం, కొండంత ఉత్సాహాన్నిస్తుంది.

మీరు ఎంత ఉన్నతులైనా, ఎన్ని అర్హతలున్నా, ఇతరులతో ప్రవర్తించే తీరునుబట్టే, మీరు ఎలాంటి వ్యక్తో, మీ వ్యక్తిత్వం ఏమిటో ఇట్టే తెల్సిపోతుంది.

మీకెన్ని తెలివితేటలున్నా భూమ్యాకర్షణశక్తికి వ్యతిరేకంగా మీ అంతటమీరు ఆకాశంలోకి ఎగరలేరు. మీవిజయాన్ని ఇతరులు పండగ చేసుకునేలా, మిమ్మల్ని భుజానికెత్తుకుని, ఆకాశంలో నడిపించేట్టుగా ఉండాలి మీ ప్రవర్తన.

### ప్రవర్తన ఎలా ఉండాలి?

"దేశాధ్యక్షుడిగా ఉన్న ఓ వ్యక్తి, తన కేబినెట్ మంత్రితో కలిసి ప్రయాణిస్తున్నాడు. మార్గంమధ్యలో ఓ సామాన్యపౌరుడు అధ్యక్షుణ్ణి చూసి వినయంగా వందనం చేశాడు.

దానికి ప్రతిగా ఆ దేశాధ్యక్షుడు, తన తలపై ఉన్న టోపీ తీసి తిరిగి అభివాదం చేశాడు.

అది నచ్చని పక్కనున్న మంత్రి "ఒక సామాన్య పౌరుడికి మీరింతగా అభివాదం చెయ్యడం నచ్చలేదు" అన్నాడు.

దానికా దేశాధ్యక్షుడు "ఒక సామాన్యపౌరుడికే సాటిమనిషిని గౌరవించటం తెల్సినప్పుడు, దేశ అధ్యక్షుడినైన నేను తిరిగి అతడిని గౌరవించడంలో అతనికంటే పై స్థాయిలోనే ఉండాలి కదా!" అన్నాడు. ఆయనే అమెరికా 16వ దేశాధ్యక్షుడు అబ్రహాం లింకన్.

**"మనిషికి వివేకం ఒక వరం. అదివున్నవాళ్ళకి భిన్నత్వంలో ఏకత్వం కన్పిస్తుంటుంది"**

—సిసిరో

### ప్రాణాలు కాపాడిన ప్రవర్తన

"అది ఓ కోల్డ్‌స్టోరేజ్ గోడౌన్. ఆరోజు సాయంత్రం ఉద్యోగులంతా పనిముగించుకుని ఇళ్ళకు వెళ్ళే సమయం. అయితే ఓ వ్యక్తిమాత్రం కోల్డ్‌స్టోరేజ్ గోడౌన్ లోపల యంత్రంలో ఏర్పడ్డ సాంకేతిక లోపాన్ని సరిచేస్తున్నాడు. సమయం చూసుకోకుండా పనిలో నిమగ్నమైపోయాడు. సిబ్బంది తలుపులు తాళాలు వేసుకుని వెళ్ళిపోయారు. దాంతో గాలి సైతం చొరబడే వీలులేని శీతలగిడ్డంగిలో తాను బందీ అయ్యాడు. మర్నాడు ఉదయం వరకు గిడ్డంగి తాళాలు తెరచే ఛాన్సేలేదు. కొంతసేపట్లోనే సజీవ సమాధి కావటం ఖాయమనే విషయం అతడు గ్రహించాడు. తనపై ఆధారపడ్డ భార్యాపిల్లల్ని తల్చుకునేసరికి దుఃఖం ఆగలేదు.

అప్పటికే శ్వాస భారంగా తీసుకునే పరిస్థితి ఏర్పడుతోంది. "ఎవరైనా కాపాడండి" అని గట్టిగా అరిచాడు. తన అరుపులు బయటికి వినిపించవని అతనికీ తెలుసు. స్పృహ కోల్పోయే పరిస్థితి వస్తోంది అతడికి. అంతలో ఏదో వెలుగు తనవైపే రావడం చూశాడు. అడుగుల శబ్దం..."సార్! సార్" అని ఎవరో పిలుస్తున్నారు. కళ్ళు తెరిచాడు. ఎదురుగా సెక్యూరిటీగార్డు. తలుపులు బార్లా తెరచున్నాయి. ప్రాణాపాయం లేదు. మామూలు స్థితికి వచ్చాడతను.

"నేను లోపలున్నట్టు నీకెలా తెల్సింది?" సెక్యూరిటీ గార్డ్‌ని అడిగాడు.

"ఎవరూ చెప్పలేదు సార్! ఈ ఆఫీసులో పని చేసే సిబ్బందిలో ఉదయం ఆఫీసుకొస్తూ "నన్ను 'హలో' అని పలకరించి, తిరిగెళ్ళేటప్పుడు 'బై' చెప్పేది మీరొక్కరే."

"ఈరోజు ఉదయం హలో చెప్పిన మీరు సాయంత్రం బై చెప్పకుండా బయటకు వెళ్ళరు కదా? నా మనసులో ఏదో వెలితి. అందుకే అనుమానం వచ్చి తనిఖీ చేశాను" అన్నాడు.

**"మన వ్యక్తిత్వం ఓ చెట్టులాంటిది. మన కీర్తిప్రతిష్ఠలు దాని నీడలాంటివి. మనం నీడే నిజమనుకుంటున్నాం, నిజమైన చెట్టు సంగతి మరచిపోతున్నాం"**

—అబ్రహాం లింకన్

## హేట్సాఫ్ మెట్రోమేన్ ఇ.శ్రీధరన్

ఏడు పదులు దాటిన వయసులో ఉరకలేసే ఉత్సాహంతో ప్రగతిపట్టాలపై మెట్రోరైళ్ళను దేశ విదేశాల్లో పరుగులు తీయిస్తున్న "మెట్రోమేన్" పద్మవిభూషణ్ డాక్టర్ ఇ.శ్రీధరన్. ఆయన జీవన పయనం మాటలకందని స్ఫూర్తి పాఠం. కేరళలోని పాలక్కాడ్ ఆయన జన్మస్థలం. ఇంటర్‌వరకు కేరళలో చదివారు. కాకినాడలో ఇంజనీరింగ్ పూర్తి చేసి విజయవాడలో రైల్వేశాఖ డిప్యూటీ ఇంజనీర్‌గా ఎన్నో సేవలందించారు. 1963లో రామేశ్వరంలో భీకర తుఫాన్ తాకిడికి పాడైపోయిన పాంబన్ రైల్వేబ్రిడ్జి పునర్నిర్మాణాన్ని గడువుకుముందే పూర్తి చేసి అందరి దృష్టినీ ఆకర్షించారు.

చిత్తశుద్ధి, నిపుణులతోపోటీ, వేగంగా నిర్ణయాలు తీసుకోవడం, ఆరోగ్యంగా ఉండటం, సమయపాలన అనే ఐదుసూత్రాల పద్ధతిని తాను పాటిస్తూ, కార్మికుల్లో సమర్థత పెంపొందిస్తారు. వారికి ప్రేరణ ఇస్తారు.

1970లో కలకత్తా మెట్రోరైలు రూపకల్పన ఆయన చేపట్టిన అనితరసాధ్యమైన బాధ్యత. అలా దేశంలోనే మొట్టమొదటి మెట్రోరైలుకు శ్రీకారంచుట్టి, నిపుణులైన సిబ్బందిని ఎంపిక చేసుకుని, వారికి మార్గనిర్దేశంచేస్తూ నిర్దేశిత గడువులోపు పనులు పూర్తిచేశారు శ్రీధరన్.

అనంతరం కొంకణ్‌రైల్వే నిర్మాణ బాధ్యతలు చేపట్టారు. 93 గుహల్లోంచి రైలుమార్గంతోపాటు మరో 154 బ్రిడ్జిలు కూడా నిర్మించారు. ఎన్నో రాజకీయ ఒత్తిళ్ళ మధ్య నిర్దేశించిన ఏడేళ్ళ గడువులోపు ఈ నిర్మాణం పూర్తిచేశారు.

ఆ తర్వాత ఢిల్లీ మెట్రోరైలుకు రూపకల్పన చేశారు. అనేక సమస్యలమధ్య దానిని సాకారం చేసిచూపించారు.

ప్రస్తుతం హైదరాబాద్ మెట్రో రైల్ నిర్మాణ



పనులేకాక, పలురాష్ట్రాల్లో మెట్రో రైళ్ళ రూపకల్పన చేస్తూనే, స్వరాష్ట్రం కేరళలో కొచ్చి మెట్రోరైలును పరుగులు తీయించారు. బంగ్లాదేశ్, పాకిస్థాన్, డెమాస్కస్, శ్రీలంక దేశాలు కూడా శ్రీధరన్ సేవలు పొందుతున్నాయి.

పద్మశ్రీ, పద్మవిభూషణ్, ఆసియాహీరో, గౌరవ డాక్టరేట్, నైట్ ఆఫ్ ద లీజియన్ వంటి పురస్కారాలు..... ఆయనకు మణిమకుటాలు.

# తుపాను తర్వాతి దృశ్యం

**-రామా చంద్రమౌళి**

**1942 నుండి 1951 తర్వాతదాకా...**

**తెలంగాణ ఒక అగ్నిగుండం. తెలంగాణ ఒక నిప్పులకొలిమి. తెలంగాణ ఒక కన్నీటి సముద్రం. తెలంగాణ రక్తసిక్తమైన పిడికిలిలో తుపాకీ ధరించి భూమిలోనుంచి ఉద్భవించిన విప్లవహస్తం. తెలంగాణ ఆకాశమెత్తు విక్రమించి మూడువేల గ్రామాలనూ, పదిలక్షల ఎకరాల భూమినీ విముక్త పరచి ప్రజలపరం చేసిన యోధ. ప్రపంచ ప్రసిద్ధిచెందిన తెలంగాణ సాయుధ రైతాంగపోరాటం చదువురాని నిరక్షరాస్య ప్రజా సైన్యానిదే. ఏండ్లతరబడి గ్రామసంఘాలుగా, దళాలుగా, గెరిల్లా తిరుగుబాటుదారులుగా, వ్యూహకర్తలుగా, ప్రజాకంటకులైన భూస్వామ్య బూర్జువాలనూ, దొరలనూ, జాగీర్దార్లనూ, దేశ్‌ముఖ్‌లనూ, ముఖ్తేదార్లనూ, జమీన్‌దార్లనూ గడగడలాడించి తరిమి, తన్ని, అవసరమైతే చంపి దశాబ్దాల పీడననుంచి తెలంగాణను విముక్తం చేసిన మహోగ్ర ప్రజావెల్లువ.**

పిడికెడుగుండెలో మనిషికి జీవితంలో మరుపురాని జ్ఞాపకాలన్నీ సజీవమై ఎప్పటికప్పుడు గుప్పుమని మండే పెట్రోల్‌బావులే. ప్రతి యాదీ ఒక నిప్పుల చెరువు.

'జాగ్రత్తగా విను. మనిషిని చంపడం, నిర్మూలించడం ఒక్కటికాదు. ఏ కారణంచేతనైనా మనిషి ప్రాణాలు తీయడం, చంపడం హత్య. కానీ ప్రజా కంటకుడైన కలుపుమొక్కలాంటి వ్యక్తినీ, కుందేళ్లనూ, జింకలను నిర్దాక్షిణ్యంగా చంపితినే పులి వంటి క్రూరమృగాన్నీ చంపడం నిర్మూలన. దుష్టశక్తుల నిర్మూలన యుగధర్మమని మన భారతీయ చింతన ఆదినుంచీ ప్రవచిస్తూనే ఉంది. నరకాసుర సంహారం, రావణవధవంటివన్నీ మానవులు రాక్షస పీడననుంచి విముక్తిపొందిన ఘటనలే. అందుకే అవి ప్రజలకు పండుగలైనాయి. కలుపుమొక్కలను నిర్దాక్షిణ్యంగా పీకెయ్యనిదే పంటమొక్కలు బతకలేవు. ఇప్పుడు మనం ఈ మన ప్రజాయుద్ధమైన తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటాన్ని మన ప్రాణాలకు తెగించి కొనసాగిస్తున్నది కూడా ధర్మ సంరక్షణకే..' అతని గొంతు ఇంకా తాజాగా, నిన్న రాత్రి విన్నట్టే ఖంగుమని వినబడ్తోంది.

ఆమెకు ఎనభైరెండేళ్ళు. కిటికీదగ్గర కూర్చుని, కిటికీలోనుంచి, దూరంగా గర్జిస్తున్న సముద్రం దిక్కు చూస్తోంది. ఒకటే హోరు. ఎడతెగని నిరంతర ఘర్షణ. అలసిపోని అలల చేతులతో నిర్విరామ యుద్ధం.

పండిన బాదాంచెట్టు ఆకులా ఉందామె. మగ్గిన ఎరుపుదనంతో ముడుతలుపడ్డ పల్చనిచర్మంతో, తెల్లని వెండి వెంట్రుకలతో, చాలా అలసిపోయిన, అర్థంకాని దుఃఖభావనతో ఆమె కళ్ళు మూసుకుంది.

మళ్ళీ ఆ జ్ఞాపకం అప్పుడే అగ్గిపుల్లగీసి విసిరేస్తే అంటుకున్న పెట్రోల్‌బావివలె గుప్పుమని ఎగసి విస్తరించింది. దశాబ్దాలు దశాబ్దాలుగా లోపల ఆరిపోని నిప్పుకణికై మండుతున్న జ్ఞాపకం. నిప్పు.. నిప్పు.

వేలమంది దిక్కూమొక్కూలేని జనం ఉప్పెనై చేతుల్లో కర్రలతో, బరిశెలతో, వడిశెలతో, కొడవళ్ళతో, ఆడవాళ్ళు బొడ్లో దోపుకున్న కారంపొడి నింపిన బట్టసంచులతో ఒక ఆకాశమెత్తు సముద్ర కెరటమై ముంచుకొస్తున్న దృశ్యం. కేకలు, అరుపులు, నినాదాలు నిప్పులు చిమ్మే ఆగ్రహావేశాలు.

జనగాం రైల్వేస్టేషన్.

భారతదేశానికి ఆగస్టు 15, 1947న స్వాతంత్ర్యం వస్తే ఆనాడు దేశంమొత్తంమీద ఐదువందలఅరవైకి పైచిలుకున్న అన్ని సంస్థానాల్లోకెల్లా అతిపెద్దదీ, దేశం నడిబొడ్డున విస్తరించి వున్న ధనికసంస్థానం 'హైదరాబాద్ దక్కన్'. దానిని ఏడవ నిజాం ఉస్మాన్ అలీ తనకు తాను ఒక సర్వసత్తాక స్వతంత్రరాజ్యంగా ప్రకటించుకుని కొనసాగుతున్న క్రమంలో, నెహ్రూ ప్రధానమంత్రిగా ఉన్న భారతప్రభుత్వం, హోం మంత్రి సర్దార్ వల్లభాయ్‌పటేల్ నేతృత్వంలో అనేక పర్యాయాలు చర్చలు జరిపి చివరకు పోలీస్‌చర్యతో విముక్తంచేసిన తెలంగాణ మాత్రం మిగతా భారత దేశవాసులకు భిన్నంగా దాదాపు పదమూడునెలలు ఆలస్యంగా 17 సెప్టెంబర్, 1948న రాష్ట్ర విమోచన జరిగి స్వతంత్రమైంది.

ఖాసింరజ్వీ నాయకత్వంలోని రజాకార్లు, అనధికార నిజాం పోలీసులు, తన పెంపుడు కుక్కలవంటి జమీన్‌దార్లు, జాగీర్దార్లు, దేశ్‌ముఖ్‌లు, ముఖ్తేదార్లు, దేశాయి, సర్దేశాయి వంటి గుండా దళారీలంతా నిజాం నవాబు బలగమే. బలగాలతో తెలంగాణ మొత్తంమీద జన్నారెడ్డి ప్రతాప్‌రెడ్డి వంటి ఒకవ్యక్తి లక్షాయాభైవేలఎకరాల భూమినీ, విస్నూర్ రామచంద్రారెడ్డి అరవై గ్రామాలను హస్తగతం చేసుకుని నలభై వేలఎకరాలు, సూర్యాపేట దేశ్‌ముఖ్ ఇరవై వేలఎకరాల భూమిని ఆక్రమించి సర్ఫేఖాస్ భూములుగా, ఖాల్సా భూములుగా అనుభవిస్తున్నారు. సామాన్యప్రజలను బానిసలుగా, వెట్టిచాకిరీచేసే గులాపోళ్లుగా, తమ చెప్పు చేతల్లో పశువుల్లా పడి ఉండవలసిన పీడితులుగా దశాబ్దాల పర్యంతం మగ్గిపోతున్న దశ అది.

ఆ దశలో 'ప్రజాసంఘం'గా 'ఆంధ్ర మహాసభ'గా, 'గ్రామ రక్షకదళాలు'గా కమ్యూనిస్ట్ పార్టీ నేతృత్వంలో, రావినారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, ఆరుట్ల రామచంద్రారెడ్డి, పుచ్చలపల్లి సుందరయ్య, చంద్ర రాజేశ్వరరావు, రాజ్ బహాద్దూర్‌గౌర్, మగ్దూం మొహియుద్దీన్, తెలంగాణ టైగర్ నల్లా నరసింహులు వంటి వీరుల నాయకత్వంలో నిజాం ప్రతిఘటనోద్యమం సాయుధంగా మొదలై కార్చిచ్చులా వ్యాపించింది. ఈ ప్రతిఘటనోద్యమం తెలంగాణ 3000 గ్రామాలకు విస్తరించింది. భూమికోసం, భుక్తికోసం, తరతరాల విముక్తికోసం జరిగిన మహోధృత పోరాటాన్ని, రాజకీయ కుట్రల్లో



భాగంగా అడ్డుకున్నారు. తెలంగాణ నిజచరిత్ర తెలియని నెహ్రూ, భారత ప్రభుత్వం 'తెలంగాణా సాయుధ పోరాటం' నిజాం నిరంకుశ దుష్టపాలన నుండి విముక్తం చేసిన ప్రజల ప్రతిఘటన పోరాటంగా చూడలేకపోయారు. అలాకాక భారత యూనియన్ సైన్యాలను అడ్డుకుంటున్న భారత వ్యతిరేక శక్తులుగా పోరాటం చిత్రించబడింది. దాంతో నిషేధం, ఏరివేత, వేట...! మొదలైంది. గ్రామాలపై పాశవిక దాడులు. ఏండ్ల పర్యంతం ప్రజలపై హంలా... దౌర్జన్యాలు.

హైదరాబాద్ యావత్తూ భారతసైన్యాధిపతి జె.ఎస్.చౌదరి సైనికపాలనలో, 'ఒక్కవారంరోజుల్లో దక్కన్‌నుంచి కమ్యూనిస్టులను ఎర్రచీమల్లా ఏరిపారేస్తామని, నిశ్శేషం చేస్తామని ప్రకటించారు. సాయుధపోరాటయోధుల్ని లొంగిపొమ్మని లక్షల కరపత్రాలను విమానాల ద్వారా వేలగ్రామాలపై జారవిడిచారు. పార్టీ అగ్రనాయకత్వం నుండి ఏ దిశా నిర్దేశంలేని అనిశ్చితి. దిక్కుతోచని సందిగ్ధంలో దళాలకు దళాలు.. ఆత్మరక్షణకోసం ఆయుధాలతో సహా అడవుల్లోకి పరార్. అడవితల్లి.. అడవి రక్షకి... అడవి రెండుచేతులనూ చాచి అక్కున చేర్చుకున్న అమ్మ.

ఆరోజు బాగా జ్ఞాపకం తనకు.

ఖమ్మం దళంలో దళనాయకునిగా పనిచేస్తున్నాడు తన భర్త. సూర్యాపేటనుంచి రావాల్సివుంది. ప్రజా కంటకుడు విస్నూర్‌బాబుదొర యాభైమంది నిజాం పోలీసుల సహాయంతో జనగాం రైల్వేస్టేషన్‌నుండి హైదరాబాద్‌కు పారిపోతున్నాడనీ, ప్రజలను సమీకరించి మెరుపుదాడి చేసి హతమార్చాలని కొరియర్ ద్వారా ఉదయమే సమాచారం వచ్చింది.

అప్పుడు తను తమ స్వంత ఊరు కడివెండిలోనే ఉంది. తన ముప్పైమంది మహిళాదళసభ్యులతో ఉదయం నాలుగు గంటలకే ఉప్పెనై కదిలింది.

చుట్టుప్రక్కల అన్ని ఊళ్ళకు ఎగిసిపడే దావానలంలా వార్తను వ్యాపింపచేశాం. ప్రజా ప్రతిఘటన దండు కదిలింది. ఏకకాలంలో వడ్లకొండ, శామీర్‌పేట, పసరమడ్ల, ఎల్లంల, చీటకోడూర్, మరిగెడ్డ, చౌడారం, పెంబర్తి.. వగైరా గ్రామాల నుండి దాదాపు మూడువేల మంది ప్రజలు ఒక జనతుఫానై కదిలి, 'రావి నారాయణరెడ్డికీ జై', 'బద్దం ఎల్లారెడ్డికీ జై', 'మగ్ధుం మొహియుద్దీన్‌కూ జై', 'స్థాపిద్దాం స్థాపిద్దాం... ప్రజారాజ్యం స్థాపిద్దాం'... నినాదాలు.

'యువ కిశోరానివయ్యా... మా దొడ్డి కొమురయ్యా... మాకు ఊపిరివయ్యి... మము నడిపించే మహత్తరశక్తి నీవు కొమురయ్యా' అంటూ నిప్పులు మిసే స్త్రీల గొంతుల్లో పాటలు.

అప్పటికే వందలు, వేలుగా నేలకొరిగిన సాయుధపోరాట యోధుల మననంలో గర్జన "ఒక వీరుడు మరణిస్తే/వేలకొలది ప్రభవింతురు/ఒక నెత్తుటి చుక్కలోన/ప్రళయాగ్నులు ప్రజర్వి్ల్లు".



## కావాలనే టార్చర్ పెట్టారు

నటుడు ధనుష్‌కూ తనకూ మధ్య ఏదో సంబంధం ఉందంటూ వస్తున్న వార్తల్లో ఏమాత్రం నిజం లేదని అంటోంది అమలాపాల్. ధనుష్‌తో మూడు సినిమాలు చేయడంతో కావాలనే ఇలాంటి రూమర్లు పుట్టించి తనను టార్చర్ పెడుతున్నారని చెబుతోంది. అందరూ అనుకుంటున్నట్టుగా తమ మధ్య స్నేహబంధం తప్ప మరోబంధం లేదని స్పష్టం చేసింది. విజయ్‌తో విడాకుల తరువాత తన మానాన తను సినిమాలు చేసుకుంటూ ఉంటే ఇలాంటి పుకార్లు పుట్టించి టార్చర్ పెట్టడం ఎంత వరకూ సబబు అని ఆవేదన వ్యక్తం చేస్తోంది.

తాము జనగాం చేరేటప్పటికి భయంకరదృశ్యం. బాబుదొరను వెంటబడి కుక్కను తరుముతున్నట్టు ప్రజలు రైల్వేస్టేషన్ ప్లాట్‌ఫారంపై తరుముతున్నారు. ప్రజావెల్లువ చూచి భయపడి యాభైమంది పోలీసులూ చేతుల్లో తుపాకులతో రాతి బొమ్మల్లా నిలబడ్డారు చేష్టలుడిగి.

బాబుదొర ఉరికురికి పక్కన ఆగి ఉన్న మాల్‌గాడి దబ్బాలకింద నక్కి ముడుచుక్కూర్చుంటే.. ధర్మాపురం లంబాడితండా యువకులు తమ చేతి కర్రలతో పందిని పొడిచినట్లు పొడుస్తూ బయటికి లాగి చూస్తూ చూస్తుండగానే వందలమంది పైబడి బాబుదొర తలపగిలి చేతులు కాళ్ళు విరిగి శరీరమంతా నుజ్జునుజ్జవుతూ అంతా ఎర్రగా నెత్తురు చిమ్ముతూ.

అప్పుడు జ్ఞాపకమొచ్చింది. ధర్మాపురంలో ఈ బాబుదొర ఆనాడు జరిపిన అకృత్యం.

1947లో లంబాడితండా ధర్మాపురంలో దళసభ్యుడు హమునూ, అతని రెండవకొడుకు సోంలానూ మరో ఐదుగురిని తనతోపాటు నిజాం పోలీసులనూ, రజాకార్లనూ వెంటపెట్టుకునొచ్చి ఊరంతా చూస్తుండగా ఆ ఐదుగురితో ఐదు చితులు పేర్పించి ఒక్కోదానిపై ఒక్కోన్ని బలవంతంగా పడుకోబెట్టి చితులనంటించారు. మంటల్లో సజీవంగా ఆ ఐదుగురూ మలమలమాడి దహనమయ్యారు.

అప్పుడు చనిపోతూ అరచిన ఆ ఐదుగురు నిస్సహాయుల చావుకేకలు, ఆర్తనాదాలు ఇంకా తన చెవుల్లో ప్రతిధ్వనిస్తూనే ఉన్నాయి.

అప్పటి బాబుదొర అతి వికృత ముఖం, వాడి పరిహాసపూరితమైన నవ్వు, అహంకారం.....

దానికి ప్రతీకారమే ఇప్పుడు ప్రజల ప్రతిఘటన. కసి.. తరతరాల బానిస సంకెళ్ళు తెంచుకుంటున్న జనాగ్నిచ్చటల ధగధగలు.

క్షణాల్లో బాబుదొర కుళ్ళబొడిచిన కుక్కలా చచ్చిపోయాడు. జనం వాడి మృతశరీరాన్ని కాళ్లతో ఫుట్‌బాల్ వలె తన్నుతూ, దొర్లిస్తూ, రైల్వే ప్లాట్‌ఫాం పైకి తెచ్చారు. అప్పుడురికొచ్చింది, ఆనాడు ప్రాణాలుండగనే తన భర్తచేతనే చితిని పేర్పించి సజీవదహనం చేసి చంపిన సోంలా భార్య లంబాడి లచ్చిమి. అప్పుడామె అపరకాళీ మాత, మహిషాసురమర్దని, కాలభైరవి, నిప్పులు మిసే మృత్యురూపి.

వస్తూవస్తూనే వేలమంది చూస్తుండగా బాబుదొర శవంపైన, ముఖంమీద కూర్చుని తన లంగాను పైకిలాక్కుని ఉచ్చపోయడం మొదలుపెట్టింది. కళ్ళు మూసుకుంది ప్రశాంతంగా ఒక్కలిప్తకాలం. ఆ ముఖంలో ఒక దుర్మార్గుణ్ణి అంతంచేసి ఈ ప్రపంచాన్ని జయించిన తృప్తి...కసి...దాదాపు ఐదునిముషాలు చుట్టూ అందరూ ప్రసన్నవదనాలతో 'తగిన శాస్తి జరుగుతాంది లంజాకొడుక్కు' అని నిట్టూరుస్తున్న మహత్తర ఘటన.

అప్పుడొచ్చి తనప్రక్కన నిలబడ్డాడు తన భర్త నరసింహం. 'తెలంగాణ టైగర్'ను గమనించి కళ్ళనిండా చూచింది దాదాపు మూడునెలల తర్వాత. అప్పటికి తను పోలీసుపహారాలో ఒక బ్రిటీష్ డాక్టర్ సహాయంతో ఆడపిల్లను ప్రసవించడం, ప్రసవానంతరం మూడవరోజే సికిందరాబాద్ జైలుకు తరలించబడ్డం. హైదరాబాద్ డెన్‌లలో పనిచేస్తున్న మహిళా కామ్రేడ్స్ ప్రమీలాతాయి, బ్రిజ్‌రాణీ, జమాలున్నీసా బాజీ, రజియాబేగం, సుగుణమ్మ.... ఎందరు తల్లులో... వారి కన్నీళ్ళ సాహచర్యం, ఒక చిటికెడు సానుభూతితో నిండిన స్పర్శ.

పోరాటయోధునికి ఒక సాటిమనిషి చిరునవ్వే వెయ్యేనుగుల బలం.

ఆమె అలా సముద్రం దిక్కు చూస్తూనే ఉంది.

జ్ఞాపకం తెగిపోయింది. వర్షపు నీటి చూరు చుక్కలా.

కళ్ళు మూసుకుంది. 'ఎన్నేళ్ళ ఎడతెగని జీవిత పోరాటయానమో తనది. మూడవక్లాసు చదువుకుని, కడివెండిలోని తమపొలంలో నాట్లేసుకుంటూ, ఇంట్లో పనులు చూచుకుంటూ బతికే అతిమామూలు మహిళ తను. తన భర్తవల్ల కమ్యూనిస్టుగామారి, తన వ్యక్తిగత బాధలకన్నా ప్రజల కన్నీళ్ళు తుడవడం అంటే ఏమిటో తెలుసుకుంటూ, 'చైతన్యవంతురాలు అవుతూ, దళంలోచేరి, గెరిల్లా శిక్షణ, తిరుగుబాటు, ప్రతిఘటన.. పీడిత జననాయకత్వం.

మళ్ళీ ఒక జ్ఞాపకం... నిప్పుకణికవలె మెరుస్తూ.

**పంద్రాగస్టున దేశమంతటికీ విముక్తి లభించింది. కానీ తెలంగాణకు 13 నెలలు ఆలస్యమైంది. వెనక్కి తిరిగిచూస్తే, నలభయ్యోదశకంలో తెలంగాణ ఒక నిప్పుల కొలిమి. రాక్షస పీడనకు నిలయం. గ్రామాల ధ్వంసం, సజీవదహనాలు, వివస్త్రలనుచేసి స్త్రీలపై సామూహిక అత్యాచారాలు..! అదో ఘోరకలి. నాటి ప్రజాసైన్యం త్యాగాల యాది, ఆ విముక్తి ఫలాల తీరు తెన్నులు ఆ పండుటాకును అశ్రునయనగా మార్చాయి.**

ఆరోజు.. వెన్నెల రాత్రి.

బైరాన్‌పల్లిపై రజాకార్లూ, నిజాం పోలీసులూ కలిసి ఐదవసారి చాలా పకడ్బందీగా దాడిచేయబోతున్నట్టు సమాచారమొచ్చింది కొరియర్ వెంకటేశంతో. దళం అప్పుడు నీర్మాలలో ఉంది. ఆకునూరుమీదుగా ప్రయాణం. రాత్రి పదకొండు తర్వాత మొత్తం పదహారుమంది సభ్యులందరూ భుజాలపై తుపాకులు మోసుకుంటూ చీమల బారులా కదలిక.

శరత్కాలం చల్లనిగాలి. తన మెత్తని రబ్బర్ చెప్పుల్లోనుండి స ర్ ర్ ర్ న ఒక తుమ్మముల్లు గుచ్చుకుంది అరికాలులో. జివ్వున రక్తం కారుతున్న

అనుభూతి.. తెలుస్తోంది. తుమ్మచెట్ల బాట. తను బారుమధ్య ఉంది. ముందట ఏడుగురి అవతల దళనాయకుడు యాదగిరిరావు.

అడుగుతీసి అడుగేయగానే మరోముల్లు, ఇంకోకాలుకు ఇంకోముల్లు....నేలంతా తుమ్మముళ్ళు పరిచినట్టు అన్నీముళ్ళే. మిగతా కామ్రేడ్స్ అందరికీ తోలు బూట్లున్నై. తనకే రబ్బర్‌వి. ఐదు నిము షాల్లో... రెండు అరికాళ్ళలో దాదాపు పది పదిహేను దిగబడ్డ ముండ్లు... కారిపోతూ ఒకటే రక్తం... విప రీతమైన నొప్పి.. అవస్థ... ఎలా.. అరిచేందుకూ.. మాట్లాడేందుకూ దళాల నడకలో తామే విధించు కున్న నిశ్శబ్దంగా ఉండాలన్న నియమ నిబంధనలు.

పది నిమిషాలు సాగింది నడక.. ఊహు... ఇక తన వశం కావట్లేదు.. కాళ్ళు రెండూ నెత్తురోడుతూ తడిచి, భరించరాని నొప్పి, అడుగు తీసి అడుగు వేయలేని అవస్థ. నిబంధన ప్రకారం ఆపత్కాలంలో తనముందున్న కామ్రేడ్‌కు మెల్లగా గుసగుసగా విషయం చెప్పేందుకు పది నిమిషాలు పట్టింది. దళాలు మారుతున్నప్పుడు దళసభ్యులు కొత్త వాళ్ళుం టారు. ఎవరెవరో ఒకరికొకరు తెలియదసలు. అయినా క్రమశిక్షణలో ఒకే కుటుంబసభ్యులవలె ఒకటే కట్టు.

పావుగంట పట్టింది. తన పాదాలకు ఎన్నో ముండ్లు గుచ్చుకున్నాయని దళ నాయకునికి వార్త చేరేందుకు. అతను వెంటనే దళాన్ని ఒక చెట్టుకింద ఆపాడు చీకట్లో. తన దగ్గరున్న టార్చ్ లైటుతో గమ నిస్తే, మొత్తం పద్దెనిమిది ముండ్లు! ఒక్కొక్కటి రెండించులు. రబ్బర్‌బూట్ల నిండా ఎర్రగా నెత్తురు.

"తల్లీ ఎట్ల భరిస్తానవే అప్పటినుండి ఈ గోసను" అని ఏడ్చాడతడు. ఒక పదినిమిషాల్లో అందరూ కలిసి ముండ్లన్నింటినీ పీకేసి పాదాలను కడిగి దూదితో అద్ది, స్పిరిట్‌తో శుభ్రం చేసి, తనను ఒక్కొ క్కరే తమ భుజాలపై మోశారు. దాదాపు ఏడు కిలోమీటర్లు రాత్రంతా.

మనుషుల్లో ఇంత ఐకమత్యం, కట్టు, అపరిచిత వ్యక్తుల మధ్య ఒకరికొకరం అన్న మానవీయభా వన. పార్టీ నేర్పిన విలువలు, క్రమశిక్షణ అది.

వాళ్ళ భుజాలపై ఉన్నంతసేపూ కన్నీళ్ళే ధారా పాతంగా.

కింద పాదాల్లో అరికాళ్లనిండా ఊరుతున్న రక్తం కన్నా కళ్ళలో నుండి కారుతున్న కన్నీళ్ళే ఎక్కువ.

తెల్లారేసరికి బైరాన్‌పల్లి ఊరుదగ్గరి పొలాల్లో మకాం. వడ్ల మల్లేశం కొరియర్ కోసం నిరీక్షణ.

***

మర్నాడు ప్రపంచం కళ్ళు నులుముకోకముందే, తెల్లారకముందే మూడువందలమంది పోలీసులూ, రజాకార్లూ డిప్యూటీ కలెక్టర్ ఎక్బాల్ హుస్సేన్ నాయకత్వంలో వచ్చి, వచ్చీరాగానే చారిత్రాత్మక మైన ఊరు బురుజుపై దాడి ప్రారంభించాడు. ఆ ఊరు దళనాయకుడు, ఆర్గనైజర్ మురళీధర్‌కు రాత్రి వేళల్లో ఊళ్ళో ఎవరూ ఉండకూడదని, అందరూ తమతమ పొలాల దగ్గరే నిద్రించాలనీ చెప్పింది పార్టీ. కాని అది పాటించలేదు. అందువల్ల ఊరు ప్రజలను ఆక్రమించి, ఇండ్లు తగులబెడుతూ, భయంకర బీభత్సం సృష్టించారు రజాకార్లు. కానీ సుశిక్షితులైన ఆ ఊరి స్థానికదళం బైరాన్‌పల్లి బురుజు పైకి చేరి, తాము తయారుచేసుకున్న బెజ్జాయితో వీరోచితంగా ప్రతిఘటించింది. వర్షం కురుస్తున్న ఆ రోజంతా పోరాడి పోరాడి... చివరకు లొంగిపోకత ప్పని దయనీయ పరిస్థితుల్లో, ఊరు ప్రజలందరినీ.. స్త్రీ పురుషులతో సహా చెట్లకుకట్టి, ఆడవాళ్ళను వివ స్త్రలను చేసి నగ్నంగా తమ మగవాళ్ళ ముందే బతుకమ్మలాడించి చెరిచి చివరికి దాదాపు 84 మందిని కాల్చి చంపింది.

తమ దళం కూతవేటు దూరంలో ఉన్నా ఏమీ చేయలేని దీనావస్థ.

ఆ రాత్రి అంతా ముగిసి రజాకార్ల ముష్కరమూకలు గ్రామం విడిచి వెళ్ళిపోయిన తర్వాత తాము వెళ్ళి పరిస్థితిని గమనిస్తే,

ఊరు ఊరంతా శ్మశానమే. కాలుతూ పొగలు చిమ్ముతున్న ఇండ్లు. రక్తసిక్తమై తడిచిన బురుజు ముందటి నేల, గుట్టలు గుట్టలుగా శవాలు, చెట్లకు కట్టేయబడి అలాగే కాల్చబడ్డ మగవాళ్ళ మృతదేహాలు, నగ్నంగా చెరచబడి, కత్తులతో చీల్చబడి అత్యాచారం జరుపబడ్డ స్త్రీల విగత శరీరాలు.

చూస్తుంటే ఒళ్ళు గగుర్పొడిచే దుఃఖ బీభత్సం.

ఒక్క బైరాన్‌పల్లే కాదు, ఆకునూరు, కూటికల్లు, జఫర్‌గఢ్, పర్కాల, కొడకండ్ల, దేవరుప్పల గ్రామా లకు గ్రామాలనే భీతావహం చేస్తూ సాగిన ఊచ కోతల్లో వందలకు వందలమంది ప్రాణాలు కోల్పో యారు.

కోళ్లకన్నా హీనంగా మనుషుల పీకలు కోసే యడం, కాల్చడం... ఒక అఖండ మారణకాండ.

ఆ జ్ఞాపకాలన్నీ మదిలో కదిలేనే హృదయ మంతా ఒక భూమిపుండై, నిప్పులచెరువై, కళ్ళ నిండా నీళ్ళు సముద్రాలై ఇప్పటికీ....

మర్నాడే తన భర్త నరసింహులు అరెస్ట్‌వార్త. అరెస్టై ఆయనపడ్డ బాధలు అసంఖ్యాకం. గోళ్లలో సూదులు గుచ్చుడు... ఆసనరంధ్రాల్లో కారం దట్టించి

## సాయి పల్లవికి తెలివి లేదా?

టాలీవుడ్‌లో చాలామంది నోట ఇదే మాట వినపడుతోంది. 'ఫిదా' తరువాత సాయి పల్లవికి డిమాండ్ ఒక్కసారిగా పెరిగి పోయింది. మిగతా హీరోయిన్లు ఆమెను చూసి భయపడే పరిస్థితి! ఇలాంటి సమయం లోనే మిగతా హీరోయిన్లు తమ పారితోషి కాన్ని విపరీతంగా పెంచేసి 'దీపముండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి' అన్న చందంగా వ్యవ హరిస్తుంటారు. కానీ సాయి పల్లవి మాత్రం తన రెమ్యునరేషన్ అందరికీ అందుబాటులో ఉండే విధంగానే చూసుకుంటోంది. 'ఫిదా'కి ముందు ఆమె సినిమాకి 30 లక్షలు మాత్రమే తీసుకునేది. ఈ సినిమా తరువాత 70 లక్షలు అడుగుతోందట! రెమ్యునరేషన్ తక్కువగా ఉండడం, ఆమె ఉంటే సినిమా హిట్ అన్న టాక్ రావడం వంటి కారణాలతో టాలీవుడ్‌లో చిన్నా పెద్దా దర్శకనిర్మాతలు ఆమె ఇంటి ముందు క్యూ కడుతున్నారట! ఈ అవకా శాన్ని క్యాష్ చేసుకోకుండా సాయి పల్లవి ఆచి తూచి వ్యవహరిస్తోందనీ, ఓ విధంగా చెప్పా లంటే తెలివిలేకుండా వ్యవహరిస్తోందని కొందరు అంటున్నారు.



రూళ్ళకర్ర చొప్పించడం, తలకిందులుగా వ్రేలాడదీసి వీపుచిట్లేట్లు కర్రతో కొట్టడం, తాగడానికి నీళ్ళివ్వ కుండా మట్టిచిప్పల్లో ఎవరి మూత్రం వాళ్ళే పోసు కుని వాళ్ళచేతనే తాగించడం....ఎంత నరకయాతనో.

అయినా కామ్రేడ్స్, ఒక్కనాడూ ఏ ఆచూకీ చెప్పకపోవడమే పోరాటం పట్ల వారికున్న నిబద్ధత, నిజాయితీ.

నరసింహులుపై కోర్టు కేసులు, జైలు శిక్షలు, మళ్ళీ బయటికి రావడాలు, మళ్ళీ అరెస్టులు, మళ్ళీ చిత్రహింసలు...ఉరిశిక్ష మొదటిసారి.

బెయిల్‌కోసం, పెరోల్‌కోసం పార్టీ నాయకత్వం జరిపే న్యాయపోరాటం జాతీయ స్థాయిలో సుప్రీంకోర్టుదాకా బాంబే లాయర్లు డేని యల్ లతీఫ్, గణేశ్‌గార్ల అనర్గళ వాదన. జైల్ నుండి బయటికి రాగానే.. మళ్ళీ అడవుల్లోకి. తనది ఒక దళం. ఆయనది మరో దళం. అప్పుడప్పుడు తామి ద్దరూ ఒకే దళంలో... అలా రాష్ట్ర కమిటీ ఏది చెపితే అదే శిరోధార్యం.

తెలంగాణా పోలీస్‌యాక్షన్‌కోసం యూనియన్ గవర్నమెంట్ రెండులక్షల సైన్యం పంపితే, సాయుధు లైన తెలంగాణ పోరాటయోధులు నెహ్రూ ప్రభు త్వాన్ని పడదోయాలని కుట్రచేస్తున్నారన్న నెపంతో పార్టీని నిషేధిస్తూ యాభైవేల అత్యాధునిక ఆయు ధాలున్న యూనియన్ మిలిటరీని కామ్రేడ్స్ అంద రినీ జంతువుల్లా వేటాడి చంపడానికే వినియోగిస్తూ. అప్పుడే అటు నల్లమల అడవులు.. ఇటు రాచకొండ గుట్టలు... ఆదిలాబాద్ అడవులు.. కెరిమిర్ ఘాట్స్... క్రూర జంతువుల మధ్య.. విషకీటకాల మధ్య. ఎన్ని కష్టాల్లో, ఎంత హింసో..

పట్టుబడ్డే జైళ్ళల్లో ఎంత నరకమో. మొత్తం ఆరుసార్లు అరెస్టై, బెయిల్‌మీద విడుదలవుతూ మళ్ళీ పోరాటంలోకే. ప్రజలంటే ఎంత మక్కువో, దేశ్‌ముఖ్‌ల దౌర్జన్యాలను ఎదిరించి ఈ ప్రజలకు నిజమైన శాంతిపూర్వక జీవితాలనందించాలని ఎంత తహతహో. నరసింహులుకు మూడుసార్లు ఉరిశిక్ష ఖరారై, అవి యావజ్జీవ కారాగార శిక్షలుగా మారుతూ, మొత్తం ఆయన జీవితంలో జైళ్ళలో గడిపిందే పద్నాలుగేళ్ల ఐదునెలలు. తను మూడు సంవత్సరాల రెండు నెలలు. 1951లో చెప్పాచేయ కుండా 'తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం' విరమించమని పార్టీ ఆదేశిస్తే, తనూ, తనభర్త నర సింహులు వంటి అనేకానేకమంది కామ్రేడ్స్ గుండె పగిలి, నిరుత్తరులై, కన్నీటి సముద్రాలై....

చివరికి 1952లో జరిగిన మొదటి జనరల్ ఎన్ని కల్లో కమ్యూనిస్టులు ప్రజాస్వామ్యయుతంగా పోటీ చేసి ఇన్నాళ్ళూ ప్రజలమధ్య, ప్రజలకోసం జీవించిన నిజాయితీకలిగిన యోధులుగా భారతప్రధాన మంత్రి నెహ్రూకంటే కూడా అత్యధిక మెజారిటీతో కామ్రేడ్ రావి నారాయణరెడ్డి గెలిచారు. చివరకు ఏమి మిగిలింది? జమీందార్లందరూ, దేశ్‌ముఖ్‌లం దరూ కాంగ్రెస్ కండువాలుకప్పుకుని గ్రామాలకు తిరిగి వచ్చి మళ్ళీ గోముఖవ్యాఘ్రాలై...! శిథిలం, సర్వమూ విచ్ఛిన్నం, అంతాభ్రష్టత, స్వరాజ్యంలో పరమవికృత అవినీతికర స్వదుష్టపాలన. జీవిత మంతా ఈ నేలకోసం దీనజన వెట్టి విముక్తికోసం దాదాపు పదిలక్షల ఎకరాలభూమిని పేదరైతులకు పంచిన 3000 తెలంగాణ గ్రామాలను విముక్తం చేసిన 4000 మంది అమరులైన కామ్రేడ్స్‌ను కోల్పో యిన గతాన్ని మిగిల్చింది. మౌనదుఃఖం, నిశ్శబ్ద అశ్రుధార.

### భీష్మ సినిమా పద్యాలకు వన్స్‌మోర్



'ఆ రోజుల్లో శ్రీకాకుళం థియేటర్లో భీష్మ సినిమా (1944) ప్రదర్శిస్తున్నారు. ఒక జమీం దారుగారు ఆ సినిమా చూస్తూ యుద్ధ ఘట్టంలో సి.యస్.ఆర్ పద్యానికి 'వన్స్ మోర్' అన్నారు. ఆ కేక వేసింది జమీం దారుగారు అని తెలియగానే ప్రొజె క్టర్‌లో రీలు వెనక్కి తిప్పి, ఆ పద్యాన్ని మళ్ళీ ప్రదర్శించారట! ఆ రోజు నుంచీ ఆ పద్యం రాగానే జనం 'వన్స్‌మోర్' అనటం, థియేటర్‌లో మళ్ళీ రీలు వెనక్కి తిప్పి ప్రదర్శించడం మామూలైంది' అని 'స్వర్ణాంధ్ర వైతాళికులు' పుస్తకంలో సి.యస్.ఆర్ పూర్వ స్మృతులు పేర్కొన్నాయి.

*సేకరణ: ఎన్.తారకరామారావు*

నరసింహులు లేడు, ఏ గుర్తింపూ పొందకుండానే తనదారినతాను స్వర్గలోకాలకు వెళ్ళిపోయాడు.

ఉద్యమంలో, పోలీస్ నిర్బంధంలో ఆరోజు భీమదేవరపల్లి దవాఖానాలోకన్న తనకూతురు, ఇప్పుడు బొంబాయిలో వలసపక్షిగా జీవిస్తూంటే... ఇక్కడ ఆశ్రయం తీసుకుని...

అసలు జీవితం ఏమిటి?

ఏమిటి ఈ జీవితం?

ఆమె కళ్ళు మూసుకుంది అప్రయత్నంగానే. ఎందుకో కన్నీళ్ళు జలజలా జారాయి.

అప్పుడే బడి నుండి వచ్చిన ఆమె మనుమడు తన మొబైల్‌ఫోన్ తెచ్చి "అమ్మమ్మా ఈ వీడియో చూడు" అని చూపించాడు.

ఆ రోజు 26 జనవరి.

ఒక ఏడెనిమిదేళ్ళ పసికుర్రాడు తనచేతిలో పది పన్నెండు పుల్లలున్న జాతీయజెండాలు పట్టుకుని ఉత్సాహంగా పరుగెత్తుకుంటూ వచ్చి ఒక కాలేజీ కుర్రాడికి ఒక జెండా అందివ్వబోయాడు.

ఊహూ.. వాడు తీసుకోలేదు! బిజీగా ఉన్నాడు తన మొబైల్ ఫోన్‌తో.

అటు ఇంకొక దిక్కు ఉరికి మెట్లపై కూర్చున్న ఒక యువతికిచ్చాడు ఒక జెండాను.

ఊహూ...! ఆమె తీసుకోలేదు. ఏదో బూతు పుస్తకం చదువుతోంది బిజీగా.

ఒక బ్రిడ్జిపై నిలబడ్డ ఇద్దరు యువకులకు రెండు జెండాలు అందించాడు. ఊహూ! వాళ్ళూ తీసుకోలేదు. వాళ్ళు చేతుల్లో చెరోసీసాతో 'బీర్' తాగుతున్నారు. ఉరికురికి ఒక పార్క్ బెంచీపై కూర్చున్న ఒక దాదాపు ఎనభైఏళ్ళ వృద్ధుడికి ఒక జెండా ఇచ్చాడు. అతను ఆ పసివాడి కళ్ళల్లోకి సాలోచనగా, ప్రేమగా ఓ క్షణంసేపు చూచి ఒక జెండా తీసుకుని, ఎందుకో చటుక్కున ఒక వంద రూపాయల నోట్ ఇచ్చాడు.

కాని ఆ కుర్రాడు తీసుకోలేదు. ఒక తృప్తికర మైన నవ్వువిసిరి గెంతులేస్తూ పరుగుతీశాడు. నిటా రుగా, సగర్వంగా, రెపరెపలాడుతూ, ఆకాశంలో ఎగురుతున్న భారత జాతీయపతాకాన్ని ప్రేమగా స్పృశిస్తూ చూస్తూ. ఆమెకళ్ళలో ఎందుకో కన్నీళ్ళు ముంచుకొస్తుండగా,

ఆమె మెదడులో ఏదో ఠప్పున తెగిపోయినట్టు, బల్బ్‌లోని ఫిలమెంట్ రాలిపోయినట్టు, లోపల గాలి పటం దారమేదో అప్పుడే తెగిపోయినట్టు అని పించింది. కళ్ళు తెరిస్తే ఇక ఆమెకు ఏదీ జ్ఞాపకం రావడం లేదు. అసలు తను ఎక్కడుందో, తను ఎవరో, తన పరిసరాలేమిటో, దేశం, ప్రజలు, దేశ స్పృహ, మనుషులు, మానవ సంబంధాలు.....ప్చ్... ఇవేవీ తెలియడం లేదామెకు.

"అమ్మమ్మా.. అమ్మమ్మా" అని కుదుపుతున్నాడు మనుమడు.

ఆమె సకల జ్ఞాపకాలూ కోల్పోయి పిచ్చిగా చూస్తోంది ఈలోకాన్ని.

***సెల్: 93901 09993***






## డాగ్ కాప్!



నేరస్థుల ఆచూకీ కనుగొనడానికి కుక్కలకు శిక్షణ ఇచ్చి, వాటిని నేరపరిశోధనలో ఉపయోగించుకుంటారు పోలీసులు. కానీ ఓ శునకాన్ని మాత్రం ఏకంగా పోలీస్‌ని చేసేశారు. ఆశ్చర్యంగా ఉంది కదూ!

కొలంబియా, బొగోటా నివాసి అయిన నికోలస్ అలెజాండ్రో వాల్టోరస్ మిలటరీలో పనిచేసేవాడు. ఒకనాడతనికి రోడ్డు మీద వెళుతుండగా ఓ కుక్క కనిపించింది. దాన్ని ఇంటికి తీసుకువచ్చి, చక్కగా శిక్షణ ఇచ్చి, పోలీస్ ఫోర్స్‌లో చేర్పించాడు. ఇప్పుడా శునకం చక్కగా బొగోటా వీధులలో బైక్‌పై వెళుతూ పెట్రోలింగ్ చేస్తుంటుంది. ఒక్క బైకే కాదు, గుర్రంపై స్వారీ చేస్తూ, అవసరమైతే నడిచి వెళ్తూ తన డ్యూటీని చక్కగా నిర్వర్తిస్తుంది. అంతే కాదు ఈ బుల్లి పోలీస్ శునకానికి పోలీస్ యూనిఫామ్ కూడా ఇచ్చారు. అన్నట్టు ఆ పోలీస్ కాప్ పేరు చెప్పలేదు కదూ... ప్యాన్జర్ అజుల్!

## ఊగే వంతెన



మామూలుగా ఒక ఊరినుంచి ఇంకో ఊరికి వెళ్ళాలంటే రైలునో, బస్సునో ఆశ్రయిస్తారు. కానీ ఆ ఊరికి వెళ్ళాలంటే మాత్రం వంతెన మీద నడక సాగించాల్సిందే. రెండు ఊళ్ళ మధ్య నిర్మించిన ఈ వంతెన మీద నడవాలంటే ఎంతో గుండె ధైర్యం కావాలి.

స్విట్జర్లాండ్, రాండా మునిసిపాలిటీలోని గ్రెచెన్, జెర్మట్ అనే ఊళ్లను కలుపుతూ ఓ వంతెనను నిర్మించారు. పాదచారుల కోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన ఈ ఊగే వంతెన 1,620 అడుగుల పొడవుతో ఉంటుంది. ప్రపంచంలోనే అతి పొడవైన ఊగే పాదచారుల వంతెనగా రికార్డు కొట్టేసింది. నేలపై నుంచి 278 అడుగులు అంటే దాదాపు 28 అంతస్తుల ఎత్తులో ఉండే ఈ వారధిపై నడవడమే ఓ సాహసం. దీని తయారీకి 10 వారాల సమయం పట్టిందట. ఈ ఎత్తయిన, పొడవైన వంతెనపై నడుస్తుంటే అచ్చం గాల్లో నడుస్తున్న వింత అనుభూతి కలుగుతుంది. పర్యాటకులను కూడా తెగ ఆకర్షించేస్తుంది ఈ వంతెన.

## దేశాన్ని చుట్టేస్తున్నారు

ఆ జంటకు అడ్వెంచర్ గోల్ఫ్ అంటే చాలా ఇష్టం. ఎంతిష్టమంటే వారు తమదేశంలో ఉన్న గోల్ఫ్ కోర్సులన్నింటినీ చుట్టేస్తున్నారు. సరదాగా ఆడేస్తున్నారు.

యూకేకి చెందిన ఎమిలీ, రిచర్డ్ గాట్‌ఫ్రీడ్ జంటకి గోల్ఫ్ క్రీడ అంటే ఇష్టం. 2006లో వారిద్దరూ కలిసి సౌత్‌సీ ట్రిప్‌కి వెళ్ళారు. అక్కడ అడ్వెంచర్ గోల్ఫ్‌లో రిచర్డ్ గెలిచాడు. ఇంటికి తిరిగి వచ్చాక కూడా ఆ విజయానందం వారిని వదిలిపెట్టలేదు. దాంతో ఆన్‌లైన్‌లో సెర్చ్ చేసి, యూకేలో ఎన్ని గోల్ఫ్‌కోర్సులున్నాయో అన్నిటినీ ఓ పట్టుపడదామని అనుకున్నారు. కట్‌చేస్తే ఇప్పటివరకు 743 దాకా మీనియేచర్, అడ్వెంచర్.... ఇలా ఎన్నో రకాల గోల్ఫ్ కోర్సులను చుట్టేస్తూ, ఆనందాన్ని సొంతం చేసుకుంటున్నారు. 800 మార్కు దాటాలని వారి లక్ష్యం. లక్ష్యాన్ని సాధించడానికి ఇంకా గోల్ఫ్ కోర్సులు ఎక్కడెక్కడున్నాయో ఆన్‌లైన్‌లో వెతుకుతూనే ఉన్నారు.




## వెల్‌కం టు ఫ్లెమింగో మ్యూజియం

ఒక్కొక్కరికి ఒక్కో హాబీ ఉంటుంది. ఆ బామ్మ గారికి కూడా ఓ హాబీ ఉంది. ఎవరా బామ్మగారు? ఏమా హాబీ అనుకుంటున్నారా? అమెరికాలోని ఫ్లోరిడా రాష్ట్రంలో ఉన్న ఒకాలో ఆ బామ్మగారి నివాసం. పేరు కిండీ డన్లో. ఆమెకు ఓ ఫోటోఫ్రేముల దుకాణం ఉంది. దానిముందు 'వెల్‌కం టు ద అఫీషియల్ ఫ్లోరిడా ఫ్లెమింగో మ్యూజియం' అని రాసుంటుంది. ఆ షాపులోని ముందుగదిలో ఫ్లెమింగోలు వరుసగా పేర్చి ఉంటాయి. ఫ్లెమింగోలంటే నిజమైన ఫ్లెమింగో పక్షులు కాదు. బొమ్మలు...! అవంటే కిండీ బామ్మగారికి చాలా ఇష్టమట. అందుకే ఫ్లెమింగో బొమ్మలను సేకరించడం మొదలుపెట్టింది. అలా ఇప్పటివరకు ఆమె దగ్గర 865 బొమ్మలు పోగయ్యాయిట. తన దగ్గరున్న బొమ్మల్లో ఐదడుగులపైగా ఎత్తున్న పెద్ద ఫ్లెమింగో బొమ్మంటే తనకెంతో ఇష్టమని చెబుతోంది ఆ బామ్మ. ఈమధ్యనే ప్రపంచంలో ఎక్కువ ఫ్లెమింగో బొమ్మల సేకరణ అంటూ గిన్నిస్‌బుక్ వారు ఆమెకు రికార్డు కట్టబెట్టేశారు.



## పక్షుల ప్యాలెస్‌లు



పల్లెటూళ్ళలో కూడా చెట్లు కూలిపోతున్నాయి. గుడిసెలు, పెంకుటిళ్ళ స్థానంలో డాబాలు వెలుస్తున్నాయి. దాంతో పక్షులు గూళ్ళ ఏర్పాటుకు స్థలం వెతుక్కోవాల్సిన పరిస్థితి. కానీ టర్కీలో పక్షులకు అలా కాదు. అవి ఎంచక్కా మహారాజా ప్యాలెస్‌లలో ఉండొచ్చు. టర్కీకి చెందిన కొన్ని తెగలు పక్షులు అదృష్టాన్ని తెస్తాయని నమ్ముతారు. ఈ విశ్వాసమే పక్షులు మహారాజా ప్యాలెస్‌లలో నివసించే భోగాన్ని కల్పించింది. 18వ శతాబ్దంలో ఈ నమ్మకం ఎక్కువగా ఉండేదిట. అందుకే ఇళ్ళు, గ్రంథాలయాలు, కార్యాలయాలు...ఒక్కటేమిటి అన్నింటిపైనా వాటికోసం ప్రత్యేకంగా ఇళ్ళు నిర్మించేవారు. అంతేకాదండోయ్...ఈ ప్యాలెస్‌లలో బాల్కనీలు, కిటికీలు, గోపురాలు ఇలా సర్వహంగులూ ఉంటాయి. అద్భుతమైన ఆర్కిటెక్చర్‌తో చూపరులను ఇట్టే ఆకట్టుకుంటాయి. ఆ పక్షుల ప్యాలెస్‌లను చూస్తే ఆహా! మహారాజా భోగం అనుకోక మానరు.

–నర్మద వాసిరెడ్డి







# కదలదు, మెదలదు!

**ఒక్కో రాష్ట్రం చేజారిపోతున్నా, బీజేపీ దూసుకుపోతున్నా కాంగ్రెస్ నాయకత్వంలో మాత్రం స్పందన లేకపోగా, గందరగోళంగా, అయోమయంగా తయారవుతోంది.**

గత రెండేళ్ల నుంచీ కాంగ్రెస్ పార్టీ గందరగోళంలో ఉంది. దేశ సమస్యల మీదా, రాజకీయ అంశాల మీదా ప్రజలను ఎలా సమీకరించాలో కూడా ఆ పార్టీకి అంతుబట్టడం లేదు. ఒకపక్క బీజేపీ ఒక్కో రాష్ట్రాన్ని తమ గుప్పిట్లోకి తీసుకుంటుండగా, కాంగ్రెస్ అందుకు దీటుగా స్పందించలేకపోగా, ఆందోళనతో తల పట్టుకు కూర్చుంటోంది. నితీశ్ కుమార్ ఫిరాయించబోతున్నట్టు కాంగ్రెస్ పార్టీకి ముందుగానే తెలుసు. అయినా బిహార్ బీజేపీ చేతుల్లోకి వెళ్లిపోయింది. ముందుగా తెలిసినా ఆ పార్టీ ఎందుకు ఊర్కుంది? అది ఆ పార్టీకే తెలియాలి. గోవా కూడా ఇదే విధంగా చేజారిపోయింది. నిజానికి గోవాలో కాంగ్రెస్ ఎక్కువ సీట్లు గెలుచుకుని అధికారంలోకి రాగల స్థితిలో ఉంది. అయినా, ఎందుకో కాలయాపన చేసింది. ఆకలిగొన్న బీజేపీ కబళించడానికి వస్తోందని అర్థమై కూడా అది అడుగు ముందుకు వేయలేకపోయింది. చివరికి చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్టయింది.

గుజరాత్‌లో శంకర్ సిన్హ్ వాఘేలా ఆకస్మిక నిష్క్రమణతో మరో రాజకీయ సంక్షోభానికి ఆజ్యం పోసింది. అక్కడ ఆరుగురు కాంగ్రెస్ ఎమ్మెల్యేలు పార్టీకి గుడ్‌బై చెప్పడంతో అహ్మద్ పటేల్ రాజ్యసభ ఎన్నిక కావడమనేది సమస్యల్లో పడింది. దాంతో ఆ పార్టీ మిగిలిన కాంగ్రెస్ శాసనసభ్యుల మీద కూడా అనుమానం పెంచుకుని, వారందరినీ తమ పార్టీ ప్రభుత్వమున్న కర్ణాటకకు పంపించేసింది. విచిత్రమేమిటంటే, గుజరాత్‌లో బీజేపీ పరిస్థితి అధ్వానంగా ఉందని గుజరాతీలు కూడా భావిస్తుంటారు. తమ పట్టు, పలుకుబడి తగ్గిపోతోందని బీజేపీ ఆందోళన చెందుతున్న ఆ రాష్ట్రంలో కాంగ్రెస్ నాయకత్వం తనకు తానుగా గందరగోళ పరిస్థితులు సృష్టించుకుంది.

గత రెండేళ్లుగా గుజరాత్‌లో అనేక ఆందోళనలు చెలరేగుతున్నాయి. ఈ ఆందోళనల్లో లక్షలాది మంది పాల్గొంటున్నారు. పటేల్‌లకు రిజర్వేషన్ల కోసం హార్దిక్ పటేల్ ఆధ్వర్యంలో జరుగుతున్న పతీదార్ ఆందోళన, దానికి ప్రతిగా అల్పేశ్ ఠాకూర్ ఆధ్వర్యంలో పెద్ద ఎత్తున ఓబీసీ క్షత్రియుల ఆందోళన, జిగ్నేశ్ మేవానీ నాయకత్వంలో దళితుల ఆందోళన, వజ్ర వ్యాపారులు, జౌళి వ్యాపారుల ఆందోళన, జీఎస్టీ అమలు అనంతరం సూరత్‌లో లక్షలాది మంది వ్యాపారుల ఆందోళన ఇందులో కొన్ని. ఈ ఆందోళనలు, ర్యాలీలు, నిరసనలు బీజేపీ విధానాలకు వ్యతిరేకంగా జరుగుతున్నవే. అయితే, ఇందులో ఒక్క ఆందోళనకు కూడా కాంగ్రెస్ నాయకత్వం వహించడం లేదు. పైన పేర్కొన్న ముగ్గురు యువ నాయకులను పక్కనపెట్టి ఆలోచిస్తే, అసలు నాయకుడే లేకుండా జరుగుతున్న ఆందోళనల సంఖ్య కూడా తక్కువేమీ కాదు.

## చేజారుతున్న అవకాశాలు

దీన్ని బట్టి చూస్తే, రాజకీయాంశాల మీద ప్రజలను కూడగట్టడం ఎలాగో కాంగ్రెస్‌కు ఏమాత్రం అంతుబట్టడం లేదని అర్థమైపోతుంది. మహాత్మా గాంధీ ఈ రాష్ట్రంలో బర్దోలీ సత్యాగ్రహం వంటి ఆందోళనలకు ఎన్నిటికో నాయకత్వం వహించారు. అంటే ఈ కాంగ్రెస్ పార్టీ కనీసం గాంధీజీ నుంచి కూడా ఏమీ నేర్చుకోలేదని భావించాల్సి వస్తుంది. నిజానికి ఈ రాష్ట్రంలో కాంగ్రెస్ ఇంత చప్పగా చతికిలబడిపోవాల్సిన అవసరం లేదు. తమ పార్టీ శ్రేణుల్ని, పార్టీ అభిమానుల్ని కూడగట్టినా పాలక బీజేపీకి పక్కలో బల్లెంలా మారి ఉండేది. గుజరాత్‌లో కాంగ్రెస్‌కు 30 శాతం ఓట్ల బలం ఉంది. మరో రెండు మూడు శాతం ఎక్కువ ఓట్లు తెచ్చుకోగలిగితే తేలికగా అధికారానికి రాగలుగుతుంది. అందుకు ఈ ఆందోళనలు ఎంతో అవకాశం కల్పించి ఉండేవి. ఇందులో ఒక్క ఆందోళనకు కాంగ్రెస్ నాయకత్వం వహించినా ఆ పార్టీ ఇమేజ్ ఇనుమడించేది. కానీ, రాష్ట్రం అట్టుడుకుతున్నా కాంగ్రెస్ నాయకత్వంలో ఎక్కడా కదలికే కనిపించకపోవడం గుజరాతీలను సైతం ఆశ్చర్యానికి గురి చేస్తోంది.

ఇన్ని ఆందోళనలు జరుగుతున్నా బీజేపీ చీకూ చింతా లేకుండా తన పని తాను చేసుకుంటూ పోతుండడానికి కారణం కాంగ్రెస్ అసమర్థతే అని చెప్పక తప్పదు. ఇక్కడ బీజేపీకి తిరుగులేకుండా ఉంది. అయితే, ప్రజాస్వామ్యంలో ఏ పార్టీ అంత తిరుగులేని స్థితిలో ఉండలేదు. కాంగ్రెస్‌లో చైతన్యం లేకపోయినా, ప్రజల్లో చైతన్యం వస్తే అది పాలక పక్షానికి పగ్గాలు వేయడమే అవుతుంది. కాంగ్రెస్




అధికారంలో ఉన్న కర్ణాటకలో మాత్రం బీజేపీ ఆత్మరక్షణ చేసుకోవాల్సిన పరిస్థితిలో ఉంది. బీజేపీని అదుపులో పెట్టడానికి అక్కడి ముఖ్యమంత్రి సిద్ధరామయ్య తన చాణక్య రాజనీతినంతా ప్రయోగిస్తున్నారు. ఆయన బెంగళూరులో హిందీ వ్యతిరేక ఉద్యమాన్ని ప్రోత్సహిస్తున్నారు. ఇది బీజేపీని ఇరకాటంలో పెట్టే అంశం. బీజేపీకి మూల స్తంభం లాంటి ఆర్ఎస్ఎస్ హిందీకే ప్రాధాన్యమిస్తుంటుంది. అందువల్ల ఈ రాష్ట్రంలో హిందీ వ్యతిరేక ఉద్యమం గురించి అనుకూలంగా గానీ, వ్యతిరేకంగా గానీ బీజేపీ ఒక్క మాట కూడా మాట్లాడే స్థితిలో లేదు.

ఇక తమను హిందూ మతస్థులుగా కాకుండా ప్రత్యేక మతంగా గుర్తించాలని కోరుతూ లింగాయత్‌లు ఇక్కడ ఓ ఆందోళన చేస్తున్నారు. లింగాయత్‌లు గనుక తనకు అభ్యర్థన పంపిస్తే తాను వారిని ప్రత్యేక మతస్థులుగా గుర్తించాలని కోరుతూ కేంద్ర ప్రభుత్వానికి ప్రతిపాదన పంపించగలనని

సిద్ధరామయ్య ఇప్పటికే ఓ ప్రకటన చేశారు. ఈ ప్రకటన సహజంగానే అటు హిందువుల్లోనూ, ఇటు బీజేపీలోనూ అలజడి రేకెత్తించింది. వాస్తవానికి ఇక్కడి లింగాయత్‌లు బీజేపీకే మద్దతు ఇస్తున్నారు. ఆ పార్టీ నాయకుడు బీఎస్ యెడ్యూరప్ప లింగాయతే. అయితే, లింగాయత్‌లను ప్రత్యేక మతంగా గుర్తించడానికి బీజేపీ గానీ, ఆర్ఎస్ఎస్ గానీ సిద్ధంగా లేవు. దాంతో ఈ ఆందోళన మీద కూడా బీజేపీ పల్లెత్తు మాట కూడా అనలేని స్థితిలో ఉంది. ఇవి చాలవన్నట్టు, సిద్ధరామయ్య తమ కర్ణాటక రాష్ట్రానికి ప్రత్యేక జెండా కావాలంటూ డిమాండ్ చేసి బీజేపీని మరింతగా ఇరకాటంలో పెట్టారు.





## పనికిరాని ఆలోచనలు

దీన్ని బట్టి అర్థమవుతున్నది ఏమిటంటే, ఆందోళనలు చేయడం, వివిధ రాజకీయ, ప్రజా అంశాలపై ప్రజలను సమీకరించడం కాంగ్రెస్ పార్టీకి తెలిసిన విద్యే. అయితే, ఇతర రాష్ట్రాల్లో అది సకాలంలో ఎందుకు స్పందించలేకపోతోందన్నది మాత్రం అర్థం కావడం లేదు. ఈ పార్టీ కనీసం ఇతర పార్టీలను చూసైనా ప్రజలను సమీకరించడం ఎలా అన్నది గుర్తు చేసుకోవాలి. ప్రజాస్వామ్య దేశంలో రాజకీయ, సామాజిక అంశాలమీద ప్రజలను సమీకరించడమన్నది ప్రతి రాజకీయ పార్టీకి క్షుణ్ణంగా తెలిసి ఉండాలి. బహుజన్ సమాజ్ పార్టీ అధినేత మాయావతి వంటి నాయకురాలు కూడా ఇప్పుడు ప్రజలను కూడగట్టడంలో మునిగిపోయి ఉన్నారు. కాంగ్రెస్ ఇప్పటికైనా తన రాజకీయ గందరగోళం నుంచి బయటపడి ఆలోచించడం నేర్చుకోవాలి.

సకాలంలో సరైన విధంగా స్పందించకపోవడం, ప్రజా సమీకరణను పక్కన పెట్టడం వంటి అంశాలు కాంగ్రెస్ అస్తిత్వాన్నే ప్రశ్నార్థకం చేస్తున్నాయి. కాంగ్రెస్ 'అస్తిత్వ సంక్షోభం'లో ఉందంటూ ఆ పార్టీ సీనియర్ నాయకుడు జైరామ్ రమేశ్ సైతం వ్యాఖ్యానించడం గమనార్హం. ప్రధాని నరేంద్ర మోదీ, బీజేపీ అధ్యక్షుడు అమిత్ షా ద్వయం నుంచి వస్తున్న సవాళ్లను ఎదుర్కోవడానికి కాంగ్రెస్ నాయకులు సమష్టిగా కృషి చేయాలంటూ ఆయన పిలుపునిచ్చారు. ఇదివరకటిలా పని చేయడం అనేది మోదీ, షాల విషయంలో ఇక చెల్లదని, కాంగ్రెస్‌లో దూకుడుతనం పెరగాలని ఆయన భావిస్తున్నారు. 1977లో, ఆ తర్వాత 1996 నుంచి 2004 వరకూ కాంగ్రెస్ ఎన్నికల సంక్షోభం ఎదుర్కొందని, మోదీ, షాల కారణంగా ఇప్పుడు అస్తిత్వ సంక్షోభం ఎదుర్కుంటోందని ఆయన ఆందోళన వ్యక్తం చేశారు. బీజేపీ పాలిత రాష్ట్రాల్లో మోదీ వ్యతిరేక గాలులు వీచక తప్పదనీ, మున్ముందు ఆ పార్టీకి తిప్పలు తప్పవనీ, అప్పుడు ప్రజలు తమ వైపే మొగ్గు చూపుతారనీ తమ అగ్రనాయకులు కొండంత ఆశలు పెట్టుకుని ఉన్నారని పార్టీ వర్గాలు అభిప్రాయపడుతున్నాయి. అయితే, ఇటువంటి ఆలోచనలు తమకు ప్రతికూలంగా మారతాయని అవి ఆందోళన చెందుతున్నాయి.

> **ప్రజాస్వామ్యంలో బలమైన ప్రతిపక్షం ఉండాలి. ప్రజా సమస్యలపై ప్రభుత్వాన్ని నిలదీయాలి. దేశ రాజకీయ, సామాజిక అంశాలపై ప్రజలను సమీకరించాలి. ఈ సమీకరించే విద్య ప్రతి రాజకీయపార్టీకి తెలిసి ఉండాలి. కానీ గత రెండేళ్ళుగా గందరగోళంలో ఉన్న కాంగ్రెస్‌పార్టీ అది విస్మరించింది. సకాలంలో స్పందించడంలేదు. అవకాశాలున్నప్పటికీ ప్రజాందోళనలకు నాయకత్వం వహించడంలేదు!**

వచ్చే రెండేళ్ల కాలంలో దేశంలో అనేక శాసన సభలతో పాటు, పార్లమెంట్‌కు కూడా ఎన్నికలు జరగబోతున్నాయి. ఇటువంటి సమయంలో కాంగ్రెస్ తన పార్టీలోని అస్థిరతను, అనిశ్చితిని తొలగించుకునే ప్రయత్నం చేయాలి. ప్రజా సమస్యల పరిష్కారంలోనే కాకుండా, తాము పటిష్టంగా తయారు కావడానికి కూడా పాత నినాదాలు, పాత సిద్ధాంతాలు, పాత సూత్రాలు, పాత మంత్రాలు పనిచేయవని అర్థం చేసుకోవాలి. బీజేపీ వంటి పార్టీని ఒకే వ్యక్తి నాయకత్వంతో ఎదుర్కోవడం జరిగే పని కాదు. ఆ మంత్ర దండం కాంగ్రెస్ నుంచి ఏనాడో మాయమైపోయింది. ఇప్పుడు సమష్టి ప్రయత్నమే అవసరం. సమష్టి నాయకత్వంతోనే బీజేపీకి పగ్గాలు వేయడం సాధ్యమవుతుందని ఆ పార్టీ ఇప్పటికైనా గ్రహించాల్సి ఉంటుంది. జైరామ్ రమేశ్ అన్నట్టు కాంగ్రెస్ పట్ల ప్రజల్లో ఇంకా అభిమానం ఉంది. అయితే ప్రజలు కాంగ్రెస్‌ను కొత్త రూపంలో చూడాలనుకుంటున్నారు.



## చతికిలబడ్డ నాయకత్వం

ఉపరాష్ట్రపతిగా ఎం. వెంకయ్య నాయుడు గెలుస్తారన్నది ఊహించిన విషయమే. అయితే, ప్రతిపక్షాలు ఆశించినదానికన్నా వాటి అభ్యర్థి గోపాలకృష్ణగాంధీకి తక్కువ ఓట్లు రావడం అనూహ్య పరిణామం. సుమారు పాతిక మంది ప్రతిపక్ష ఎంపీలు వెంకయ్య నాయుడుకే ఓటు వేయడం విశేషం. కొద్దిరోజుల క్రితం రాష్ట్రపతి ఎన్నికలు జరిగినప్పుడు కూడా ఇలాగే కొన్ని ప్రతిపక్షాల ఓట్లు ఎన్‌డీఏ అభ్యర్థి రామ్‌నాథ్ కోవింద్‌కు పడడం గమనించాల్సిన విషయం. అంటే ప్రతిపక్షాలన్నీ ఏదో రూపేణా ఒత్తిడికి గురవుతున్నట్టు భావించాలి. ఉపరాష్ట్రపతి పదవికి వెంకయ్య నాయుడు ఎన్నిక కావడం ఎన్డీఏకు అత్యంత ప్రధానం. ఉత్తర భారతదేశంలో ఒక్కో రాష్ట్రాన్నీ తన గుప్పిట్లోకి తీసుకుంటున్న ఎన్డీఏ ప్రభుత్వానికి దక్షిణాదిలో కూడా పట్టు దొరకాలంటే దక్షిణాది వ్యక్తికి, అందులోనూ అపర చాణక్యుడు లాంటి వెంకయ్య నాయుడుకు ఈ పదవిని కట్టబెట్టడం అనివార్యంగా కనిపించింది.

ప్రజాస్వామ్యం పటిష్టంగా ఉండాలంటే ప్రతిపక్షం కూడా పాలక పక్షానికి దీటుగా ఉండాలి. కానీ, 2014 నుంచి ప్రధాన ప్రతిపక్షం కాంగ్రెస్ పార్టీ తన పాత్రను తాను సరిగ్గా నిర్వర్తించలేకపోతోంది. లోక్‌సభ ఎన్నికల తర్వాత సంస్థాగతంగా పరిపుష్టం కావడానికి ప్రయత్నించాల్సిన కాంగ్రెస్ పార్టీ ఒక్కో రాష్ట్రంలో క్రమంగా క్షీణించిపోతోంది. రాష్ట్రాల తీరుతెన్నులను గమనించినా, రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి ఎన్నికల ఫలితాలను పరిశీలించినా కాంగ్రెస్ పరిస్థితి ఏ విధంగా ఉందో అర్థమైపోతుంది. బీజేపీ నాయకత్వంలోని ఎన్డీఏ కొత్త ప్రయత్నాలు, కొత్త చర్యలు, కొత్త పథకాలు చేపట్టకపోయినా పరవా లేదు. కాంగ్రెస్ తనను కూడగట్టుకోనంతవరకూ ఎన్డీఏ భవిష్యత్తుకు ఢోకా లేదనిపిస్తోంది.

**మన దగ్గర కాదుగానీ, ఆగ్రా, మథుర వంటి ఉత్తర భారతదేశ పట్టణాల్లో 'అంగూరీ పేఠా' అని దొరుకుతాయి. రసగుల్లా మాదిరిగానే ఉంటాయి. వాటిని మంచి మధుర రసాలలో నానబెట్టి అమ్ముతారు. యాలకులు, జాఫ్రానీ, పిస్తా వాసనలతో ఘుమఘుమలాడుతూ గోళీ సైజుల్లో ఉండే వాటిని అప్పుడే ఫ్రిజ్‌లోంచి తీసిన మంచుగోళాల్లాంటి వాటిని కొరికి తింటుంటే ఆ చల్లటి మధుర రసం నోట్లోకి ఊరుతుంది. దానికి సువాసన తోడై అవి నోట్లో కరుగుతుంటే స్వర్గానికి బెత్తెడు దూరంలో ఉన్నట్టనిపిస్తుంది.**

నేను ఢిల్లీలో చదువుతున్నప్పుడు వాటిని రుచి చూశాను. కానీ, నా కౌగిలిలో బంధించబడిన నా రాగిణి అధరాలు మాత్రం అంతకంటే మధురంగా ఉన్నాయి. 'అంగూరీ పేఠా' రాగిణి పెదాల ముందు బలాదూర్.

'అంగూరీ పేఠాలు' కేవలం జిహ్వకు రుచిని ఇస్తాయి. కానీ, రాగిణి అధరామృతం మాత్రం నాలో నరనరాన్ని ఉత్తేజపరిచే అడ్రినలిన్‌ను నింపింది.

మా ఇద్దరి మధ్య దూరడానికి సందులేక, శాస్త్ర విరుద్ధంగా, కాంతి కిరణాలు, ఋజుమార్గం వదిలి, పక్క దారి చూసుకున్నాయి.

ఇంతలో బయట మళ్ళీ వర్షం మొదలైంది. కానీ, లోపల అప్పటికే జలపాతాలు పొంగడం మొదలైంది.

ఆ క్షణంలో ఏ ఆలోచనలు లేవు, ఆలింగనాలు తప్ప.

ఆ క్షణంలో ఏ అభ్యంతరాలు లేవు, పరిష్వంగాలు తప్ప.

ఆ క్షణంలో ఏ దిగుళ్ళూ లేవు, పడుచువాళ్ళ కౌగిళ్ళు తప్ప.

'స్వరరాగ గంగా ప్రవాహమే....' అని జేసుదాస్ ఒక పాట పాడి సంగీత ప్రియులను సంగీత సాగరంలో ఓలలాడించాడు.

అలాగే మేమిద్దరమూ సుమధుర గాఢ గాంధర్వ ప్రక్రియలో, అంతంలేని ప్రేమమయ ప్రవాహంలో కొట్టుకుపోయాము.

కాలాలు స్తంభించిపోయాయి.

దేహాలు విజృంభించి పోరాడాయి.

ఇద్దరం ఆ మోహ, సమ్మోహన ప్రభావం నుండి తేరుకునేసరికి కాలాతీతమైపోయింది.

తమిళ అమ్మాయితో, పెళ్ళికి ముందే, వాళ్ళింట్లోనే శోభనం జరిగిపోయింది.

"ఏయ్! పాపాత్ముడా! ఏం చేశావ్?" అంది రాగిణి మంచం మీద నుండి లేస్తూ. తన నుదుటి మీద, ఒంటి మీద, పడ్డ కష్టానికి గుర్తుగా చిరుస్వేదం మెరుస్తోంది.

"నేనా? బయట వర్షం పడుతోంది కదా! అందుకని కొంత సెక్సర్‌సైజ్ చేశాను. చూడు ఎంత చెమట పట్టిందో!" అన్నాను, ఆమె ఛాతీమీద పట్టిన చెమటను తుడుస్తూ.





11

# లాకర్ నెం. 369



-ప్రభాకర్ జైని సెల్: +91 90308 83785

"ఛీ! దుర్మార్గుడా!" అంటూ నవ్వుతూ, నైటీ వేసుకుంది. టీషర్టూ, బెర్ముడా వదిలేసింది.

"ఏంటి తెలుగు సినిమా పేర్లు పెట్టి తిడుతున్నావు. దుర్మార్గుడు, పాపాత్ముడు అని," అని,

"ఎందుకు డ్రెస్సు మార్చుతున్నావ్? అవే బాగున్నాయి కదా?" అన్నాను.

"నీకు తెలియదులే?" అంది.

"అంటే?" అన్నాను అనుమానంగా.

నా జీవితంలో అత్యంత మధురమైన ఘట్టం అకస్మాత్తుగా, అనూహ్యంగా, ఏ ప్రిపరేషన్స్ లేకుండా, అత్యంత సహజంగా, వర్షపు చినుకు సముద్రంలో పడ్డంత సుందరంగా జరిగిపోయింది.

అది కేవలం శరీరాలు సంగమించిన ఘటన కాదు.

మా జీవితాలు చిరకాలం పెనవేసుకుపోయే అద్భుత సంఘటన.

నాకైతే కించిత్తు పశ్చాత్తాపం లేదు. కానీ, రాగిణి బాధపడుతుందేమోనన్న ఆలోచన నా మదిలో మెదిలింది. అందుకే, తనను దగ్గరకు తీసుకుని కళ్ళల్లోకి చూస్తూ,

"బాధ పడుతున్నావా? ఆర్యూ అఫ్రైడ్?" అడిగాను లాలనగా.

"ఛ ఛ! పిచ్చోడా!" అంది.

"నువ్వు నా దానివి! ఎప్పుడంటే అప్పుడు పెళ్ళి చేసుకుందాం!" అన్నాను.

"నాకా భయం లేదు. నాకు ఇష్టం లేకపోతే నువ్వు ఇంట్లోకి అడుగు పెట్టేవాడివా? నా ఒంటిమీద చెయ్యి వేసేవాడివా? అసలు..." సిగ్గుపడింది.

ఆమె సిగ్గుపడడాన్ని చూసి,

"ఆc.... అసలు? ఏంటి చెప్పు?" అన్నాను.

"నువ్వు నిన్ననే వస్తావనుకున్నాను?" అంది.

నేను విస్తుపోయాను. బుర్ర గోక్కున్నాను. రాగిణికి ఉన్న తెగువ కూడా నాకు లేదన్న విషయం అర్థమై సిగ్గుపడ్డాను.

"అరే యార్! నిజమే. నేనెంత బుద్ధూగాణ్ణి! నిజం చెప్పాలంటే నాకైతే ధైర్యం చాలలేదురా. మరి నువ్వైనా ఫోన్ చేయొచ్చు గదరా?" అన్నాను తనను దగ్గరకు తీసుకుని మురిపెంగా ముద్దు పెట్టుకుంటూ.

తను హాయిగా నా ఒళ్ళో పడుకుని,

"అమ్మాయిని. నేనెలా చేస్తానురా?"

నిన్న సాయంత్రం ఆరుగంటల పన్నెండు నిమిషాలకు నా చేయి మొదటిసారిగా, కాన్షియస్‌గా ముట్టుకుంది. తరువాత ముప్పై నిమిషాలకు నా చేతిని తన వక్షం మీద ఉంచుకుంది. తరువాత ఐదు నిమిషాలకు నన్ను కౌగలించుకుని నాకు ముద్దు పెట్టింది. ఆ తరువాత నేను ఆమెను నా గాఢ పరిష్వంగంలో బంధించాను.

అటువంటిది, ఇరవై ఆరు గంటల తర్వాత, ఇప్పుడు, నా ఒళ్ళో పడుకుని ఉంది.

బయట వర్షం, మా అపూర్వ సంగమానికి సంతోషబాష్పాలు రాలుస్తున్నట్టుగా, చిన్నగా పడుతోంది. వేడెక్కిన మా శరీరాలు సేదదీరడానికి, చిరుగాలి చల్లగా వీస్తోంది.

ఆ దృశ్యం ఎంత మనోహరంగా ఉందంటే ఇక్కడ, ఈ క్షణమే, కాలం ఫ్రీజ్ అయిపోతే, ఒక అద్భుత జీవనచిత్రం లిఖింపబడి ఉండేది.

ఇద్దరి శరీరాలు అలసిపోయాయి. అయినా మనసులు తృప్తితో పొంగి పొర్లుతున్నాయి. సంతోషాలు ఓవర్ ఫ్లో అవుతున్నాయి.

"ఇందాక ఒక ప్రశ్న అడిగావ్, గుర్తుందా?" అని అడిగింది రాగిణి.

"నేనా? ఏం ప్రశ్న?" అన్నాను బుర్ర గోక్కుంటూ.

రాగిణి నా దగ్గరికొచ్చి నన్ను ముద్దులతో ముంచెత్తి,

"నువ్వు నిజంగా బుద్ధూవేరా?" అంది.

నేను ఏ ప్రశ్న అడిగానా అని ఆలోచనలో పడిపోయాను. తను నాపక్కన కూర్చుని,

"నువ్వు డ్రెస్సు ఎందుకు మార్చుకుంటున్నావ్ అని అడిగితే నీకు తెలియదులే అని నేనన్నాను కదా!" అని అంది.

"అవును, ఆ డ్రెస్ ఎందుకు మార్చావ్? అందులో మస్తు సెక్సీగా ఉన్నావ్ కదా?" అన్నాను.

రాగిణి నవ్వుతూ,

"ఇందుకు!" అని ఒక్క బటన్ తీయగానే నైటీ కుప్పకూలిపోయి, బంగారుబొమ్మ ప్రత్యక్షమైంది.

అవును, అంతకుముందు ఆ నిక్కరో, బెర్ముడానో, దాన్ని విప్పడానికి నానా తంటాలు పడాల్సి వచ్చింది. టీషర్ట్ అయితే, గుండీలు పీకేస్తే గానీ

## జరిగిన కథ

ఇంటర్నేషనల్ సెక్యూరిటీ ఏజెన్సీలో పని చేసే ఆ అధికారి, మాకనూరులో జరిగిన బ్యాంకు దోపిడీ కేసును ఛేదిస్తాడు. ఆ సందర్భంగా ఏర్పాటు చేసిన పార్టీలో, రామస్వామిని చూసి, గతస్మృతులలోకి వెళ్ళిపోతాడు. కష్టపడి బ్యాంకులో ఉద్యోగం సంపాదించిన అతనికి అక్కడి వాతావరణం నచ్చదు. ఏ డిపార్ట్‌మెంట్‌లో వేసినా, అక్కడి లొసుగులను బయటకు లాగుతుంటాడు. స్కేల్ టూ ఆఫీసర్‌గా ప్రమోషన్ వస్తుందతనికి. స్టెనో ఆఫీసర్ రాగిణితో సాన్నిహిత్యం పెరిగి, వాళ్ళింటికి వెళతాడతను. ఆ తర్వాత...

విప్పలేకపోయాను. నైటీలో ఉన్న ఆ సౌకర్యం, బ్రహ్మ చారిగాణ్ణి, నాకేం తెలుసు?

ఈసారి వెన్నెట్లో గోదారిలా, శాంతంగా, ప్రశాంతంగా గడిపేశాము.

అరగంటలో పొగలు కక్కే కమ్మటి తమిళ భోజనం వడ్డించింది. నేను ఆవురావురుమంటూ తిన్నాను. ఇంటి భోజనం, కమ్మటి ప్రియురాలు వడ్డిస్తుంటే తినే అదృష్టానికి మురిసిపోయాను.

భుక్తాయాసంతో సోఫాలో కూర్చున్నప్పుడు,

"మరేమంటావ్?" అంది రాగిణి.

"ఏంటి?" అన్నాను నేను ఆశ్చర్యంగా.

"అదే, కింద నైట్ వాచ్‌మన్ డ్యూటీ చేస్తానంటే చెప్పు. సెక్యూరిటీ వాళ్ళకు చెబ్తా!" అంది చిలిపిగా నవ్వుతూ.

నేను ఉడుక్కుని,

"ఓయ్! నా బ్యూటీ ముందు అయితేనే ఏ డ్యూటీ అయినా!" అన్నాను.

"అయితే ఏం వద్దులే! ఇంక వెళ్ళు! బాగుండదు" అంది.

టైం పన్నెండు కావస్తోంది.

నాకు వెళ్ళాలని లేదు. కానీ పద్ధతి కాదు. రాగిణిని వదలలేక వదలలేక వదిలి బయల్దేరాను.

"రేపు ఆఫీసుకు వస్తావా?" అని అడగడమే మరిచిపోయాను.

పరామర్శించడానికి వచ్చి, వలపు వర్షాలలో తడిచి వెళ్తున్నాను.

***

బ్యాంకులో అలజడి ప్రారంభమైంది.

జెడ్ఎం నాతో మాట్లాడడమే మానేశాడు.

నిజానికి లోను మంజూరు చేయడం వరకే మా బాధ్యత. లోన్ శాంక్షన్ చేయడంతో ఆ ప్రతిపాదన వరకు మా పాత్ర ముగిసిపోతుంది. ఆ లోనుకు సంబంధించి వసూళ్ళు సరిగ్గా జరుగుతున్నాయా, మనం విధించిన షరతుల ప్రకారం వసూలు జరుగుతోందా లేదా అన్నది నాకు సంబంధించని విషయం. ఆ లోన్ రికవరీ విషయాన్ని ఆ బ్యాంక్ మేనేజర్, జోనల్ ఆఫీసు రికవరీ సెక్షన్, హెడ్డాఫీసు చూసుకుంటుంది.

కానీ, కొన్ని పెద్ద కంపెనీల వ్యవహారాలు, ఒక్క రోజుతో, ఒక్క లోనుతో ఆగిపోవు.

ఒక్కో మల్టీనేషనల్ సంస్థ గానీ, ఒక్కో మెగా కార్పొరేట్ సంస్థ గానీ, ఏక కాలంలో, అంటే, సైమల్టేనియస్‌గా అనేక ప్రాజెక్టులు చేపడుతుంది. ఒక్కో ప్రాజెక్టు కోసం, ఇన్‌కం టాక్స్ చట్టంలోని వెసులుబాట్లను, లొసుగులను అవగాహన చేసుకున్న ఛార్టెర్డ్ అకౌంటెంట్ల సలహాలను అనుసరించి, ఒక్కో కొత్త కంపెనీని, కొద్దిమంది డైరెక్టర్లను నామ్ కే వాస్తేగా మార్చి, ఎస్టాబ్లిష్ చేస్తారు. మూలవిరాట్టులు మాత్రం వాళ్ళే ఉంటారు.

ఆ కంపెనీలన్నీ ఒకే కార్పొరేట్ సంస్థకు చెందినవిగా ప్రజల దృష్టిలో, ప్రభుత్వం దృష్టిలో చెలామణీ అయినా సాంకేతికంగా మాత్రం అంటే బ్యాంకుల్లో అనేక కంపెనీలపేర్ల మీద కాంట్రాక్టులు జరిగిపోతుంటాయి.

ఆ కార్పొరేట్ సంస్థలకు బ్యాంకర్లుగా వ్యవహరించే బ్యాంకే ఆయా కంపెనీలు చేపట్టే ప్రాజెక్టులకు కూడా లోను మంజూరు చేయాల్సి ఉంటుంది. ఒక వేళ ఋణ మొత్తం వందలు, వేలకోట్లలో ఉంటే, రిజర్వ్ బ్యాంక్ గైడ్‌లైన్స్ ప్రకారం, ఐదారు బ్యాంకులు కలిసి, అంటే, కన్సార్షియంగా ఏర్పడి ఆ లోన్ మంజూరు చేస్తారు.

అటువంటప్పుడు, ఆ సంస్థ ట్రాక్ రికార్డ్, సిబిల్ రేటింగ్స్ చూడాల్సి ఉంటుంది. అంతకు ముందు మంజూరు చేసిన ఋణాల రీపేమెంట్ షెడ్యూలును కరెక్టుగా పాటించి లోన్ మొత్తాన్ని తిరిగి చెల్లించిన సంస్థలకు సులభంగా లోన్ మంజూరు చేస్తారు.

ఇక్కడే రాజకీయాలు, ఒత్తిళ్ళు, ప్రలోభాలు ప్రభావితం చేస్తాయి.

మన దేశంలో రాజకీయాలు, పరిశ్రమలు, వ్యాపారాలు, నేరాలు కలిసిపోయి కలగాపులగంగా ఉన్న ఒక వ్యవస్థ ఏర్పడి ఉంది.

వాళ్ళ కనుసన్నల్లోనే పనిచేసే న్యూస్ పేపర్లు, టీవీ ఛానళ్ళతో పాటూ ప్రభుత్వాన్ని ప్రజలను ప్రభావితం చేసే ఇతరత్రా ప్రసార సాధనాలు అన్నీ ఉన్నాయి. న్యాయవ్యవస్థ పనితీరు కూడా ఏమంత ఆశాజనకంగా లేదు.

**రెండు మూడు రోజుల్లో బ్యాంకుల కన్సార్షియం మీటింగ్ ఉంది. అంతా అనుకున్నట్టు జరిగితే ఆ మీటింగ్‌లోనే తను పెట్టే ప్రపోజల్‌కి గ్రీన్‌సిగ్నల్ వస్తుందని కలలు కన్నాడా ఎంపీ. తమకు ప్రమోషన్లు వస్తాయని కలల లోకంలో విహరిస్తున్నారా అధికారులు. కానీ వారి కలలన్నీ కల్లలయ్యాయి. ఒకేఒక్కడు ఇచ్చిన మెమో వారి ఆశలపై నీళ్ళు జల్లింది. ఇంతకీ ఏమిటా ప్రపోజల్? ఎవరు ఎవరికి మెమో ఇచ్చారు?**

అందుకే, రాజకీయవేత్తలుగా ఎదిగిన పారిశ్రామికవేత్తలకు, బ్యాంకులంటే తమ పెరట్లో పాతిపెట్టిన లంకెబిందెలుగా కనిపిస్తాయి. అడిగినప్పుడల్లా లక్షలు, కోట్లు మా జెడ్ఎం లాంటివాళ్ళు వాళ్ళ ఇంటికి తీసుకెళ్ళి ఇస్తుంటారు.

ఉన్నవాడి ఇంట్లో ఇన్‌స్టాల్ చేసిన ఏటీఎంలా, వాడు, ఎప్పుడు కావాలంటే అప్పుడు డబ్బులు డ్రా చేసుకుంటూనే ఉంటాడు.

లేనివాడికీ, మధ్య తరగతి వాడికే ఈ రూల్సన్నీ. పదివేల లోను కోసం వెళితే, కొల్లాటెరల్ సెక్యూరిటీ అంటే తనఖా ఏం పెడతావని ఒక మిడిల్ క్లాస్ వ్యాపారినో, మహిళా ఉద్యోగినో అడిగే బ్యాంకు మేనేజర్ పదివేల కోట్ల రూపాయలు అప్పనంగా, అతి వినయంగా పెద్దోళ్ళ ఇంటికి వెళ్ళి పంచి పెట్టి వస్తాడు.

ఎందుకంటే, బ్యాంకు టాప్ మేనేజ్‌మెంట్ పోస్టులన్నీ రాజకీయ నాయకుల, ఫైనాన్స్ డిపార్ట్‌మెంట్ అధికారుల చేతుల్లో ఉంటాయి. ఎంత పెద్ద బ్యాంకు ఛైర్మన్ అయినా కేంద్ర ఫైనాన్స్ డిపార్ట్‌మెంట్‌లోని చిన్న అధికారి దయాదాక్షిణ్యాలపై ఆధారపడాల్సిందే. కేంద్రంలో ఏ పార్టీ అధికారంలో ఉంటే వారి చెప్పు చేతల్లోనే బ్యాంకు ఉన్నతాధికారులు ఉంటారు. బ్యాంకు బోర్డ్ ఆఫ్ డైరెక్టర్లను కేంద్రప్రభుత్వమే నియమిస్తుంది. వాళ్ళే బ్యాంకు పాలసీలను రూపొందిస్తారు. అందుకే, బ్యాంకులు అధికార పార్టీల టంకశాలలుగా మారిపోయాయి.

అట్లాంటి, కోట్లకు పడగెత్తిన ఒక రాజకీయవేత్త కం పారిశ్రామికవేత్త కం బిల్డర్ కం సినిమా నిర్మాత, ఎంపీ బాలగోపాల్, మా జెడ్ఎంకు గురుతుల్యుడు.

ఈ రామస్వామికి జనరల్ మేనేజరుగా ప్రమోషన్ ఇప్పిస్తానని లొంగదీసుకున్నాడు అతను.

అతను, ఒక విద్యుత్ ప్రాజెక్టు లైసెన్స్ కోసం ప్రయత్నాలు సాగిస్తున్నాడు. దానికోసం మా బ్యాంకు నుండే, నేను లోన్ సెక్షనుకు రాకముందే, ఇన్‌ప్రిన్సిపుల్, అంటే సూత్రప్రాయంగా, లోన్ ఇస్తామనే ఆమోద పత్రం కూడా తీసుకెళ్ళి ఇచ్చి వచ్చారు మా జెడ్ఎంగారు.

పాతదే అయినా అన్ని కాలాల్లో, అన్ని దేశాల్లో, అన్ని రంగాల్లో ఉపయోగపడే సామెత ఒకటి ఉంది.

అదే, 'వడ్డించేవాడు మనోడైతే...'

ప్రభుత్వ యంత్రాంగంలో వడ్డించేవాడు మనోడైతే, ఏ ఫైలూ ఎక్కడా ఆగదు. ఆ వడ్డించే వాడెవడో వాణ్ణి పట్టుకుంటే చాలు, నువ్వు విందు బంతిలో చివర కూర్చున్నా నీకు మృష్టాన్న భోజనం వడ్డించబడుతుంది.

అందుకే ఆ బాలగోపాల్ ఫైలు చకచకా పరుగులు తీసింది. కొన్ని లైసెన్సులు వచ్చేశాయి. ఇక లోన్ శాంక్షన్ చేసే సమయం ఆసన్నమైంది. జూబ్లీ హిల్స్‌లోని బ్రాంచి నుండి లోన్ ప్రపోజల్ జోనల్ ఆఫీసుకు రానే వచ్చింది.

ఈ లోపల, ప్రగతి నిరోధకుణ్ణైన నేను, అడ్వాన్స్ సెక్షన్ మేనేజరుగా, ఛార్జ్ తీసుకున్నాను.

మా జెడ్ఎం గొంతులో వెలక్కాయ పడ్డట్టయింది. కారణం, విద్యుత్ ప్రాజెక్టుకు సంబంధించిన మూడు వేల కోట్ల ప్రపోజల్ పెండింగ్‌లో ఉంది. అది కూడా రాత్రికి రాత్రే, పాత డేట్లతో, శాంక్షన్ అయిపోయేదే కానీ రిజర్వు బ్యాంక్ ఉత్తర్వుల ప్రకారం అంత మొత్తం ఏ ఒక్క బ్యాంకూ, ఏ ఒక్క కంపెనీకీ మంజూరు చేయకూడదు. ఒక ఐదారు బ్యాంకులు కలిసి కన్సార్షియంగా ఏర్పడి అప్పు ఇవ్వాలి.

అలా చేయాలంటే, ఆ ఐదారు బ్యాంకుల మేనేజర్లూ, నిపుణులూ, ఆడిటర్లూ కూర్చుని విధి విధానాలను తయారు చేయాల్సి ఉంటుంది.

బాలగోపాల్ ఎంత ఎంపీ అయినా, పలుకుబడి ఉన్న రాజకీయ నాయకుడైనా, అన్ని బ్యాంకుల అధికారులను మేనేజ్ చేయడం అతని వల్ల కాదు. ఆయా బ్యాంకుల బోర్డ్ ఆఫ్ డైరెక్టర్ల ప్రాధాన్యాలు, ప్రలోభాలు వేరే ఉంటాయి.

అందుకే అతని పనులు ఆఘమేఘాల మీద జరగలేదు. ఈ ఐదారుమంది బ్యాంకు అధికారులు కలిసి, చర్చించి, ప్రపోజల్‌ను క్షుణ్ణంగా పరిశీలించి ఒప్పుకుంటేనేగానీ, మూడువేల కోట్ల రూపాయల లోన్ ప్రపోజల్ నుండి ఒక్క రూపాయి కూడా బయటకు రాదు.

అటువంటి, క్రూషియల్ టైంలో, అంటే ఫైలు

మంచి రసకందాయంలో ఉన్నప్పుడు, నేను రంగంలోకి ప్రవేశించానన్నమాట.

ఈ మొత్తం లోన్ ప్రపోజల్ మా బ్యాంకు నుండి ప్రారంభమైంది కాబట్టి, ఐదారు బ్రాంచిల కన్సార్టియంకు నేనే కన్వీనర్‌గా వ్యవహరించడం ఆనవాయితీ. ఈ కన్సార్టియం కన్వీనర్‌గా నేను అతి ముఖ్య భూమిక నిర్వహించవలసి ఉంటుంది.

అందుకే, ఈ మూడువేల కోట్ల ఋణ ప్రతిపాదన గురించి క్షుణ్ణంగా విశ్లేషణ చేశాను.

'అన్నీ తప్పుల తడకలే. అసలు ఈ విద్యుత్ ప్రాజెక్టుకు పర్యావరణ మంత్రిత్వ శాఖ అనుమతులే లేవు. అందుకే దానిమీద ప్రతిపక్ష పార్టీవాళ్ళు గ్రీన్ ట్రిబ్యునల్‌లో కేసు వేశారు. అది ఎటూ తేలలేదు. ఇంత పెద్ద థర్మల్ పవర్ ప్రాజెక్టుకు, బొగ్గు కంపెనీలు కనీసం ఐదేళ్ళ వరకు రా మెటీరియల్ సప్లై చేసే అగ్రిమెంట్ ఉండాలి. అది కూడా లేదు. అలాగే, ఈ విద్యుత్ కేంద్రంలో ఉత్పత్తి అయిన విద్యుత్తును కొనుగోలు చేస్తామని రాష్ట్రప్రభుత్వంతో ఒక PPA (విద్యుత్ కొనుగోలు ఒప్పందం) చేసుకోవాలి. అది కూడా లేదు.'

ఈ విషయాలన్నీ తొక్కి పట్టి, అత్యంత గోప్యంగా ఉంచి ఫైలు నడిపించారు.

నేను, విద్యుత్ ప్రాజెక్టులకు లోన్ శాంక్షన్ చేసే ముందు ఏయే జాగ్రత్తలు తీసుకోవాలో, ఏయే అంశాలపై దృష్టి సారించాలనే విషయాలను నెట్‌లో వెతికి పట్టుకున్నాను. ఏ జాగ్రత్తలు తీసుకోకపోతే ఆ ఋణం ఫెయిలయ్యి, నాన్ పెర్ఫార్మింగ్ అకౌంట్‌గా మారుతుందో, ఆ అవలక్షణాలన్నీ, బాలగోపాల్ కేసులో ఉన్నాయి.

దానికి తోడు లోన్ కోసం బ్యాంకుకు తనఖా, మార్టిగేజ్ కోసం చూపించిన ఆస్తులు, వ్యక్తుల వివరాలు కూడా సరిగ్గా లేవు. ఎకరం లక్ష రూపాయలు



కూడా విలువ చేయని భూమికి ఎకరం ఐదు కోట్ల విలువ ఉన్నట్టు చూపించారు. పది ఎకరాల భూమి కూడా లేనిచోట పదమూడు వందల ఎకరాలు ఉన్నట్టు చూపించారు. దేనికీ సపోర్టింగ్ డాక్యుమెంట్లు లేవు. అధికార ధృవపత్రాలు లేవు.

నా అనుమానాలను, నా అభ్యంతరాలను, నాకు కావలసిన వివరణలను, సర్టిఫికెట్లను, డాక్యుమెంట్లను, వివరాలను పంపవలసిందిగా జూబ్లీహిల్స్ బ్యాంక్ మేనేజరుకు లెటర్ రాశాను.

ఇంత పెద్ద ప్రపోజల్ పంపుతున్నప్పుడు కనీస జాగ్రత్తలు, మినిమం స్క్రూటినీ, మినిమం నిబంధనలు పాటించవలసిన అవసరం లేదా అని ప్రశ్నిస్తూ, జూబ్లీహిల్స్ మేనేజర్‌ను అతని నిర్లక్ష్యానికి, బాధ్యతారాహిత్యానికి సంజాయిషీ చెప్పవలసిందిగా మెమో తయారుచేసి సంతకం కోసం జెడ్ఎంకు పంపాను.

జూబ్లీహిల్స్ బ్యాంకు మేనేజర్ స్కేల్ ఫైవ్‌లో ఉన్న, ఏజీయం హోదాలో ఉన్న, ఉన్నతాధికారి. ఈ రాష్ట్రంలో, జెడ్ఎం తర్వాత అత్యంత సీనియర్ అధికారి. ఈ లోన్ మహత్యం వల్ల, ఇప్పుడు జెడ్ఎంగా ఉన్న రామస్వామికి ప్రమోషన్ వస్తుందనీ, ఆ స్థానంలోకి తర్వాత అతనే రేపో మాపో జెడ్ఎం కాబోతున్నాడనీ అనుకుంటున్నారు.

అటువంటి ఉన్నతాధికారికి నేను మెమో పుటప్ చేసి సంతకం కోసం, మెయిల్‌లో, జెడ్ఎంకు పంపించాను. నేను పంపే ప్రతీ మెయిల్ హెడ్డాఫీసులోని లోన్ సెక్షనుకు మార్కు చేయబడి, ఆటోమేటిక్‌గా, వాళ్ళకు వెళ్ళే విధంగా కంప్యూటర్‌లో ఇన్‌స్ట్రక్షన్స్ ఫీడ్ చేసి పెట్టాను.

జెడ్ఎం గుండెల్లో రాయి పడింది.

నా ఒక్క మెమో ముగ్గురి ఆశల మీద నీళ్ళు జల్లింది.

ఏజీయంకు, జెడ్ఎంగా ప్రమోషనూ రాదు.

జెడ్ఎంకు జనరల్ మేనేజర్ పదవీ హుళక్కే.

బాలగోపాలుడి బడుద్దాయి ప్రపోజలూ మూలకు పడ్డట్టే.

ఎందుకంటే రెండు మూడు రోజుల్లో అన్ని బ్యాంకుల కన్సార్టియం మీటింగ్ ఉంది. అంతా, ముందుగా వాళ్ళు అనుకున్నట్టుగా జరిగితే, ఈ మీటింగులోనే లోన్ ప్రపోజల్ అనుమతి పొంది డబ్బులు రిలీజ్ అవుతాయని కలలు కన్నారు.

అటువంటి సమయంలో నేను రాసిన మెమో

---

**ఈవారం లాకర్ నెం. 369 చదివారు కదా!**
**మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి**
**కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!**

## లాకర్ నెం. 369-9 (23-8-2017)

మా ప్రశ్న: **ఎంపీ బాలగోపాల్ ఏ ప్రాజెక్ట్ లైసెన్స్ కోసం ప్రయత్నిస్తున్నాడు?**

మీ జవాబు-------------------------------------------------------------------------------------------

చిరునామా-------------------------------------------------------------------------------------------

-----------------------------------------------------------------------------------------------------

-----------------------------------------------------పిన్-------------------------ఫోన్‌నెం.-----------------------------------

**ఈ కూపన్‌ను 22 ఆగస్టు 2017 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.**

మా చిరునామా: నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

స్టంబ్లింగ్ బ్లాక్‌లా అంటే కొరకరాని కొయ్యలా, అడ్డంకిగా మారింది.

మెమో, కాపీ తీసి ఫైల్లో పెట్టి, జెడ్‌ఎం ఛాంబర్‌లోకి సంతకం కోసం పంపించాను. ఒక రోజైనా ఫైలు బయటకు రాలేదు. 'మెయిల్ నేను చూడలేదు, ఫైల్లో నా సంతకం లేదు అనే నంగనాచి వేషాలు వేస్తాడు' కాబట్టే హార్డ్ కాపీతో పాటూ నోటు ఫైల్లో రాసి మరీ పంపాను.

ఆ మెమో మీద సంతకం చేసి ఫైలు నా దగ్గరికి తిరిగి పంపితేనే, ఆ ఫైల్ ముందుకు కదులుతుంది. కానీ, అలా ఆ ఫైల్లోని మెమో మీద సంతకం చేస్తే, ప్రపోజల్‌లో అనేక లొసుగులున్నాయని ఒప్పుకున్నట్టవుతుంది. ప్రపోజల్ చెత్తబుట్టలో పడిపోతుంది.

ఒకవేళ, మెమో మీద సంతకం చేయకుండా, ఫైల్ పెండింగ్‌లో ఉంచి నాకు పంపకుండా ఆపేస్తే కన్సార్షియం మీటింగ్ ఆగిపోతుంది. దాంతో లోన్ ప్రపోజల్ అటకెక్కుతుంది. అంతే కాకుండా, హెడ్డాఫీసు నుండి ఏజీయంకూ, జెడ్‌ఎంకూ తాఖీదులు వస్తాయి.




శాశ్వతంగా ప్రపోజల్ మూలకు పడిపోతుంది.

అలా నేను రాసిన మెమో వల్ల, మా జెడ్‌ఎం పరిస్థితి అడకత్తెరలో పోకచెక్కలా తయారైంది.

ఆ మరుసటి రోజు, 'అమెరికన్ సిస్టంలో' లంచ్ చేస్తున్నప్పుడు,

"ఎవడబ్బ సొమ్ము సార్! మూడువేల కోట్లు అప్పనంగా రాజకీయ నాయకులకు దోచి పెడుతున్నారు? మీరు గుండెమీద చెయ్యి వేసుకుని చెప్పండి సార్! ఈ ప్రాజెక్టు నుండి ఒక్క యూనిట్ కరెంట్ అయినా ఉత్పత్తి అవుతుందా? ఈ మూడువేల కోట్ల రూపాయల లోను నుండి ఒక్క రూపాయైనా తిరిగి వసూలు అవుతుందా? ఇంతవరకు తీసుకున్న వేల కోట్ల రూపాయల లాగానే ఇది కూడా మురిగిపోతుంది సార్! అట్లా ముంచిన వాడికే మళ్ళీ లోన్ ఎలా ఇస్తారు సార్!" అని టీపీరావుగారితో అన్నాను బాధగా.

ఆయన నవ్వుతూ,

"ఈ మాత్రం దానికి గుండెలమీద దాకా ఎందుకు? ఎక్కడా చెయ్యి వెయ్యకుండానే, చెప్తున్నాను. మీ అనుమానాలన్నీ కరెక్టే సార్. ఒక్క యూనిట్ కరెంట్ ఉత్పత్తి కాదు, ఒక్క రూపాయి కూడా వసూలు కాదు..." అని అంటున్న వాడల్లా ఒక్క క్షణంలో, మారు మాట్లాడకుండా, దయ్యాన్ని చూసిన వాడిలా ఖ్రాన్పడిపోయి, సీట్లోంచి లేచి గబగబా బాత్‌రూము వైపు వెళ్ళాడు.

నేను ఆయననే ఆశ్చర్యంగా చూడసాగాను. ఆయన మళ్ళీ తిరిగి రాలేదు.

ఆయన కోసం చూసీ చూసీ, నేను భోజనం పూర్తి చేసి, 'అమెరికన్ సిస్టం'ను పక్కన పెట్టి మొత్తం బిల్లు నేనే చెల్లించి బయటపడ్డాను.

బ్యాంకుకు వెళ్ళేసరికి టీపీరావుగారు నెల రోజులు లీవు పెట్టి వెళ్ళినట్టు తెలిసి విస్తుపోయాను. నాతో మాట్లాడుతున్న వాడల్లా, భోజనం చేస్తున్న వాడల్లా అలా మాయమైపోవడం, అటు తర్వాత నెల రోజుల వరకూ లీవ్ పెట్టడం చాలా ఆశ్చర్యం కలిగించింది. ఏదో మతలబు ఉందనిపించింది.

నేను రాగిణి సీటు వైపు చూశాను.

రాగిణి నా వైపే చూస్తోంది. తన చేతిలోని ఫోన్ చూపిస్తూ, నా సెల్‌ఫోన్ చూడమని సైగ చేసింది.

నేను చూశాను.

'సిచ్యుయేషన్ ఈజ్ ఎక్స్‌ట్రీమ్లీ డేంజరస్. బీ కేర్‌ఫుల్. రీడ్ అండ్ డిలీట్ దిస్ మెసేజ్' అని ఉంది.

'ఓహో అందుకేనా టీపీరావుగారు అర్థాంతరంగా మాయమయ్యారు' అని మనసులో అనుకున్నాను.

నాకు అప్పటివరకు భయమంటే తెలియదు. ప్రాణాలంటే లెక్కలేదు. కానీ, రాగిణితో ప్రేమలో పడ్డాక, ఆ క్షణంలో రాగిణి మెసేజ్ చూశాక మాత్రం నాకు భయమైంది.

ఎవ్వరికీ భయపడని టీపీరావుగారు నెలరోజుల పాటు లీవు పెట్టి అదృశ్యమైపోవడం, రాగిణి దీనంగా చూస్తుండటం చూసి నాకు నిజంగానే భయమేసింది.

'నిజంగా జెడ్‌ఎం అంత దుర్మార్గుడా? నా మీద ఫిజికల్‌గా దాడి చేయించేంత క్రూరుడా?'

నాకేం చేయాలో పాలుపోలేదు. వెంటనే నా ఐపీయస్ ఫ్రెండుకి ఫోన్ చేసి సలహా అడిగాను. పది నిమిషాల్లో, అంతకుముందు నేను మాట్లాడిన డీయస్పీ మందీమార్బలంతో బ్యాంకుకు వచ్చాడు. నాకు కొంత ధైర్యం వచ్చింది.

జోనల్ ఆఫీసులో అందరూ, ఈ బల ప్రదర్శనను, ఆసక్తిగా, ఆశ్చర్యంగా చూడసాగారు.

కానీ రాగిణి ముఖంలో ఏదో తెలియని ఆందోళన పొడసూపుతోంది. నాకు అర్థం కాలేదు. పది నిమిషాలు మాట్లాడి, అటూ ఇటూ చూసి, డీయస్పీ వెళ్ళిపోయాడు. అదంతా ఒక facade. బూటకం. నాకేమైనా అయితే చూస్తూ ఊర్కోననీ, నా వెనుక పోలీసులు, పోలీసు అధికారులు ఉన్నారన్న సందేశాన్ని నా శత్రువులకు పంపడం కోసం సృష్టించిన ప్రహసనం.

నేను నవ్వుతూ రాగిణి వైపు చూశాను. రాగిణి తల దించుకుంది. మరుక్షణంలో 'బ్యాడ్ మూవ్' అని ఫోనులో మెసేజ్ వచ్చింది. నా భృకుటి ముడిపడింది.

దాంతో, ఆ క్షణం నుండి నేను చాలా గందరగోళ పరిస్థితిలో పడిపోయాను. రాగిణి మెసేజ్‌ల అంతరార్థం ఏమిటో నాకు అంతుపట్టడం లేదు. నాకు సలహాలిచ్చే టీపీరావుగారు  జానపద సినిమాల్లో మాంత్రికుడు 'హ్రీం, క్రీం, హాం ఫట్' అని మంత్రించగానే హీరో చటుక్కున మాయమైపోయినట్టుగా అదృశ్యమైపోయారు.

ఇవాళ ఎలాగూ రాగిణి వాళ్ళింటికి వెళ్ళాల్సి ఉంది.

'బ్యాంకు వదలగానే రాగిణి ఇంటికి వెళ్ళి అక్కడే అన్ని విషయాలు విపులంగా చర్చించాలి' అనుకుంటూ బ్యాంకులో ఉన్నంతసేపూ ముళ్ళమీద కూర్చున్నట్టుగా సాయంత్రం వరకు గడిపాను.

నేను ఆరు కాగానే బయటపడ్డాను.

బ్యాంకు నుండి రాగిణి ఇంటికి గాంధీనగర్‌కు వెళ్ళేదారిలో 'విక్టోరియా కేఫ్' ఉంది. ఆ హోటల్ చిన్నదే. అది రెండు రోడ్ల కార్నర్‌లో ఉండి, అందులో కూర్చున్న వాళ్ళకు రోడ్డుమీద వెళ్ళేవాళ్ళు స్పష్టంగా కనిపిస్తారు. నేను 'విక్టోరియా'లో కూర్చొని రాగిణి కోసం వెయిట్ చేయసాగాను.

చివరకు ఏడున్నర ప్రాంతంలో రాగిణి 'యాక్టివా' సందు మొదట్లో కనిపించింది. నేను పరుగున వెళ్ళి బైక్ మీద, ఆమెను ఫాలో అయ్యాను.

రాగిణి వాళ్ళింటికి వెళ్ళిన ఆ మొదటి రోజు తరువాత మళ్ళీ చాలాసార్లు వెళ్ళాను. వాళ్ళింట్లో వాళ్ళతో కూడా నాకు చాలా సాన్నిహిత్యం ఏర్పడింది. ఎక్కువగా దాగుడుమూతలు లేకుండా మేమిద్దరం ప్రేమించుకుంటున్నామన్న విషయం రాగిణి పేరెంట్స్‌కు చెప్పేశాము. వాళ్ళు కూడా ఏ అభ్యంతరమూ చెప్పలేదు.

'నాలాంటి అందగాడు, బుద్ధిమంతుడు అల్లుడు అవుతున్నందుకూ, అదీ పైసా కట్నం అడగకుండా పెళ్ళి చేసుకుంటానన్నందుకూ వాళ్ళెంతో సంతోషంగా ఉన్నారని' రాగిణి నాతో చాలాసార్లు అన్నది.

నేను బ్యాంకులో చేరి మూడేళ్ళు కావస్తోంది. సింగిల్ రూములో ఉంటూ మెస్‌లో తింటూ కాలం గడుపుతున్నాను. అందుకే అమ్మావాళ్ళు కూడా నన్ను పెళ్ళి చేసుకోమని పోరుతూనే ఉన్నారు. కానీ, నేనే అందుకు సిద్ధంగా లేను. నాకు ఈ బ్యాంకు ఉద్యోగంలోనే కంటిన్యూ కావడం ఇష్టం లేదు. కాబట్టి, మరొక మంచి ఉద్యోగంలో చేరాక పెళ్ళి చేసుకుందామనుకుంటున్నానని వాళ్ళకు అప్పుడు చెప్పాను.

కానీ, రాగిణితో ప్రేమలో పడ్డాక నా నిర్ణయాలన్నీ తారుమారయ్యాయి.

***(ఇంకా వుంది)***

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో

## సిస్టమిక్ లూపస్ ఎరితిమాటోసిస్ (SLE) సమస్యకు సరైన పరిష్కారం


డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్




సిస్టమిక్ లూపస్ ఎరితిమాటోసిస్ (SLE) ఒక ఆటోఇమ్యూన్ వ్యాధి. సాధారణంగా శరీరంలోకి ఏవైనా అన్యపదార్థములు ప్రవేశించినప్పుడు మన శరీర రోగనిరోధక వ్యవస్థ వాటిని గుర్తించి, వాటికి వ్యతిరేకంగా యాంటీబాడీస్‌ను ఉత్పత్తి చేయడం ద్వారా వాటిని నశింపజేసి – ఇన్‌ఫెక్షన్స్ బారిన పడకుండా మనల్ని కాపాడటం జరుగుతుంది. కానీ మన శరీరంలోని కొన్ని అసమతుల్యతల కారణంగా ఈ రోగనిరోధక వ్యవస్థ పొరబడి సొంత కణాలపై దాడి చేయడం వలన కలిగే వ్యాధులనే 'ఆటో ఇమ్యూన్ వ్యాధులు' అని అంటారు.

ఈ SLE వ్యాధి ప్రభావం చర్మంపై పడటంతో పాటు, కీళ్ళు, మూత్రపిండాలు, మెదడు మొదలగు ఇతర అవయవాలపై ఉంటుంది. ఏ వయస్సు వారినైనా ఈ వ్యాధి ప్రభావితం చేస్తుంది. ముఖ్యంగా 10 నుండి 50 సంవత్సరాల మధ్య వయస్సు గల వారిలో ఇది ఎక్కువగా కనిపిస్తుంది. పురుషుల కంటే స్త్రీలలో 10 రెట్లు అధికంగా ఈ సమస్య కనిపిస్తుంది. ఇది ఒక దీర్ఘకాలిక ఆరోగ్య సమస్య.

### Systemic Lupus Erythematosus (SLE):

**కారణాలు:** SLE వ్యాధికి గల ఖచ్చితమైన కారణాలు తెలియరాలేదు. కానీ కొన్ని జన్యుపరమైన అంశాలు, వాతావరణ రీత్యా కొన్ని కారణాలు – ముఖ్యంగా అల్ట్రా వైలట్ కిరణాలు, కొన్ని రకాల మందులు, వివిధ వైరస్‌లు, మానసిక మరియు శారీరక ఒత్తిడి మరియు గాయాల వలన ఈ వ్యాధి ప్రేరేపించబడేదిగా ఉంటుందని అనుభవపూర్వకంగా తెలుస్తోంది. • SLE పురుషుల కంటే స్త్రీలలో ఎక్కువగా కనిపిస్తుంది. స్త్రీలలో ఈ వ్యాధి లక్షణాలు గర్భధారణ సమయంలో మరియు నెలసరి సమయంలో ఎక్కువ అవుతూ ఉంటాయి. ఈ కారణంగా Oestrogen హార్మోన్ – SLE వ్యాధి కలగడానికి ఒక కారణంగా భావించడం జరుగుతోంది.

Systemic Lupus Erythematosus (SLE)



**లక్షణాలు:** SLE వ్యాధి లక్షణాలు కొన్ని రోజులు ఎక్కువగాను, మరికొన్ని రోజులు తక్కువగాను ఉంటాయి. ఈ వ్యాధికి గురి అయిన అవయవాన్ని బట్టి ఆయా లక్షణాలు కనిపిస్తాయి. • **మెదడు మరియు నాడీ వ్యవస్థ:** ఇవి రెండూ గనక ఈ వ్యాధి బారిన పడితే మానసిక అశాంతి, పక్షవాతం, మూర్ఛవ్యాధి, తలనొప్పి, మొద్దుబారడం, తిమ్మిర్లు, కంటిచూపు సమస్యలు ఏర్పడతాయి. • **గుండె:** ఈ SLE వ్యాధి కారణంగా గుండెలో–పెరికార్డయిటిస్, మయోకార్డయిటిస్ మరియు ఎండోకార్డయిటిస్ సమస్యలు ఏర్పడటం వలన ఆయాసం, నీరసం మొ॥ లక్షణాలు కనిపిస్తాయి. • **రక్తనాళాలు:** ఈ వ్యాధి బాధితుల రక్తనాళాలలో కొవ్వు పేరుకుపోయి గుండెనొప్పి వచ్చే అవకాశం ఉంటుంది. • **జీర్ణకోశ ప్రాంతము:** కడుపునొప్పి, వికారం వంటి లక్షణాలతో పాటు వాంతులు కలుగుతాయి. • **ఊపిరితిత్తులు:** ఇవి ఈ SLE వ్యాధి బారిన పడితే శ్వాస తీసుకోవడంలో ఇబ్బంది ఏర్పడుతుంది. ఇంతేకాకుండా రక్తంతో కూడిన దగ్గు, ఊపిరితిత్తులలో నిమ్ము చేరటం వంటి లక్షణాలు ఏర్పడతాయి. • **మూత్రపిండాలు:** SLE వలన మూత్రపిండాలు శోథమునకు గురి అయితే, మూత్రం ద్వారా ప్రొటీన్లు మరియు రక్త కణాలు కోల్పోయి శరీరమంతా వాపులు మరియు బరువు పెరగడం వంటి లక్షణాలను గమనించవచ్చు. • **చర్మం:** SLE ప్రభావం చర్మంపై పడటం వలన ఎర్రని దద్దుర్లు ఏర్పడి, పొరలుగా మరియు దళసరిగా మారి, చర్మంపై నల్లటి మచ్చలు ఏర్పడతాయి. ముఖంలో బుగ్గలు మరియు ముక్కు పైన సీతాకోకచిలుక ఆకారంలో దద్దుర్లు ఏర్పడతాయి. • **గర్భిణీలలో:** గర్భంతో ఉన్నవారు ఈ వ్యాధి బారిన పడటం వలన – పిండ మరణం, గర్భస్రావం జరిగే అవకాశం అధికంగా ఉంటుంది. • తీవ్రమైన అలసట, కీళ్ళలో నొప్పి, ముఖ్యంగా చిన్న కీళ్ళలో నొప్పి మరియు వాపు, వెంట్రుకలు రాలిపోవడం, రక్తహీనత, రక్తం గడ్డకట్టడంలో సమస్యలు, జ్వరం, లింఫ్ గ్రంథుల వాపు వంటి లక్షణాలను గమనించవచ్చు.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** CBP, ESR, CUE, రుమటాయిడ్ ఫ్యాక్టర్, యాంటీ న్యూక్లియర్ యాంటీబాడీస్(ANA), సీరం క్రియేటినైన్, లివర్ మరియు కిడ్నీ ఫంక్షన్ టెస్ట్‌ల ద్వారా SLE వ్యాధిని నిర్ధారించుకోవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** సాధారణంగా SLE వ్యాధికి అనేక చికిత్సా పద్ధతులు ఉన్నప్పటికీ ఏ పద్ధతిలోనూ సంపూర్ణంగా నయం చేసే అవకాశం లేదు. కేవలం 'హోమియోపతి' మందులను వాడటం ద్వారా – ఎటువంటి అసౌకర్యం, దుష్ఫలితాలు లేని చికిత్స చేయవచ్చు. 'హోమియోకేర్ ఇంటర్‌నేషనల్'లో మాత్రమే లభించే అధునాతనమైన జెనెటిక్ కాన్స్టిట్యూషనల్ వైద్య విధానంలో నిపుణులైన హోమియోవైద్యులచే అందబడే చికిత్సల ద్వారా SLE వ్యాధిని పూర్తిగా అదుపులో ఉంచడమే కాకుండా ఎటువంటి దుష్ఫలితాలు లేకుండా సంపూర్ణంగా నయం చేయవచ్చు.

# CRIME చిత్రసీమ చిత్రం

**"ఈ చిత్రసీమకి నిన్ను మకుటంలేని మహారాణిని చేస్తాను, నిర్మాతలందరూ నీ అడుగులకు మడుగులొత్తుతారు, నువ్వే కాబోయే సూపర్ హీరోయిన్" తన మాటలతో ఊరించాడు డైరెక్టర్ చరణ్. అది వింటూనే చిత్రాంగి మనసు పురివిప్పిన నెమలిలా పరవశించిపోయింది.**

**చరణ్ ఆమె చెయ్యి పట్టుకొని తనవైపు లాక్కోగానే ఆమె తనువంతా మైకం కమ్మినట్టయింది. ప్రతిఘటించలేదు, అతని గుండెలపై గువ్వపిట్టలా ఒదిగిపోయింది. ఆమె చుబుకం పట్టుకుని కళ్ళల్లోకి చూస్తూ "నీ కళ్ళు యువకుల గుండెల్ని కాల్చే తుపాకీగుళ్ళు." అన్నాడు.**

"ఊ...హూ...." అంటూ కళ్ళు మూసుకుంది చిత్రాంగి.

"నీ పెదాలు పనసతొనలు.... తెరపై.... క్లోజప్‌లో చూపించామంటే ప్రేక్షకుల గొంతు తడారి పోవాల్సిందే"

"ఇంకా...?" అంది చిత్రాంగి చరణ్ కౌగిలిలో కరిగిపోతూ.

"నీ ఎద పొంగులు చూశారంటే మతి పోవాల్సిందే. హీరోయిన్లందరూ ప్యాకప్ అయిపోవాల్సిందే"

చరణ్ పొగడ్తలు, అతని చేష్టలు ఆమెను వివశురాల్ని చేశాయి. అయినా తనను తాను కంట్రోల్ చేసుకుని "ప్రతీ డైరెక్టర్ ప్రతీ అమ్మాయితో రొటీన్‌గా చెప్పే డైలాగులే ఇవన్నీ" అంది బింకంగా.

"ఓహ్ ...! అదా నీ భయం. ఇప్పుడు చెబుతున్నాను విను, నాలుగురోజుల్లో నాయుడుగారు ప్రారంభించే 'ప్రెట్టీ గర్ల్' చిత్రంలో నువ్వే హీరోయిన్.'

"ప్రామిస్" చెయ్యి ముందుకు చాచింది చిత్రాంగి. ఆ చేతిని సున్నితంగా నొక్కుతూ తనవైపు లాక్కుని ముద్దుగుమ్మ ముద్దుగుమ్మాన్ని అందుకున్నాడు చరణ్.

కలలలోకంలో రెక్కలగుర్రంపై స్వారీచేస్తున్న చిత్రాంగి చరణ్‌కు తన పరువాల విందు చేసింది.

***

ఫిల్మాలయా స్టూడియో ఆవరణ హడావిడిగా ఉంది. సినీ ప్రముఖులు, బిజినెస్‌మెన్, మీడియా వారితో కోలాహలంగా ఉంది. నాయుడిగారి సినిమా "ప్రెట్టీ గర్ల్" ముహూర్తం షాట్ చిత్రీకరణ. నిర్మాత, దర్శకుడు, హీరో అభి వేదికపై ఆశీనులయ్యారు. హీరోయిన్ సీటు ఖాళీగా ఉంది.

స్టేజ్ ఎదురుగా కుర్చీల్లో జనాలమధ్య కూర్చున్న చిత్రాంగికి యమ టెన్షన్‌గా ఉంది. కాసేపట్లో ముఖ్య అతిథిగా హాజరయ్యే మంత్రి 'హీరోయిన్ పేరున్న సీల్డ్ కవర్ ఓపెన్ చేస్తారు. ప్రెస్, మీడియా అందుకే ఆసక్తిగా ఎదురుచూస్తున్నారు. అట్టహాసంగా మంత్రి రానేవచ్చారు. నిర్మాత నాయుడు అందించిన కవర్ చించి అందులోని కాగితం హీరో అభికి అందించారు మంత్రి. దాన్ని అందుకుని మైక్ వైపు నడిచాడు అభి.

నుదుటి చెమటను సున్నితంగా ఖర్చీఫ్‌తో అద్దుకొని లేచి నిలబడింది చిత్రాంగి. ఆ కాగితంలో ఉన్నది తన పేరే అని ఆమె ప్రగాఢ విశ్వాసం. అందరూ చెవులు రిక్కించారు. అభినయ్ గొంతు సవరించుకుని "నా పక్కన నటించేది నాలుగు అక్షరాలున్న పేరుగల హీరోయిన్. ఆమె..." అని ఊరిస్తూ చివరకు "సునయన .." అని గట్టిగా అరిచి ఆమెను స్టేజ్ మీదకు ఆహ్వానించాడు. చిత్రాంగి నెత్తిన పిడుగు పడ్డట్టయింది. కళ్ళు తిరిగాయి. కుర్చీలో కూలబడింది. కెమెరాలన్నీ సునయనపై ఫోకస య్యాయి. స్నేహితురాలు సీమ మెల్లిగా చిత్రాంగిని టాక్సీలో తీసుకొచ్చి హాస్టల్‌కు చేర్చింది.

***

"చరణ్ ఇంత పని చేస్తాడనుకోలేదు, చీటర్" అంటూ బిగ్గరగా ఏడుస్తోంది చిత్రాంగి.

"మోసం పునాదులమీద పైకొచ్చినవాడు చరణ్. వాడు మోసం చెయ్యకపోతేనే ఆశ్చర్యపడాలి" అనునయంగా చెప్పింది సీమ.

"నేను పంపే డబ్బుకోసం ఆశగా ఎదురుచూసే మా అమ్మా, చెల్లెళ్లకోసమే వాడికి లొంగిపోయా."

"నిజమే చిత్రా, మనలాంటి బలిపశువులున్నంత కాలం చరణ్ లాంటి వేటగాళ్ళ ఆటలు సాగుతూనే ఉంటాయి" అంది సీమ.

"ఇక వాడి ఆటలు సాగవ్, ఇంతవరకు నాలోని మంచితనం, బలహీనతే చూశాడు, ఇక వాడికి నాలోని రెండో పార్శ్వం ఏమిటో చూపిస్తా, వాడి ఆట కట్టిస్తా" ఆవేశంగా పలికింది చిత్రాంగి.

"ఆవేశపడకు, అంగబలం అర్థబలం దండిగా ఉన్నవాళ్ళను ఎదుర్కోవడమంటే కొండను డీ క్కొనట్టే" హెచ్చరించింది సీమ.

"అలా అని వదిలేస్తే ఎంతోమంది అమాయకుల జీవితాలు కబళిస్తాడు. వాడికి బుద్ధి చెప్పాల్సిందే" దృఢంగా పలికింది చిత్రాంగి.

***

బాటిల్స్ అండ్ చిమ్నీస్ పబ్.

మిరిమిట్లు గొలిపే వెలుగులో కుర్రకారు జోరు మీద గంతులేస్తున్నారు. థౌజండ్ వాట్స్ సౌండ్ సిస్టమ్‌తో ఆ హాలు దద్దరిల్లిపోతోంది. అందరి నరాల్లోనూ ఉత్సాహం ఉరకలేస్తోంది.

తన ఎదురుగా కూర్చున్న లీనా అందాలను కళ్ళతో జుర్రుకుంటున్నాడు చరణ్. చేయి చాచి "విల్ యూ డాన్స్ విత్ మీ?" అని అడిగాడు.

"ష్యూర్" అంటూ చెయ్యి కలిపి డ్యాన్స్ ఫ్లోర్ వైపు అడుగులు వేసింది లీనా.

"నా నెక్స్ట్ పిక్చర్లో నువ్వే హీరోయిన్" అన్నాడు చరణ్. ఆ ఒక్క మాటకే అతని బుట్టలో పడిపోయింది లీనా. తన్మయంగా అతనితో డ్యాన్స్ చేయసాగింది.

"ఇది కలా! నిజమా!" అమాయకంగా అడిగింది లీనా.

"కల కాదు, నెరవేరిన నీ తీపికల...యువకుల గుండెలను కాల్చేసే తుపాకి గుళ్ళు నీ కళ్ళు" అంటూ పొగడ్తల దండకం ప్రారంభించాడు చరణ్.

"నీ పెదాలు పనసతొనలు, వాటినిచూస్తే ప్రేక్షకుల గొంతు తడి ఆరిపోవాల్సిందే..!" అదేకదా నీ తర్వాతి డైలాగ్" చిత్రాంగి స్వరం వినగానే తల పక్కకు తిప్పిచూశాడు చరణ్.

వెంటనే కోపంతో "షటప్..." అని గట్టిగా అరిచాడు.

"మిస్టర్ చరణ్, అరచినంత మాత్రాన ఊరుకుంటాననుకోకు. నీ అసలురంగు బయటపెడతా" ఆవేశంగా చరణ్ చెంప చెళ్ళు మనిపించింది చిత్రాంగి.

ఈ హఠాత్ సంఘటనతో గుడ్లప్పగించి చూస్తూ ఉండిపోయింది లీనా.

చరణ్ ఉగ్రుడయ్యాడు. "నలుగురిలో నన్నే అవమానిస్తావా.... ఇంతకింతా అనుభవిస్తావ్" అని బెదిరించాడు.

పబ్ మేనేజర్ సింగ్ జోక్యం చేసుకుని చిత్రాంగిని బయటకు పంపించాడు.

***

ఉదయం వేళ

జూబ్లీహిల్స్ ఫిల్మ్‌నగర్ కాలనీ, ప్లాట్ నంబర్ 202. యువదర్శకుడు చరణ్ ఇల్లు. పోలీస్‌జీపు ఇంటిముందు ఆగి ఉంది. జూబ్లీహిల్స్ ఎస్.ఐ. నరసింహం, అతడిబృందం ఆ ఇంట్లో అణువణువూ

**నాయుడుగారి సినిమా ముహూర్తంషాట్ చిత్రీకరణ ఆరోజు. పలువురు సినీ ప్రముఖులు, వ్యాపారవేత్తలు, మీడియాతో ఆ ప్రదేశమంతా కోలాహలంగా ఉంది. సభావేదిక సిద్ధం చేశారు. ఆ వేదికపైనుండే ముఖ్యఅతిథి సీల్డ్‌కవర్ చించి ఆ సినిమాలో నటించే హీరోయిన్ పేరు ప్రకటిస్తారు. మీడియా సహా అంతా ఉత్కంఠతో చూస్తున్నారు. అందరికంటే ఎక్కువగా ఆమెలో మరింత ఉత్కంఠ! చివరకు అక్కడ ఏం జరిగింది?**



గాలిస్తోంది.

బెడ్‌రూమ్‌లో రక్తపుమడుగు! ఆ రక్తం మధ్య నిర్జీవంగా పడి ఉన్నాడు చరణ్. అతన్ని హతమార్చిన ఆయుధం అక్కడ దొరకలేదు. 'ప్రీ ప్లాన్డ్ మర్డర్' మనసులోనే అనుకున్నాడు నరసింహం.

వాచ్‌మేన్ సలీంను ప్రశ్నించాడు. రాత్రి డ్యూటీకి రాలేదని చెప్పాడతను.

చరణ్ సెల్‌ఫోన్ కాల్ లిస్ట్ చూశారు. ఆఖరి కాల్ చిత్రాంగిదే.

క్షణం ఆలస్యం చెయ్యకుండా పోలీసులు చిత్రాంగి హాస్టల్‌కు చేరుకున్నారు.

పోలీసులను చూసి విస్తుపోయింది ఆమె.

"యూ ఆర్ అండర్ అరెస్ట్" అన్నాడు ఎస్ఐ నరసింహం.

"ఎందుకు? ఏం నేరం చేశానని అరెస్టు చేస్తారు?" అమాయకంగా అడిగింది.

"డైరెక్టర్ చరణ్‌ను హత్య చేసినందుకు"

ఎస్.ఐ. మాట పూర్తి కాకుండానే "నేను నిర్దోషిని, నాకే పాపం తెలియదు" ఏడుస్తూ చెప్పింది చిత్రాంగి.

"ఆ విషయాలన్నీ తర్వాత. ముందు పోలీస్ స్టేషన్‌కు పద" అంటూ చిత్రాంగిని జీపు ఎక్కించాడు ఎస్.ఐ. నరసింహం.

***

పబ్ మేనేజర్ సింగ్ పోలీస్‌స్టేషన్‌కు చేరుకున్నాడు.

హత్యకు ముందురోజు రాత్రి చిత్రాంగి, చరణ్ మధ్య పబ్‌లో జరిగిన గొడవ పూసగుచ్చినట్టు ఎస్.ఐ.కి వివరంగా చెప్పాడు.

నిర్మాత నాయుడిని విచారించారు. "హీరోయిన్‌గా అవకాశం ఇస్తాననిచెప్పి ఇవ్వలేదనే కోపంతో ఉందనీ, బహుశా ఆ కోపంతోనే చిత్రాంగి ఈ హత్య చేసి ఉండొచ్చుననీ" నాయుడు సాక్ష్యమిచ్చాడు.

హీరోయిన్ సునయనను కూడా ఎస్.ఐ. ప్రశ్నించాడు. " చరణ్ హత్య జరిగినరోజు రాత్రి నువ్వు కూడా చరణ్ ఇంటికి వెళ్ళావుకదూ....." ప్రశ్నించాడు ఎస్.ఐ.

"ఏదో సీన్ గురించి చర్చించాలి రమ్మంటే వెళ్ళానుగానీ, రాత్రి తొమ్మిది గంటలకే తిరిగి వెళ్ళిపోయాను" చెప్పింది సునయన.

"నువ్వేదో దాస్తున్నావు...?"

"జరిగిందంతే. దాచిపెట్టడానికి మామధ్య ఏమీ లేదు."

"మరి దీని సంగతేంటీ?" చరణ్ ఇంట్లో దొరికిన సునయన సెల్‌ఫోన్ చూపిస్తూ అడిగాడు ఎస్.ఐ.

ఖంగుతిన్నది సునయన.

"ఆరోజు రాత్రి చరణ్ ఇంటినుంచి బయలుదేరి సగం దూరం వెళ్ళాక ఫోన్ సంగతి గుర్తొచ్చి వెనక్కు వెళ్ళాను. అప్పటికే చిత్రాంగి, చరణ్ మధ్య వాగ్యుద్ధం జరుగుతోంది. అది అంతకంతకీ పెరిగిపోయింది. సడన్‌గా చిత్రాంగి చేతిలో తళ తళా మెరుస్తున్న కత్తి ప్రత్యక్షమైంది. అది చూసి నేను భయంతో సెల్ సంగతి వదిలేసి వెళ్ళిపోయాను" పూర్తిచేసింది సునయన.

ఎస్.ఐ. నరసింహం చిత్రాంగి వైపు తిరిగి "ఇప్పటికీ నువ్వీ హత్య చేయలేదనే అంటావా?" అని అడిగాడు.

ఆమె మౌనం దాల్చింది. "కాసేపట్లో ఫోరెన్సిక్ రిపోర్ట్ వస్తుంది. చరణ్ గుప్పెట్లో దొరికిన పొడవాటి జుట్టు ఏ స్త్రీదో ఇట్టే తేలిపోతుంది" అన్నాడు మళ్ళీ.

చిత్రాంగిలో దుఃఖం పెల్లుబికింది.

"మీరు చెప్పింది నిజమే, ఆ రోజు రాత్రి చరణ్‌ను చంపుదామనే కత్తి తీసుకుని వెళ్ళాను. కాని చంపలేదు. సునయనను హీరోయిన్‌గా తీసుకోవడంలో తన ప్రమేయమేమీ లేదనీ, అంతా నిర్మాత నాయుడు బలవంతంమీదే ప్రకటన చేశారనీ, తరువాత సినిమాలో తప్పకుండా హీరోయిన్‌గా తీసుకుంటాననీ అన్నాడు చరణ్. కత్తి అక్కడ పడేసి తిరిగెళ్ళిపోయాను, అంతకుమించి నాకేమీ తెలియదు" అంది చిత్రాంగి.

'ఇదేంటీ? కేసు చిక్కుముడి పడుతున్నట్టుందే' అనుకున్నాడు నరసింహం.

అప్పుడే ఫోరెన్సిక్ రిపోర్ట్ వచ్చింది. హతుడి గుప్పిట్లో దొరికిన వెంట్రుకలు చిత్రాంగి కేశాలతో మ్యాచ్ కాలేదు.

"మరి ఈ హత్య ఎవరు చేసుంటారు?" ఆశ్చర్యంగా పైకే అన్నాడు నరసింహం.

"ఆ ప్రశ్నకు సమాధానం నేను చెబుతాను" అని వినబడింది వెనుకనుంచి. అందరూ అటువైపు తలలుతిప్పి చూశారు.

సీమ! ఆశ్చర్యపోయింది చిత్రాంగి.

"ఈ హత్య నేను చేశా" ఆమె నోటినుంచి మాటలు తూటాల్లా పేలాయి.

"ఆ రోజు రాత్రి నేను కూడా చరణ్ ఇంటికి వెళ్ళా. చిత్రాంగి, సునయన, లీనా వరుసగా ఒకళ్ళ తర్వాత ఒకళ్ళు రావడం చూశాను. చరణ్ అందరితో ఇవే మోసపు మాటలు మాట్లాడటం విన్నాను.

నేను వెళ్తే నాతో కూడా అవే చెప్పాడు. వీడిని ఇలాగే ఆంబోతులా వదిలేస్తే ఎంతమంది అమ్మాయిల జీవితాలు నాశనం చేస్తాడో అనిపించింది. అక్కడే ఉన్న కత్తితో పొడిచి వెళ్ళిపోయాను. కానీ నాతప్పు వల్ల అమాయకురాలైన నా స్నేహితురాలు చిత్రాంగికి శిక్ష పడకూడదు. అందుకే నా అంతట నేనే మీ దగ్గరకు వచ్చాను. అయినా నేనొక దుర్మార్గుణ్ణి చంపానుతప్ప, చేసింది పెద్ద తప్పేమీకాదు" అంటూ చేతులు ముందుకు చాచింది సీమ.

**—యం.ఉదయభాను**




**ఆ సంవత్సరం పదో తరగతి పరీక్ష తప్పాను. పెదనాన్న ఏమీ అనలేదు. నాకే సిగ్గుగా అన్పించింది. "పర్లేదులే. చిన్నాన్న చావు నిన్ను బాగా కలచివేసి ఉంటుంది. చదువు మీద శ్రద్ధ ఎక్కడినుంచి వస్తుంది? ఈ సంవత్సరం బాగా చదివి పాసవుదువుగాని" అన్నాడు సుందరం.**

"నాకు చదవాలని లేదన్నా" అన్నాను.

"చదువుకోకుండా ఏం చేస్తావు?"

"వ్యవసాయం చేస్తాను."

"నాతో అంటే అన్నావు. నాన్నతో అనకు. బాధ పడ్తాడు."

"ఎందుకు బాధ? వ్యవసాయం చేయాలనుకోవడం సిగ్గుపడాల్సిన విషయమేమీ కాదుగా. నాన్నా, పెదనాన్నా వ్యవసాయమేగా చేశారు. నేనూ నాన్నలా వ్యవసాయం చేస్తాను."

"నువ్వింకా చిన్నపిల్లాడివి. వ్యవసాయంలోని సాధకబాధకాలు తెలియనందువల్ల అలా మాట్లాడుతున్నావు. చిన్నాన్న ఆత్మహత్య చేసుకున్నది వ్యవసాయం కలిసిరాకేగా."

నాన్న చావుకి కారణం అది కాదని చెప్పాలనుకుని కూడా విరమించుకున్నాను.

మరో ఏడాది చదివి పదో తరగతి ఎలాగో గట్టెక్కాను. పెదనాన్న ఇంటర్లో చేర్పించాడు. సుందరం ఎంపీసీ తీసుకోమన్నా తీసుకోకుండా హిస్టరీ, ఎకనామిక్స్ సబ్జెక్టులతో ఇంటర్ చదివాను. అప్పటికే ఇంజనీరింగ్‌లో చేరిన సుందరం కోసం పెదనాన్న స్కూటర్ కొనిచ్చాడు. సుందరం వాడిన సైకిల్ మీదే కాలేజీ కెళ్ళేవాడిని. పాఠాల మీద ఆసక్తి ఉండేది కాదు. ఎప్పుడూ ఏవో ఆలోచనలు మనసు నిండా కిక్కిరిసి ఉండేవి. ఊపిరాడేది కాదు. అశాంతి... దిగులుగా ఉండేది. ఎక్కడికైనా పారిపోవాలనిపించేది. ఎక్కడికో తెలియదు. ఈ మనుషులెవ్వరూ లేని చోటికి...

ఇంటర్ కూడా తప్పాను. ఈసారి మాత్రం పెదనాన్న మందలించాడు. "చదువుకుంటేనే బాగుపడతావు. చదువు లేకపోతే మాలానే వ్యవసాయం చేసుకుంటూ బతకాల్సిన దుస్థితి ఏర్పడుతుంది" అన్నాడు.

"వ్యవసాయం చేయడం దుస్థితి ఎందుకవుతుంది? నాకు నాన్నలా వ్యవసాయం చేయాలని ఉంది పెదనాన్నా" అన్నాను.

"వద్దురా.. నా మాటిను. ఏ పంటను ఏ మహమ్మారి ఎట్నుంచి వచ్చి కాటేస్తుందో తెలీకుండా ఉంది మా పరిస్థితి. నువ్వీ ఊబిలోకి దిగకు. పిడుగులు పడినా నెల తిరిగేసరికల్లా నీ చేతిలో జీతం డబ్బులు పడే ఉద్యోగం చేయి. మీ నాన్న కోరిక కూడా అదే. కనీసం వాడి కోరిక తీర్చడం కోసమైనా శ్రద్ధగా చదువు క్రిష్ణా" అన్నాడు.

తను వ్యవసాయం మీద ఆధారపడి బతుకుతున్నా, వ్యవసాయాన్ని పెదనాన్న ఎందుకు అస్యహించుకుంటున్నాడో నేను ఊహించగలను. తన తమ్ముడి ఆత్మహత్యకు కారణమైన వ్యవసాయం అంటే ఏహ్యభావం ఉండటం సహజమే. మరో పని చేతకాదు కాబట్టి ఇష్టం ఉన్నా లేకున్నా ఆయనకు వ్యవసాయం చేయటం తప్పని పరిస్థితి.

నేను ఇంటర్ ఫెయిలయ్యానని తెలిసి సంతోషపడిన ఒకే ఒక వ్యక్తి కాత్యాయని. మళ్ళా క్లాసులు మొదలయ్యేవరకు సెలవులే కాబట్టి నాలుగు రోజులు తన ఇంట్లో ఉండమని రమత్త పిలిస్తే ఒంగోలు వెళ్ళాను.

"బావా... నా కోసమే ఫెయిలయ్యావు కదా! నాకు తెలుసులే. పైకి కన్పించవు కానీ నువ్వు చాలా చిలిపి" అంది కళ్ళు వయ్యారంగా తిప్పుతూ. అది కూడా ఇప్పుడు ఇంటర్ సెకండ్ ఇయర్‌లో చేరబోతోంది.

అత్త వంటపనిలో మునిగి ఉన్న సమయంలో కాత్యాయని నాతో అన్న మాటలవి.

"నీ కోసం ఫెయిల్ కావటమేమిటి? ఎందుకలా? దానివల్ల ఒరిగేదేమిటి?" అన్నాను.

"నువ్వూ నేనూ ఇప్పుడు ఒకే క్లాస్‌లో ఉన్నాం కదా. అందుకేగా నువ్వు రెండు సార్లు డింకీ కొట్టావు. నువ్వు కూడా మా కాలేజీకి మారిపోయావనుకో, అప్పుడు ఎంచక్కా నా కాబోయే మొగుడితో కలిసి చదువుకోవటం మజాగా ఉంటుంది కదా" అంది.

"నేను కాబోయే మొగుణ్ణా? ఇదెవరు చెప్పారు?"

"మా అమ్మ చెప్పింది. నేను పుట్టిన వెంటనే మీ అమ్మ మా అమ్మకు మాటిచ్చిందట... ఇదే నా కోడలు అని. నేనప్పుడే నీకు పెళ్ళాన్నయిపోయాను తెలుసా".

"ఆ విషయం వదిలెయ్. ఇంతకూ కలిసి చదివినందువల్ల ఏంటట లాభం?"

"చాలా ఉంది బావా. మనం ఎంచక్కా క్లాసులు ఎగ్గొట్టి పార్కుల వెంట చెట్టాపట్టాలేసుకుని తిరగొచ్చు. కాఫీ షాపులకెళ్ళొచ్చు. మన ఊళ్లో పబ్బులు లేవనుకో. ఉంటే వాటికీ వెళ్ళి డ్యాన్సులు చేయొచ్చు. అప్పుడు ఒంగోలంతా మనిద్దరి పేరు మార్మోగిపోతుంది. ప్రేమ పక్షులమని ముద్ర పడిపోతుంది. ఆ తర్వాత పెళ్ళి..."

"చాల్లే... ఎప్పుడూ ప్రేమా పెళ్ళీ తప్ప మరో ధ్యాస ఉండదా?"



## జరిగిన కథ

**రా**మకృష్ణ తల్లి వసుధ పేరంటానికని వెళ్ళి, తిరిగి రాదు. ఆమె ఎవరితోనో విజయవాడ వెళ్ళి పోయిందని తెలుస్తుంది. తల్లికోసం విజయవాడంతా గాలిస్తాడు రామక్రిష్ణ. కానీ ఆమె కనిపించదు. తండ్రి ఎవరితోనో అక్రమ సంబంధం పెట్టుకుంటాడు. ఆ విషయం రామక్రిష్ణకి తెలియడంతో పొలంలో పురుగులమందు తాగి ఆత్మహత్య చేసుకుంటాడు తండ్రి. ఊరిపెద్దల సమక్షంలో రామక్రిష్ణ బాధ్యత వాళ్ళ పెదనాన్న తీసుకుంటాడు. **ఆ తర్వాత....**

"ప్రేమలేని జీవితం వృథా కదా బావా... ఇంక జీవితానికి అర్థం ఏం ఉంటుంది? ఎడారిలాంటి జీవితం. ప్రేమ ఉందనుకో వసంతంలో విరిసిన పూలవనంలా ఉంటుంది జీవితం."

"ఇన్ని మాటలు ఎక్కడ నేర్చుకున్నావు?"

"బావా, మీది పల్లెటూరు. మాది పట్టణం. ఇక్కడ అందరూ చాలా ఫాస్ట్ తెలుసా. వాళ్ళతో పోలిస్తే నేనే వెనకబడి ఉన్నాను".

"నువ్వు వెనకబడి ఉన్నావా తల్లీ... ఎవరన్నారలా? జీటీ ఎక్స్‌ప్రెస్ కన్నా ఫాస్ట్‌గా ఉన్నావుగా".

"మా క్లాస్‌లో బాయ్‌ఫ్రెండ్ లేని అమ్మాయే లేదు తెలుసా? కొంతమంది అమ్మాయిలకయితే ఇద్దరు ముగ్గురు బాయ్‌ఫ్రెండ్స్ కూడా ఉన్నారు. నాకే..."

నాకు భయమేసింది. ఇది ఎంతమంది బాయ్ ఫ్రెండ్స్‌ని తన చుట్టూ తిప్పుకుంటుందో అని.

"నీకెంతమంది కాత్యా?"

"ఒక్కడే"

"ఏం చదువుతున్నాడు? పేరేమిటి?"

"ఇంటర్ ఫెయిల్ క్యాండిడేట్‌లే. ప్రేమలో కూడా ఫెయిలే. ఏమీ తెలియని శుద్ధ బుద్ధావతారం" నా వైపు అదోలా చూస్తూ అంది.

దాని చెవి మెలితిప్పుతూ "అసలిలాంటి మాటలు ఎక్కడ నేర్చుకుంటున్నావు? నీ స్నేహితురాళ్ళెవరో చెప్పు. అత్తకు చెప్పి వాళ్ళను తిట్టిస్తాను" అన్నాను.

"నాకు నేర్పేది వాళ్ళు కాదు. ఇదిగో ఇవి" అంది అల్మరాలో ఉన్న పుస్తకాలు చూపిస్తూ.

అన్నీ నవలలు. అత్తకు పుస్తకాలు చదవటం బాగా అలవాటు. చిన్నమోస్తరు లైబ్రరీనే ఉంది ఇంట్లో.

అక్కడున్న వారం రోజులూ వాటిని చదువుతూ గడిపేశాను. నా ముందు ఓ కొత్త ప్రపంచం ఆవిష్కృతమైనట్టనిపించింది.

ఎన్నెన్ని జీవితాలలో... ఎన్నిరకాల అనుభవాలో... ఎన్ని ఆదర్శాలో... ఎన్ని కోరికలో... ఎన్ని ప్రేమలో... ఎన్ని త్యాగాలో... ఎన్ని వ్యధాభరిత కథలో...

ఆ సంవత్సరం శ్రద్ధగా చదివి ఇంటర్ పాసయ్యాను. డిగ్రీలో చేరాలా వద్దా అని ఆలోచిస్తున్న సమయంలో సుందరం తన పక్కన కూచోబెట్టుకుని "నీ ప్రాబ్లం ఏమిటో చెప్పు" అన్నాడు.

"ఎందుకో చదువు మీద మనసు నిలవటం లేదన్నా. పిచ్చిపిచ్చి ఆలోచనలు వస్తున్నాయి. మనసు పరిపరివిధాలా పోతుంది" అన్నాను.

సుందరం అదోలా నవ్వాడు. "ఈ వయసులో సహజంగా వచ్చే ఆలోచనలే అవి. టీనేజ్ కొచ్చావుగా! చిన్నాన్నలా బాగా పొడవు ఎదిగావు. మీసాలు కూడా మొలిచాయి. మీ క్లాస్‌లో అమ్మాయిలు బాగానే ఉంటారు. నేనూ చూశాలే. వాళ్ళ గురించేగా నీ ఆలోచనలు".

నాకెప్పుడూ అటువంటి ఆలోచనలు రాలేదు. నా క్లాస్‌లో ఉన్న అమ్మాయిల వైపు చూడాలని ఎప్పుడూ అన్పించలేదు.

"ఆ ఆలోచనలు కావన్నా. జీవితం గురించిన ఆలోచనలు".

సుందరం భృకుటి ముడివేశాడు. "జీవితం గురించిన ఆలోచనలా?" అంటూ మరుక్షణంలో పెద్దగా నవ్వి "ఇప్పుడు మన వయసులో జీవితం అంటే ఎంజాయ్ చేయడమే! నచ్చిన అమ్మాయితో ఫ్రెండ్‌షిప్ చెయ్. చుట్టూ ఉన్న ప్రపంచాన్ని కూడా మర్చిపోతావు. జీవితం రంగురంగుల రెయిన్‌బోలా కన్పించటం మొదలవుతుంది" అన్నాడు.



## శ్రియ డల్ అయిందా?

ఈ ప్రశ్నకు సమాధానం అవుననే అనుకోవాలి. ఒకప్పుడు ఏ సాంగ్‌కి అయినా తన స్టెప్పులే హైలైట్‌గా ఉండేవి. స్టెప్పుల్లో స్టార్ హీరోలను కూడా డామినేట్ చేసిన రికార్డు శ్రియకి ఉంది. అలాంటి హీరోయిన్ 'నక్షత్రం' సినిమాలో చేసిన ఐటెం సాంగ్ ఎలా ఉండాలి? రచ్చ రచ్చ చేసేలా ఉండాలి. కానీ ఆ మెరుపులేవీ కనపడలేదు. ఈ సాంగ్‌ని శ్రియ చాలా సాదాసీదాగా చేసేసిందనీ, ప్రత్యేక గీతం అన్న ఫీలింగే ఎవరికీ రాలేదనీ అంటున్నారు. శ్రియ ప్రస్తుత పరిస్థితికి ఆమె వయస్సే కారణం అంటున్నారు సినీ జనాలు. మూడుపదులు దాటిన వయస్సులో కుర్ర హీరోయిన్లతో పోటీపడాలంటే కష్టమే కదా అని కూడా అంటున్నారు.



"అసలు జీవితమంటే ఏమిటి? పుట్టడం పెరగడం చనిపోవడం... ఇదేనా జీవితం? ఇదే జీవితమైతే మనుషుల్లో ఇంత వైవిధ్యం ఎందుకుంది? నా జీవితంలోనే ఇన్ని అనర్థాలు ఎందుకు జరిగాయి? నిజంగా దేవుడున్నాడా? అతనే మనుషుల నుదుట రాతలు రాస్తాడా? నా నుదుట ఇలాంటి రాత ఎందుకు రాశాడు? కొందరి జీవితాల్లో సంతోషాలు నిండి ఉండటానికి, కొందరి జీవితాలు దుఃఖమయం కావడానికి కారణం ఏమిటి?"

సుందరం నావైపు వింతగా చూశాడు.

"ఒరేయ్ రామక్రిష్ణా... అంతంత పెద్దమాటలు మాట్లాడకురా. నాకు భయమేస్తోంది. వయసైపోయిన ముసలాళ్ళు ఆలోచించాల్సిన విషయాలవి. మనమింకా జీవితంలోని మొదటి అంకంలోనేగా ఉన్నాం".

"ఈ విషయాల గురించి ఆలోచించడానికి వయసుతోనూ, అనుభవంతోనూ పనిలేదన్నా. అలాగైతే ప్రతి వ్యక్తికి ముసలితనంలో వీటికి సంబంధించిన జ్ఞానం కలగాలి. నా ఉద్దేశంలో దానికి కావల్సింది ఆలోచన. నిరంతర సాధన వల్ల ఆ ఆలోచనలో పరిపక్వత ఏర్పడుతుంది. స్పష్టత చేకూరుతుంది".

"అంత బరువైన విషయాలు మనకెందుకురా? సుఖంగా ఉండే ప్రాణాన్ని కష్టపెట్టుకోవడం కాకపోతే..."

"నాకాపదం వింటేనే రోతగా ఉంటుందన్నా. సుఖం అంటే ఏమిటి? మనిషిగా పుట్టింది దొరికిన సుఖాల్ని అనుభవించడానికేనా? అంతేనా జీవితమంటే?"

"ఒరేయ్, మీ అమ్మానాన్న నీకు రామక్రిష్ణ అని మాత్రమే పేరు పెట్టారు. నువ్వేమీ మరో రామక్రిష్ణ పరమహంసవి కానక్కరలేదు. ఇలాంటి విషయాలు వదిలేయ్".

"వదలను. నా జీవిత ధ్యేయం అదే. నా జీవితం నిండా దుఃఖం పర్చుకుని ఉండటానికి కారణం ఏమిటో తెలుసుకోవడం. ఇది విధి లిఖితమా? ఎప్పటికైనా తెలుసుకుంటాను చూడు".

"అందుకేరా నువ్వంటే నాకిష్టం. నువ్వు అందరి లాంటి వాడివి కాదు. నీలో ఏదో ప్రత్యేకత ఉంది. కానీ నువ్వనుకున్నది సాధించాలంటే నీకు చదువు చాలా అవసరం. ఫిలాసఫీ సబ్జెక్ట్‌తో డిగ్రీ చేయి. మొదట కొంత అవగాహన ఏర్పడుతుంది. ఆ తర్వాత ఏం చేయాలో నిర్ణయించుకుందువుగాని" అన్నాడు.

నాకు వాడిచ్చిన సలహా బాగా నచ్చింది. జీవితం గురించి తెలుసుకోవాలంటే మన ఆలోచనా పరిధి విస్తృతం కావడం అవసరం. దానికి దోహదం చేసేది చదువే. అందుకే మరో ఆలోచన లేకుండా డిగ్రీలో చేరిపోయాను.

***

డిగ్రీలో చేరిన మొదటిరోజు నన్ను బాగా ఆకర్షించిన వ్యక్తి మోహిత్. హిస్టరీ పీరియడ్లో నేను కూచున్న బెంచీలోనే నా పక్కన కూచుంటూ, "హాయ్... ఐయాం మోహిత్" అన్నాడు షేక్‌హ్యాండ్ కోసం చేయి చాపుతూ.

> **రూం తీసుకుని ఒక్కడే ఉంటున్నాడతను. గలగలా మాట్లాడతాడు. తన మాటలతో అందర్నీ ఇట్టే ఆకర్షిస్తాడు. ఒకరోజు అతని రూంకి వెళ్ళాడు రామకృష్ణ. రాత్రి ఏడుగంటల వరకూ కబుర్లు దొర్లుతూనే ఉన్నాయి. ఎక్కువగా అమ్మాయిల గురించే! మధ్యలో జీవితం గురించిన సంభాషణ మొదలైంది. మరి ఆ సంభాషణ ఎక్కడికి దారితీసింది? వారిద్దరి అభిప్రాయాలు కలిశాయా?**

ఎంతందమైన నవ్వో... అయస్కాంతంలా తన వైపు లాగేసే నవ్వు. దాదాపు నా అంత ఎత్తున్నాడు. అమ్మాయిలా తెల్లగా నాజూగ్గా ఉన్నాడు. రింగు రింగుల జుట్టు. విశాలమైన కళ్ళు. చాలా అందంగా ఉన్నాడు. నేను అప్రయత్నంగానే అతని చేతిని అందుకుని "హాయ్... ఐయాం రామక్రిష్ణ" అన్నాను.

మోహిత్ చాలా సరదా మనిషని నాకు మొదటి రోజే అర్థమైంది. గలగలా మాట్లాడే మోహిత్‌కీ చాలా పొదిగా మాట్లాడే నాకూ మధ్య తొందరలోనే మంచి స్నేహం కుదిరింది.

"నువ్వెప్పుడూ ఇంతేనా... ఎక్కువ సమయం మౌనంలోనే గడుపుతావెందుకు? మాట్లాడటం మనిషికి మాత్రమే దేవుడిచ్చిన వరం. మాట్లాడితేనే కదా నీ మనసులో ఏముందో ఎదుటి వ్యక్తికి తెలిసేది" అన్నాడు.

నేను నవ్వి ఊరుకున్నాను. 'వసపిట్ట బాబోయ్' అనేది అమ్మ. అమ్మతో పాటే నా ఆ వాగుడు తనమూ పోయింది. ఇప్పుడు ఎవ్వరితో మాట్లాడాలనిపించదు. ఎవ్వరితో కలవాలనిపించదు. మనసులోని అలజడినీ, అశాంతినీ మోస్తూ ఒంటరిగా కూచోవాలనిపిస్తుంది.

"నాలా పదిమందిని పోగేయమనడం లేదు. నీకు నచ్చిన ఒకరిద్దరితోనైనా మనసువిప్పి మాట్లాడొచ్చుగా" అన్నాడు.

"నీతో మాట్లాడుతున్నాగా" అన్నాను.

"నేను చాలా అదృష్టవంతుణ్ణన్నమాట" అన్నాడు కన్నుగీటుతూ.

"ఓ రోజు సాయంత్రం కాలేజీ వదిలాక "ఈరోజు నీ ప్రోగ్రాం ఏంటీ?" అని అడిగాడు.

"ఏముంది... మామూలే... సైకిల్ తొక్కుకుంటూ మా ఊరెళ్లడమే" అన్నాను.

"వెళ్ళొచ్చులే. తొందరేముంది? ఈ రోజు నారూంకి వెళ్దాం" అన్నాడు.

వాళ్ళ నాన్నకు విజయనగరం బదిలీ అయిందట. అందుకే మోహిత్ రూం తీసుకుని ఉంటున్నాడు. మోహిత్ చేత హిస్టరీలో ఎం.ఏ చదివించి సివిల్ సర్వీసెస్ పరీక్షలు రాయించాలనేది వాళ్ళ నాన్న కోరికట.

అతని రూం లాయర్‌పేటలో ఓ ఇంటి మేడమీద ఉంది. గేట్ తీశాక పక్కనుంచి దానికి మెట్లున్నాయి. కింది పోర్షన్లో ఇంటి యజమాని ఉంటారట.

ఓ గది... దానికానుకుని బాత్రూం... అంతే. గది విశాలంగా ఉంది. పొందిగ్గా సర్ది ఉంది. ఇనుప మంచం మీద దూదిపరుపు వేసి ఉంది. దానిమీద దుప్పటీ దిండూ...అన్నీ వాటి వాటి స్థానాల్లో కుదురుగా ఉన్నాయి. ఓ బ్యాచిలర్ గది అంత శుభ్రంగా ఉండటం ఆశ్చర్యాన్ని కలిగించింది.

"నీకు నీట్‌నెస్ అంటే చాలా ఇష్టంలా ఉందే" అన్నాను.

మోహిత్ కళ్ళని రాజేష్‌ఖన్నాలా మూసి, తెరచి నవ్వాడు. "కొన్ని రహస్యాలు చెప్పకూడదు".

"రహస్యమా? ఏంటది?"

"అంత తొందరెందుకు? మెల్లమెల్లగా నీకే తెలుస్తాయిలే. ఎటొచ్చీ నువ్వు నా రూంకి తరచూ వస్తూ ఉండాలి సుమా. అప్పుడే తెలిసేది".

ఓ గంటసేపు పిచ్చాపాటి మాట్లాడుకున్నాం. ఎక్కువగా మోహితే మాట్లాడాడు. నేను వింటూ ఉండిపోయాను. చీకటి పడింది.

"ఇంకనేను బయల్దేరటం మంచిదేమో" అన్నాను.

"ఈ రాత్రికి ఇక్కడే ఉండిపోకూడదూ... ఇద్దరం

కలిసి భోంచేద్దాం. రాత్రంతా కబుర్లు చెప్పుకోవచ్చు. ఈ గదిలో కాకుండా బైట మంచం వేసుకుందాం. ఆకాశంలో మెరిసే నక్షత్రాలనీ, వెన్నెలనీ ఆస్వాదిస్తూ పడుకుంటే ఎంత బావుంటుందో తెలుసా" అన్నాడు.

"మాది పల్లెటూరని తెల్సుగా. ఎండాకాలమంతా మేం చేసే పని అదే".

"నా రహస్యమేదో తెలుసుకోవటం కోసమైనా ఉండిపో".

"ఇంట్లో చెప్పి రాలేదుగా. పెద్దమ్మ కంగారు పడుతుంది. మరోసారి చూద్దాంలే".

"నువ్వు నెలలో రెండు మూడు రోజులు మీ అత్తావాళ్లింట్లో ఉంటావుగా. నువ్వు వెళ్ళకున్నా మీ అత్తావాళ్లింటికి వెళ్ళావనుకుంటుందిలే మీ పెద్దమ్మ".

"లేదు. నేను అత్తావాళ్ళింటికెళ్ళాలన్నా మొదట పెద్దమ్మ అనుమతి తీసుకునే వెళతాను".

"పెద్ద చిక్కొచ్చి పడిందే నీతో" అంటూ తన జేబులోని సెల్‌ఫోన్ నా చేతికిచ్చి "ఇంటికి ఫోన్ చేసి చెప్పు" అన్నాడు.

"మా ఇంట్లో ఎవరి దగ్గరా సెల్‌ఫోన్ ఉండదు".

"చాలా ఆశ్చర్యంగా ఉందే. ఈ రోజుల్లో సెల్ ఫోన్ లేని ఇళ్ళు కూడా ఉన్నాయా? పల్లెటూర్లలో కూడా సెల్‌ఫోన్లు, ఇంటర్నెట్ సౌకర్యాలు ఉన్న రోజులు కదా".

"నాకు సెల్‌ఫోన్లు ఇష్టముండదు. మా పెద నాన్నకు కూడా ఇష్టముండదు" సుందరం దగ్గర ఉందన్న విషయం మాత్రం చెప్పలేదు.

"అందుకే నువ్వంటే నాకిష్టం. ఇంకా పసిపిల్లా డివే. నా అంతగా ఎదగాలంటే నీకింకా పదేళ్ళు పట్టేలా ఉంది" అంటూ నవ్వాడు.

మరునాడు ఇంటి నుంచి కాలేజీకి బయల్దేరే ముందు నా ఫ్రెండ్ రూంలో రాత్రికి ఉండిపోతా నని పెద్దమ్మతో చెప్పాను.

"జాగ్రత్త రామక్రిష్ణా! మంచివాళ్ళతోనే స్నేహం చేయి. మీ వయసు కుర్రాళ్ళు బాగుపడినా చెడి పోయినా దానిక్కారణం స్నేహితుల ప్రభావమే. ఇంతకూ ఆ కుర్రాడు మంచివాడేనా" అని అడిగింది.

"చాలా మంచివాడు పెద్దమ్మా" అన్నాను.

సుందరం కల్పించుకుని "అమ్మా... తమ్ముడు చెడ్డవాళ్ళతో స్నేహం చేసి చెడిపోతాడని కదా నీ భయం. దానికి అవకాశమే లేదు. వీడి మంచితనంతో వాళ్ళని కూడా మంచివాళ్ళుగా మార్చేస్తాడు. మన వాడు మరో రామక్రిష్ణ పరమహంస కదా" అన్నాడు.

"ఏమో నాయనా... నా భయం నాది. తల్లీ తండ్రీ లేని పిల్లవాడు. రేపేం జరిగినా పెద్దమ్మా పెదనాన్నా సరిగ్గా పట్టించుకోక పోవడం వల్లే పిల్ల వాడు ఇలా తయారయ్యాడని ఎవరైనా అంటే మాకు చెడ్డ పేరొస్తుంది" అంది.

"మీకు చెడ్డపేరు రానివ్వను పెద్దమ్మా. నన్ను నమ్ము" అన్నాను.

ఆ రోజు కాలేజీ అయిపోయాక మోహిత్‌తో కలిసి అతని రూంకెళ్ళాను.

రాత్రి ఏడు దాటేవరకూ కబుర్లు చెప్పుకున్నాం. మోహిత్ చెప్పే కబుర్లు ఎక్కువగా అమ్మాయిల గురించే ఉంటాయి. మా క్లాస్‌లో ఎనిమిదిమంది అమ్మాయిలున్నారు. అందులో ఎవరు అందగత్తెలో, ఎవరి నవ్వు బావుంటుందో, ఎవరి నడుం దగ్గర మడత ఉందో... ఇవే..

"ఇలాంటి చెత్తకబుర్లు నాకెందుకు చెప్తావు? ఈ విషయాల్లో నాకు అసక్తిలేదని చెప్పాగా" అన్నాను.

"చెత్తకబుర్లా... వింతగా ఉందే! ఈ వయసులో కుర్రాళ్ళంతా ఇష్టపడే కబుర్లు నీకెందుకు నచ్చవు? ఆడపిల్లలు అయస్కాంతాల్లా ఆకర్షించే వయసు కదా మనది. నీలో మగ హార్మోన్లు సక్రమంగా ఉన్నాయో లేవో ఓసారి డాక్టర్ చేత పరీక్ష చేయించుకో" అన్నాడు.

"జీవితం అంటే ఇదేనా? ఇలా వయసొచ్చాక ఆడపిల్లల వెంటపడి, అల్లరి చేసి, శారీరక సుఖాల కోసం వెంపర్లాడి, పెళ్ళి చేసుకుని, పిల్లల్ని కని... చని పోవడానికేనా? జంతువులు చేసేది కూడా అదేగా".

"జంతువులు ప్రేమించవు. పెళ్ళి చేసుకోవు. మనలా మాట్లాడవు. మనలా నవ్వలేవు. మనలా ఆలోచించలేవు కూడా. ఎన్నితేడాలో చూశావా మనకూ జంతువులకూ? ఆహార నిద్రా మైథునాలు అన్ని ప్రాణులకు సహజం. అలాగని అన్ని ప్రాణులూ

## మనమీదేనర్రోయ్!

సరసి





## నవ వరూధిని

మోహపు చూపుల కిటికీలు తెరిచి
నవ'వరూధిని'లా నన్నాకర్షిస్తావు.
గుండె లోతుల్లో ఏముందో..
గుట్టుగా కళ్ళతోనే లీలగా చెప్పేస్తావు.



ఆగమన నిష్క్రమణల్లో..
కావాలనే కవ్విస్తూ నా కంటబడతావు.
నన్ను నీలోకి ఒంపుకుంటూనే..
నా అణువణువు సర్వం నిండిపోతావు.

జ్ఞాపకాల లేలేత పసరు పూసి
నీ వెంటే నిత్యం నీడలా తిప్పుకుంటావు.




ప్రణయ అనలం చల్లార్చాలని..
మత్తుగా మల్లెతీగలా చుట్టుకుంటావు.

వద్దన్నా అదేపనిగా
జారే నీ సిరుల ముంగురులు..
మిస్సిసిపిలా పొడవైన
నీ తమక తామస కురులు..
నిర్దయగా నడినిశిలో
నిద్రలేపే నీ అందెల రవళులు..
నువ్వు ప్రయత్నంగా చేసే
నీ చేతిగాజుల చిరుసవ్వడులు..

నాకు నేనుగా కావాలనే ఇప్పుడు
పాదలేపాన్ని పోగొట్టుకున్న నవ..
ప్రవరాఖ్యుడినై నీ చుట్టూ తిరుగుతూ.

**—అశోక్ అవారి, సెల్: 90005 76581**

సమానం కావుగా. మన ఆహార అలవాట్లు వేరు. జంతువులవి వేరు. అలానే మైథునం కూడా. ఆడ పిల్లలవెంట పడినంత మాత్రాన, శారీరక సుఖాన్ని కోరుకున్నంత మాత్రాన మనుషుల్ని జంతువులతో పోల్చడం తప్పు".

"మనుషులు జంతువులతో సమానమని అనడం లేదు. కాని జంతువులు చేసేవే మనుషులు చేస్తున్నారంటున్నా... నువ్వు చెప్పినట్టు అవి చేస్తున్న విధానాలు వేరు కావచ్చు. కానీ జరుగుతున్నది మాత్రం అదేగా. పుట్టడం, తినడం, ఎదగటం, సెక్స్, పిల్లల్ని కనడం, వయసై పోయాక చనిపోవడం... ఇంతేగా! మరి మనిషికి మేధోశక్తి ఉన్నందుకు, ఆలో చించగలుగుతున్నందుకు జంతుజీవనానికి భిన్నంగా ఏదో ఒకటి సాధించాలిగా".

"రాతియుగం నాటి నుంచి నేటివరకు మనిషి తన తెలివితేటలతో సాధించిన అద్భుతమైన ప్రగతి నీ కళ్ళకు కన్పించడం లేదా? గాల్లో తేలే విమా నాలు, సముద్ర ప్రయాణాలకు ఓడలు, నీటి లోపల కదిలే సబ్‌మెరైన్లు, అధునాతనమైన మార ణాయుధాలు, కమ్యూనికేషన్ రంగంలో విప్లవం తెచ్చిన సెల్‌ఫోన్లు, ప్రపంచాన్ని మన గుప్పిట్లో ఇమిడ్చే ఇంటర్నెట్... ఎన్నని చెప్పమంటావు? వైద్య రంగంలో అయితే సృష్టికి ప్రతిసృష్టి చేయగలుగు తున్నారు. కృత్రిమ అవయవాల్ని తయారుచేస్తు న్నారు..."

అతన్ని మధ్యలోనే ఆపి చెప్పాను. "అవన్నీ నాకు తెలుసు. అన్నీ మనిషి మరింత సౌకర్యవంతమైన సుఖప్రదమైన జీవితం గడపడానికి ఉపయోగ పడేవే. ఇవన్నీ మనిషికి బాహ్య ప్రపంచంలో అవ సరమైన హంగులూ ఆర్భాటాలే. నేను మాట్లాడేది మనిషి లోపలి ప్రపంచం గురించి. మనం మానవ జన్మ ఎత్తడానికి కారణం ఏమిటి? అసలీ సృష్టి రహస్య మేమిటి? మనిషి జీవితానికి అర్థమేమిటి? మని షిగా మన గమ్యమేమిటి?"

"హాయిగా జీవితాన్ని అనుభవించక ఎందుకీ పనికిరాని ఆలోచనలు?"

"జీవితంలోని మార్మికత ఓ పట్టాన అంతు చిక్కేది కాదు. దాన్ని శోధించాలి. మొదట వెతకడం మొదలెడితేనే కదా దొరుకుతుందో లేదో తెలిసేది? ఎవరికో ఎంత వెదికినా దొరకలేదని మనం కూడా చేతులు ముడుచుకుని కూచుంటే రహస్యాలు ఎప్ప టికీ వెల్లడి కావు".

"చూడు రామక్రిష్ణా... ముసలాడిలా వేదాంతం మాట్లాడకు. వయస్సు మళ్ళిన, ఎముకలు కుళ్ళిన వాళ్ళ గురించి శ్రీశ్రీ చెప్పినట్టు మనకింకా ఆ పరి స్థితి దాపురించలేదు. ఎవరో మహానుభావుడన్నాడుగా మనిషి సోషల్‌యానిమల్ అని. నా ఉద్దేశంలో జీవిత మంటే అందినన్ని సుఖాల్ని జుర్రుకోవడం".

"లేదు మోహిత్... నేనొప్పుకోను. సుఖాల్ని అను భవించడమే జీవిత పరమార్థమనుకుంటే గొప్ప గొప్ప మహానుభావులు పుట్టుకొచ్చేవారు కాదు. రామక్రిష్ణ పరమహంస, వివేకానంద, మదర్ థెరిస్సా, రమణ మహర్షి..."

"బాబూ.... ఆపేయి. ఇక వినలేను. సరే. సుఖాల కోసం కాకపోతే సంతోషంగా బతకడమే జీవిత పర మార్థమై ఉంటుంది. సుఖం నుంచేగా సంతోషం వచ్చేది. మళ్ళీ మనం మొదటికే వచ్చాం. అంటే సుఖాలని అనుభవించడమే జీవితం".

"సుఖాలని పొందడం ద్వారానే సంతోషం కలుగు తుందనుకోను. అన్నార్తులకీ అభాగ్యులకీ సేవ చేయ డంలో సుఖం లేదు, సంతోషం ఉంటుంది. పెడదోవ పడుతున్న మానవ సమూహాల్ని మంచిమార్గం వైపు మళ్ళించే ప్రయత్నం చేయడంలో సంతోషం ఉంటుంది. త్యాగంలో, ప్రేమించడంలో, క్షమించ డంలో, ఆపన్నుల్ని ఆదుకోవడంలో సంతోషం ఉంది".

"నువ్వే అన్నావుగా ప్రేమించడంలో సంతోషం ఉందని... అదేగా నేనూ చేస్తున్నాను. మన క్లాస్‌లో ఉన్న సగం మంది అమ్మాయిల్ని... అదేలే అందంగా ఉన్న అమ్మాయిల్ని ప్రేమిస్తున్నాను" అంటూ నవ్వాడు.

"నేను చెప్పే ప్రేమ భౌతికమైంది కాదు. మని షికీ మనిషికీ, మనిషికీ మిగతా ప్రాణికోటికీ మధ్య ఉండాల్సిన అద్వితీయమైన ప్రేమ... అలౌకికమైన ప్రేమ... దైవత్వం నిండిన ప్రేమ".

"అంతంత బరువైన పదాలు విసరకు రామ క్రిష్ణా.... బరువు మోయలేను. నీ ఆలోచనలే కాదు నీ భాష కూడా బరువే. ఇప్పటివరకు నా బుర్ర తినింది చాలు. పద ఆకలి వేస్తోంది" అన్నాడు లేచి నిలబడుతూ.

ఇద్దరం రోడ్డు మీద మెల్లగా నడుస్తున్నాం. ఎదురుగా ఎవరైనా అమ్మాయి కన్పిస్తే చాలు పస్తు లున్న వాడి కళ్ళకి పరమాన్నం కన్పించినట్టు కళ్ళు విప్పార్చి చూస్తున్నాడు.

"ఏమొస్తుంది అలా చూస్తే?" అన్నాను.

"కళ్ళు సౌందర్యాన్ని చూడగానే సంతోషంతో విప్పారతాయి. మనసు మధువు తాగినంత మత్తుగా సోలిపోతుంది. ఎవరో కవి అన్నాడుగా ఏ థింగ్ ఆఫ్ బ్యూటీ ఈజ్ జాయ్ ఫర్ ఎవర్ అని"

"జాన్ కీట్స్".

"ఎవరైతే ఏంగానీ చాలా గొప్ప జీవిత సత్యాన్ని చెప్పాడు. అందమే ఆనందం, ఆనందమే జీవిత మకరందం అని మన తెలుగు కవి కూడా ఏనాడో చెప్పేశాడుగా".

"సమర్థించుకున్నది చాల్లే. నువ్వలా గుడ్లప్ప గించి చూస్తే ఆడపిల్లలు ఎంత అసౌకర్యానికి గురవు తారో ఆలోచించావా?"

మోహిత్ పెద్దగా నవ్వాడు. "నువ్విలా రుషిలానో మునిలానో కళ్ళూ ముక్కూ మూసుకుని తపస్స మాధిలో కూచుంటే ఇలాంటి నెగెటివ్ ఆలోచనలే వస్తాయి. ఆడపిల్లల్ని అర్థం చేసుకోవాలంటే వాళ్ళతో సన్నిహితంగా మెలగాలి. నీకో విషయం తెలుసా? మనం అలా చూడాలనే వాళ్ళూ కోరుకుంటారు. ఎందుకంతగా సింగారించుకుని బైటికొస్తారనుకు న్నావు? అందుకే".

నాకతని ఆలోచన నచ్చలేదు.

ఎదురుగా డైమండ్ బార్ అండ్ రెస్టారెంట్ అన్న బోర్డు కన్పించింది. అందులోకి మోహిత్ దారి తీస్తుంటే ఆపాను. "మనం భోజనానికి హోటల్‌కి కదా వెళ్ళాలి? ఇక్కడికెందుకు పిల్చుకొచ్చావు?"

"ఇక్కడా భోజనం దొరుకుతుంది".

"నేను తాగను"

"నేను తాగుతాను. నాకు కంపెనీ కావాలనే నిన్ను పిల్చుకొచ్చాను. పద లోపలికి" అంటూ చేయి పట్టుకుని లోపలికి లాక్కెళ్ళాడు.

*(ఇంకా వుంది)*



## మిస్టర్ నీడ్స్

పని ఒత్తిడి, ఉరుకుల పరుగుల జీవితంలో, ముఖ్యంగా పట్టణప్రాంత నివాసితులకు కిరాణా సరుకులు కొనేందుకు కూడా సమయం చిక్కడం లేదు. అందుకే చాలా మంది ఆన్‌లైన్ షాపింగ్ బాట పట్టారు. కూరగాయల దగ్గరనుంచీ ఎల్క్ట్రానిక్ వస్తువుల వరకూ ప్రతీ ఒక్కటీ ఆన్‌లైన్ ద్వారానే కొనుగోళ్ళు జరుపుతున్నారు. అసలు ప్రస్తుతం వర్చువల్ సూపర్ మార్కెట్లు ఆఫర్ చేయని వస్తువంటూ లేదంటే నమ్మండి. ఈ డిమాండ్ నుంచి పుట్టుకొచ్చిందే మిస్టర్ నీడ్స్. నోయిడాకు చెందిన ఈ మైక్రో డెలివరీ స్టార్టప్ యాప్ బేస్డ్ సబ్‌స్క్రిప్షన్ సర్వీసులను అందిస్తోంది.

హితాషి గార్గ్, రవి వాద్వా, రవివర్మ, యోగేష్ గార్గ్ అనే నలుగురు మిత్రుల ఆలోచనా ఫలితం ఈ స్టార్టప్. 2016 అక్టోబర్‌లో తన సేవలను ప్రారంభించింది. రోజుకి ఎంతలేదన్నా 1200 ఆర్డర్లు డెలివరీ




చేస్తుంది. ఉదయం ఆరింటి నుంచి రాత్రి తొమ్మిది వరకు అన్ని రకాల సరుకులను చేరవేస్తారు. రోజుకి సగటున ఆర్డర్ సైజ్ రూ. 120 నుంచి 140 వరకు ఉంటుంది. ఇంకో విశేషం ఏంటంటే వీళ్ల ఎలాంటి డెలివరీ చార్జీలు వసూలు చేయరు. ఎంత మొత్తమైనా ఆర్డర్ చేయొచ్చు. మినిమమ్ ఆర్డర్ అంటూ నియమం లేదు. మిస్టర్ నీడ్స్ కేవలం అపార్ట్‌మెంట్ కాంప్లెక్సుల్లో మాత్రమే సర్వీస్ అందిస్తోంది. ఆర్డర్ టు సర్వ్ మోడల్‌లో సస్టెయినబుల్ బిజినెస్ చేస్తోంది. డెలివరీ చార్జీలు వసూలు చేయడం లేదు, మినిమమ్ ఇంత ఆర్డర్ చేయాలని రూలేం పెట్టలేదు కాబట్టి, కస్టమర్ చిన్న పాల ప్యాకెట్ కావాలన్నా, బిస్కెట్ ప్యాకెట్ కావాలన్నా తీసుకెళ్లి ఇస్తున్నారు.

మైక్రో డెలివరీ మార్కెట్లో మిస్టర్ నీడ్స్ మాత్రమే ఉంది. 4వేల గ్రాసరీ ఐటమ్స్ ఆర్డర్ చేసినా, తెల్లారేసరికల్లా ఇంటిముందు ఉంచుతారు. ఒకవేళ ఆర్డర్ చేసిన వస్తువుల్లో అవసరం లేదనిపించిన ఐటమ్‌ని కట్ ఆఫ్ టైంకల్లా తీసేయొచ్చు. అంతేకాదు ఫలానా టైంలోనే డెలివరీ ఇస్తాం అని కండిషన్ పెట్టటంలేదు మిస్టర్ నీడ్స్. ఆర్డర్ సైజ్ ఎంతున్నా, మూడు గంటల్లో తలుపు కొట్టేస్తారు.

ప్రస్తుతానికి టీంలో 80 మంది వర్క్ చేస్తున్నారు. అందులో మెజారిటీ ఫీల్డ్ వర్కర్స్‌గా ఉన్నారు. ఇంకో 20 మంది బిజినెస్ ఫంక్షన్స్ చూసుకుంటారు. త్వరలో ఢిల్లీ, ద్వారక, ఇందిరాపురం, గుర్గావ్‌లో మిస్టర్ నీడ్స్ ఆపరేషన్స్ విస్తరించాలని భావిస్తోంది.

**–లక్ష్మీశ్రీ నర్మద**






### తీర్పు

**గోవిందు నరసింహారావు**
ధర: అమూల్యం
**పేజీలు:** 184
**ప్రతులకు:** రచయిత, ప్లాట్ నెం 202, ముకుంద బృందావనం, గాయత్రీనగర్, రోడ్ నెం 5, పోతిన మల్లయ్యపాలెం, విశాఖపట్నం
ఫోన్: 9951381480

ఉత్తరాంధ్ర సీనియర్ కథా రచయిత గోవిందు నరసింహారావు. క్రమశిక్షణ, నిబద్ధతతో విద్యార్థులను తీర్చిదిద్దిన ఉపాధ్యాయుడు మాత్రమేకాదు, అక్కడి మాండలికం, అర్ధశతాబ్దంనాటి అగ్రహార జీవనశైలితో మమేకమైనవారు ఆయన కథలు ఇంగ్లీషు సహా ఇతర భాషల్లోకి కూడా వెళ్ళాయి. పద్నాలుగు కథల సంపుటి ఇది. టైటిల్ కథ 'తీర్పు' స్వాతంత్ర్యం రాకమునుపునాటి వాస్తవఘటన ఆధారిత రచన. ఆనాటి గ్రామీణబాష, ప్రజల అమాయకత్వం, గ్రామపెద్దపై అపారనమ్మకం, అసూయలు, ద్వేషాలు సహా ఆనాటి భాషను కళ్ళకు కట్టిన కథ 'తీర్పు'. నేడు మరుగున పడుతున్న ఆనాటి నానుడులు, మాటతీరును బొమ్మ కట్టిన కథలివి. పాతకాలపు అనురాగాలు, మానవ విలువలు, ఆనాటి చర్చలు, పంతాలు, పట్టింపులు వంటివెన్నో మనల్ని మేధోమథనానికి గురిచేస్తాయి.

### ఎస్.శంకర్ నారాయణ కలం రేఖలు

**ఆదికవి నుంచి....ఆధునిక రచయితల వరకు**
**రచన: ముళ్ళపూడి శ్రీదేవి**
ధర: 200 రూపాయలు
**పేజీలు:** 198
**ప్రతులకు:** ప్లాట్ నెం 129, శ్రీసాయి సదన్, ఫేజ్ 3, కమలాపురి కాలనీ, హైదరాబాద్–73 మరియు నవోదయ బుక్‌హౌస్, కాచిగూడ, హైదరాబాద్, పెన్సిల్ స్కెచ్ చిత్రకారుడు, బాపు తమ్ముడు సత్తిరాజు శంకర్‌నారాయణ. పెన్సిల్‌తో ప్రముఖుల పోర్ట్రైట్స్ చిత్రించడంలో దిట్ట. ఆయన వేసిన మూడువేల పోర్ట్రైట్స్‌లో 250కి పైగా తెలుగు రచయితలవే. వీటిల్లో చాలావరకు నవ్యవీక్లీలో వెలువడ్డాయి. 197మంది సాహితీమూర్తుల పెన్సిల్ స్కెచ్ చిత్రాల పుస్తకమిది. కవిత్రయం మొదలు ఈనాటివరకు ప్రముఖుల చిత్రాలు వారి సంక్షిప్త పరిచయం ఇందులో నిక్షిప్తమయ్యాయి.





### డా.వి.ఆర్.రాసాని సాహిత్య సమాలోచన

**సంపాదకులు: ఆచార్య నాగోలు కృష్ణారెడ్డి, డా.పి.సి.వెంకటేశ్వర్లు**
ధర: 300 రూ. **పేజీలు:** 359
**ప్రతులకు:** రచయిత, బాలాజీ రెసిడెన్సీ, మునిరెడ్డి నగర్, తిరుపతి–02 సెల్: 98484 43610 మరియు విశాలాంధ్ర, ప్రజాశక్తి పుస్తక కేంద్రాలు

తెలుగువారు గర్వించదగ్గ గొప్ప రచయిత, బహుముఖీన ప్రతిభాశాలి డాక్టర్ వి.ఆర్. రాసాని. మంచి కథకుడు, కవి, నవలారచయిత, నాటకకర్త. అంతేకాదు, సాహిత్య విమర్శకుడు, కాలమిస్టు, రంగస్థల నటుడు కూడా. ఆయన రచనలు పల్లె జీవనానికి దర్పణం. ఆయన సాహిత్యానికున్న పదునేమిటో ఈ పుస్తకంలోని ఎనిమిది భాగాల్లో చదువుకోవచ్చు. రాసాని కథానవలా సాహిత్య విశ్లేషణ, కవితామాధుర్యం, సమాజానికి దర్పణం పట్టిన నాటకాలు, వ్యాసాలను పలువురు ఇందులో విశ్లేషించారు.

## స్వీకారాలు

### అద్భుత మెమరీ–తిరుగులేని విక్టరీ

రాజశేఖర్
ధర: 45 రూపాయలు,
**పేజీలు:** 112
**ప్రతులకు:** యస్.ఆర్.బుక్ లింక్స్, దానయ్యవీధి, మాచవరం, విజయవాడ –4
**ఫోన్:** 0866–2436959

### అమెరికాలో ఆరు నెలలు

కొండపల్లి నీహారిణి
ధర: 80 రూపాయలు
**పేజీలు:** 152
**ప్రతులకు:** కొండపల్లి వేణుగోపాలరావు, ప్లాట్ నెం 559, శ్రీశ్రీహోమ్స్, అల్మాస్‌గూడ, హైదరాబాద్–58., పాలపిట్ట బుక్స్, సలీంనగర్, మలక్‌పేట, హైదరాబాద్–36.
**ఫోన్:** 040–27678430

### మధురాంతకం మహేంద్ర కవిత్వం

సౌభాగ్య
ధర: 50 రూపాయలు, **పేజీలు:** 64
**ప్రతులకు:** విశాలాంధ్ర, నవచేతన బుక్‌హౌస్ బ్రాంచీలు

**–లలితాత్రిపురసుందరి**

## కల నిజమాయెగా..కోరిక తీరెగా

కలలు కనండి వాటిని సాకారం చేసుకోండి అని మాజీ రాష్ట్రపతి అబ్దుల్‌కలాం చెప్పినమాట మనందరికీ తెలిసిందే. చాలామంది ఎన్నెన్నో సాధించాలని కలలు కంటుంటారు కానీ వాటిని నిజం చేసుకోవడానికి ఆసక్తి చూపించరు. మన నిత్య జీవితంలో రోజువారి జరిగే సన్నివేశాలు, విషయాలే మనకు కలలో కనిపిస్తుంటాయి. కలలు మనిషిని మరో కొత్త ప్రపంచంలోకి తీసుకెళ్తాయి. ఆ కలలో కనిపించే ప్రదేశాలు, కళాఖండాలు లాంటివి నిజం కాదని కలగనే వారికి కూడా తెలుసు. కొన్ని కలలు గమనిస్తే నిజంగా ఇలాంటివి జరిగితే ఎంత అద్భుతంగా ఉంటుందో కదా అని కూడా అనిపిస్తుంది. అవి సాధ్యపడవని చాలామంది ప్రయత్నించరు. కానీ పట్టుదలతో కృషి చేస్తే ఏదైనా సాధించవచ్చని ఓ వ్యక్తి నిరూపించాడు. తాను కలగన్న కళాఖండాన్ని భూమిమీదకి తెచ్చి నిజం చేశాడు. ఇందుకోసం నలభై సంవత్సరాలు భగీరథప్రయత్నం చేశాడు. కలలోవచ్చిన కళాఖండాన్ని ఇలలో సృష్టించి అందరిచేతా ఔరా! అనిపించుకుంటున్నాడు. ఇంతకీ ఎవరా వ్యక్తి, ఏంటా కల తెలుసుకోవాలనుకుంటున్నారా? అయితే చదివేసేయండి.

అమెరికాకు చెందిన అల్బర్టో గుటిరెజ్ తొమ్మిదేళ్ల వయసులో ఓ కలగన్నాడు. ఆ కలలో ఒక పెద్ద పర్వతం, దానిపై అందంగా చెక్కిన రకరకాల ఆకృతులు కనిపించాయి. ఆ దృశ్యం అల్బర్టో గుటిరెజ్ మదిలో ప్రింట్ అయిపోయింది. కానీ వివిధ కారణాల వల్ల అప్పుడు వచ్చిన ఆ కలను అతను మర్చిపోయాడు. అయితే *1977*లో పోర్టులో ఉద్యోగం చేస్తున్నప్పుడు అల్బర్టోకి అందమైన గీతలున్న ఒక రాయి దొరికింది. దానిని చూశాక చిన్నప్పటి కల గుర్తుకువచ్చింది.



దీంతో తాను కలగన్న కళాఖండాన్ని సృష్టించాలని మైండ్‌లో ఫిక్సయిపోయాడు. కానీ పర్వతాన్ని సృష్టించడం, దానికి రకరకాల ఆకృతులను చేకూర్చడం అంటే అది సాధ్యమయ్యే పని కాదు. తనకొచ్చిన కల గురించి వేరేవాళ్లకి చెప్పినప్పుడు కూడా అందరూ ఇతన్ని చూసి మర్చిపో, అది సాధ్యం కాదు అని చెప్పినవారే. అయినాసరే పట్టు వీడకుండా దాన్ని ఎలాగైనా సాధ్యం చేసి చూపించాలని అల్బర్టో భావించాడు. అందుకోసం తనకు జీవనోపాధిగా ఉన్న ఉద్యోగాన్ని సైతం వదిలేసి నికరుగువా సమీపంలోని ఈల్ జలకేట్ అనే ప్రాంతానికి వచ్చి ఓ చిన్న గుడిసెలో ఉంటూ తన పనిని ప్రారంభించాడు.

ఆ ప్రాంతంలో ఉన్న ఓ కొండపై తనకు నచ్చిన జంతువులు, పక్షులు, మనుషులు ఇలా వివిధ రకాలైన ఆకారాలను అందంగా చెక్కాడు. అందుకోసం అతనికి పట్టిన సమయం ఎంతో తెలుసా? నలభైసంవత్సరాలు. *40* సంవత్సరాల పాటు ఈ లోకాన్ని మర్చిపోయి ఒక్కడే కష్టపడి ఆ కొండపై వివిధరకాల ఆకారాలను అందంగా చెక్కాడు. అతనికి స్మార్ట్‌ఫోన్, ఇంటర్నెట్‌లాంటివి కూడా ఏంటో తెలియవంటే అతిశయోక్తి కాదు. కేవలం తన కలకు వాస్తవరూపం ఇవ్వడానికి తన కుటుంబానికి, ప్రజలకు దూరంగా *40* ఏళ్లు గడిపేశాడు. తాను కలగన్న ప్రాంతాన్ని భూమిపై నిర్మించాడు. దీన్ని నిర్మించడం ఎంతో సంతోషంగా ఉందని అతను చెబుతున్నాడు. అతడి కష్టానికి తగిన గుర్తింపు లభించింది. అతగాడు చెక్కిన ఆ శిల్ప కళాఖండాన్ని చూసి, ఇది భూమిపై నిర్మించిన ఒక అద్భుతం అంటున్నారు. పర్యాటకులు వాటిని సందర్శించడానికి క్యూ కడుతున్నారు.

నవ్య

## సుధామ పదగారడి-327

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ❖ | 1 | 2 | | 3 | | | 4 | ❖ |
| 5 | | | ❖ | | ❖ | ❖ | 6 | 7 |
| ❖ | | ❖ | 8 | | | 9 | ❖ | |
| 10 | | 11 | ❖ | | ❖ | 12 | 13 | |
| ❖ | ❖ | 14 | | ❖ | 15 | ❖ | | ❖ |
| 16 | | 15 | ❖ | 17 | | | ❖ | 18 |
| | ❖ | 19 | 20 | ❖ | | ❖ | 21 | |
| 22 | 23 | ❖ | | ❖ | ❖ | 24 | ❖ | |
| ❖ | 25 | | | | | | | ❖ |

### ఆధారాలు

**అడ్డం**

1. ఆగస్టు 15 ప్రత్యేకత (7)
5. ప్రసిద్ధి ముందు విను (3)
6. కొండ బిలము (2)
8. అంబ, అంబికల సోదరి (4)
10. వదంతి కాదు బిల్డింగ్ (3)
12. కర్పూర వసంతరాయల ప్రియురాలు (3)
14. తేరు (2)
16. జిల్లాలోని భాగం (3)
17. గంధఫలి (3)
19. వసుధలో అమృతము (2)
21. గోడు (2)
22. ముండ్లమండ (2)
25. కృష్ణాష్టమి అంటే...? (7)

**నిలువు**

1. స్వీయప్రత్యక్ష జ్ఞానము (4)
2. ఒకప్పటి టెలిగ్రాం (2)
3. తొలి తెలుగు కథానికగా చెప్పుకునే గురజాడ రచన (4)
4. ముందరికి వ్రాలు, నమ్రమగు (2)
7. ఆంజనేయుడు (3)
9. కనుల మధ్య తొలగింది (2)
11. కాసుతో ఏదో తేడా! (4)
13. శునకము (2)
15. వీణ (3)
16. చెవికమ్మ (3)
18. నమస్కారం (3)
20. శరీరంలోని సిర కాదు మరొకటి (3)
23. తలక్రిందయిన దయ, కనికరము (2)
24. ప్రత్తి (2)

### పదగారడి-326 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 వ | 2 ర | ల | క్ష్మి | ■ | 3 తి | ■ | 4 ధుం | 5 ప్ |
| ■ | మ | ■ | ■ | 6 తి | ల | క్ | ■ | సు |
| 7 ఓ | ణి | ■ | 8 జా | ■ | లు | ■ | 9 చూ | పు |
| సా | ■ | 10 అ | న్న | య్య | ■ | 11 పూ | ర్ణ | ■ |
| 12 రి | 13 దా | ■ | లు | ■ | 14 గ | ■ | 15 ము | 16 ట్టు |
| ■ | 17 రా | ఖీ | ■ | 18 వ్ర | త | ము | ■ | గు |
| 19 నా | లు | ■ | 20 కు | ■ | ము | ■ | 21 హ | లో |
| ఘ్న | ■ | 22 సా | రం | గం | ■ | ■ | స్త | ■ |
| 23 రు | తం | ■ | గం | ■ | 24 జ్వా | లా | ము | ఖి |




# అందమైన లోకమని..

**'మేడమ్..' ఆ పిలుపు విని వెనక్కి తిరిగి చూశా. 'ఈ ఫీడ్‌బ్యాక్ ఫామ్‌లో మీ అమ్మాయి మా వెయిటర్ గురించి చాలా బ్యాడ్‌గా రాసింది. దీనివల్ల వాడి ఫ్యూచర్ దెబ్బతింటుంది. పైగా అతను అమర్యాదగా ప్రవర్తించలేదు.'**

నాకు ఒక క్షణం ఏం సమాధానం చెప్పాలో అర్థం కాలేదు. అతని చేతిలో నుంచి ఫీడ్‌బ్యాక్ ఫామ్ తీసుకుని చూశా. నిజంగానే చాలా బ్యాడ్‌గా రాసింది. 'ఇంకో ఫామ్ ఇస్తారా..' అని అడిగా. అతను వెంటనే జేబులో నుంచి ఇంకో ఫామ్ తీసి ఇచ్చాడు. ఒక పక్క మా అమ్మాయి నాకేసి కోపంగా చూస్తోంది. దాని వేడిచూపులు పట్టించు కోకుండా సర్వీస్ ఈజ్ గుడ్. అని రాసి ఇచ్చేశా. 'థాంక్యూ మేమ్.. నా పేరు ఆర్య.. ఇక్కడ హెడ్ వెయిటర్‌ని..' అన్నాడతను. ఆర్యతో నా తొలి పరిచయం అదే.

ఆ మర్నాడు టీవీలో విశ్వనాథ్ 'శుభలేఖ' సినిమాలో చిరంజీవిని చూస్తుంటే ఆర్య గుర్తుకొచ్చాడు. నేను సాధారణంగా రెస్టారెంట్‌లకు తక్కువగా వెళ్తాను. అది కూడా తప్పనిసరైతేనే. అందుకే నాకు అక్కడ పనిచేసేవారి గురించి అస్సలు తెలియదు.

### చిన్న కామెంట్‌తో...

ఏ ముహూర్తాన ఆర్య పరిచయమయ్యాడో కానీ అదే హోటల్‌కు ఆ నెలలోనే మరో మూడుసార్లు వెళ్లాల్సి వచ్చింది. రెండో సారి వెళ్లినప్పుడనుకుంటా... ఆర్య నా దగ్గరకు వచ్చి 'బావున్నారా మేడమ్..' అని పలకరించాడు. ఆ పలకరింపులో వెటకారం లేదు. 'మళ్లీ ఎందుకు వచ్చావనే' వ్యంగ్యం కూడా లేదు. రెస్టారెంట్‌కు వచ్చే అతిథులకు ఇచ్చే ఆదరం మాత్రమే వినిపించింది. 'మీ అమ్మాయి ఎలా ఉంది మేడమ్?' అని అతనే సంభాషణ పొడిగించాడు. నాకేం సమాధానం చెప్పాలో అర్థం కాలేదు. 'బానే ఉంది..' అన్నా. 'ఆ రోజు మీ వెయిటర్ తనకు సరిగ్గా సర్వీసు చేయలేదని ఫీలయ్యింది. అందుకే అలాంటి ఫీడ్‌బ్యాక్ రాసింది' అన్నాను, అపాలజెటిక్‌గా. ఆర్య చిన్నగా నవ్వాడు. ఆ నవ్వులో చిన్న బాధ కనిపించింది. 'ఆరోజు వాడి కూతురికి ఒంట్లో బావులేదు మేడమ్. ఆసుపత్రికి తీసుకువెళ్లాలి. ఆ కంగారులో ఉన్నాడు. డ్యూటీకి రాకపోతే శాలరీ కట్ అవుతుంది. ఆ టెన్షన్‌లో చిన్న పిల్ల కదా అని పెద్దగా పట్టించుకొని ఉండడు. అంతకన్నా వేరే ఉద్దేశం ఏముంటుంది' అన్నాడు. 'వాళ్ల పిల్లకు ఎలా ఉంది?' అని అప్రయత్నంగా అడిగా. 'బానే ఉంది మేడమ్.. మీరు ఆ రోజు బ్యాడ్‌గా రాసి ఉంటే ప్రోబ్లం అయ్యేది.' అన్నాడు. ఇంటికి వచ్చేసిన తర్వాత కూడా ఆర్య మాట్లాడిన మాటలు గుర్తుకొస్తూనే ఉన్నాయి. మనం రాసే ఒక చిన్న కామెంట్ ఇతరుల జీవితాలలో పెను మార్పులను తీసుకువస్తుందని ఎప్పుడూ నేను అనుకోలేదు.

### ప్రోబ్లం లేదు

ఈ సంఘటన జరిగిన ఐదు రోజులకు మళ్లీ అదే హోటల్‌కు వెళ్లాల్సి వచ్చింది. ఈసారి ఆర్య పూర్తి ఖాళీగా ఉన్నాడు. 'మీ ఉద్యోగం ఎలా ఉంది?' అని అసందర్భంగా సంభాషణను నేనే ప్రారంభించా. 'బానే ఉంది మేడమ్. మంచి శాలరీ ఇస్తారు. స్టార్ హోటల్ కాబట్టి టిప్స్ కూడా మస్తుగా వస్తాయి. డబ్బులకు ప్రోబ్లం లేదు. కానీ కొన్నిసార్లు ఎందుకు ఈ ఉద్యోగం చేస్తున్నామా? అనిపిస్తుంది..' అన్నాడు.



'మీకేంటి.. రోజంతా ఏసీలో ఉండొచ్చు. మంచి స్టార్ హోటల్ ఫుడ్ తినొచ్చు..' అన్నా. ఆర్య నాకేసి చూసి నవ్వాడు. 'డిస్కవరీ ఛానల్‌లో చూస్తే సహారా ఎడారి కూడా రంగుల్లోనే కనిపిస్తుంది మేడమ్. అక్కడ ఉండేవాళ్లకి దాంట్లో వేడి తెలుస్తుంది' అన్నాడు. ఒక్కక్షణం ఆగి 'మాది ఢిల్లీ మేడమ్. పీజీ దాకా చదివా. ఏదో చిన్న కాలేజీలో హోటల్ మేనేజ్‌మెంట్ కూడా చేశా. కానీ ఏం చేయాలి? ఇంట్లో బాధ్యతలు.. ఉద్యోగం తప్పదు. అందుకే హైదరాబాద్‌కు వచ్చేశా. ఇక్కడ నాకు ఫుడ్‌కు, ఇంటికి కొరత లేదు. ఎంత తక్కువ ఖర్చు పెట్టుకుంటే అంత మిగులుతుంది..' అన్నాడు. ఇంతలో ఆర్య దగ్గరకు ఇంకో చిన్న వెయిటర్ వచ్చాడు. ఆర్య చెవిలో ఏదో గుసగుసలాడాడు. 'ఇప్పుడే వస్తాను మేడమ్' అంటూ ఆర్య హడావిడిగా వెళ్లిపోయాడు.

### లాజిక్

ఇంతలో నా గెస్ట్‌లు వచ్చారు. వాళ్లతో డిన్నర్ గడిచిపోయింది. బిల్లు కట్టేసి బయటకు వస్తుంటే ఆర్య గుర్తుకొచ్చాడు. వెనక్కి తిరిగి చూస్తే కిచెన్ సర్వీస్ డోర్ తీసుకొని రెస్టారెంట్ లోపలికి వస్తున్నాడు. అతనిని చూసి పలకరింపుగా నవ్వాను. ఆర్య నా దగ్గరకు నేరుగా వచ్చాడు. 'సారీ మేడమ్! ఇందాక పోలీసులు వచ్చారు. అందుకే మిమ్మల్ని కట్‌చేసి వెళ్లాల్సి వచ్చింది' అన్నాడు. 'పోలీసులా..' అన్నాను ఆశ్చర్యంగా. ఆర్య మొహం వివర్ణమైంది. 'నిన్న రాత్రి డిన్నర్‌కు ఒక ఐటీ జంట వచ్చారు మేడమ్. ఆ కార్నర్ టేబుల్‌లో కూర్చున్నారు. మూడు గంటలు కూర్చున్నారు. బాగా దెబ్బలాడుకున్నారు. మాకు ఇవన్నీ కామనే! కొట్టుకోవటం.. కలిసిపోవటం అన్నీ చూస్తుంటాం. అలాగే అనుకున్నాం. అతను వెళ్తూ నాకు ఒక వంద టిప్ ఇచ్చాడు. ఆ నోటు ఇచ్చినందుకు ఆ అమ్మాయి సణుగుతూ ఉంది. ఆ నోటు ఆ అమ్మాయి అతనికి ఇచ్చిన తొలి వందనోటట. దానిమీద ఆ అమ్మాయి పేరు ఉంటుందిట. ఎందుకైనా మంచిదని రాత్రి ఆ నోటు వేరుగా తీసి పెట్టా. ఇందాక పోలీసులు వచ్చి ఆ ఐటీ జంట హుస్సేన్‌సాగర్‌లో దూకి ఆత్మహత్య చేసుకుందని చెప్పారు. అతని జేబులో మా హోటల్ బిల్లు దొరికిందిట..' అన్నాడు. నాకు ఏం మాట్లాడాలో అర్థం కాలేదు. 'నాకు ఆ నోటు ఇచ్చినందుకు వాళ్లిద్దరూ దెబ్బలాడుకొని ఆత్మహత్య చేసుకున్నారేమో.. అన్న ఫీలింగ్ వస్తోంది మేడమ్..' అన్నాడు. 'అలా కావటానికి చాలా తక్కువ ఛాన్స్ ఉంది. ఈ వాదనలో లాజిక్ లేదు..' అన్నా. ఆర్య విషాదంగా నవ్వాడు. 'జీవితానికి లాజిక్‌కు సంబంధం లేదు మేడమ్. పీజీ చదివిన నేను వెయిటర్‌ని. కేజీ చదువుతున్న మీ అమ్మాయి కంప్లైంట్ చేస్తే నా ఉద్యోగం పోతుంది. దీనికి లాజిక్ ఏముంది మేడమ్..' అన్నాడు. నాకేం సమాధానం చెప్పాలో తెలియక వడివడిగా నడిచి వచ్చేశా!

—సీత

email: fbackfm@gmail.com




ఆగస్టు 16 నుంచి
ఆగస్టు 22 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



**మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)**

విద్యా విషయాలు, వేడుకలు, వృత్తి, వ్యాపారాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో విద్యార్థులకు శుభప్రదం. కమ్యూనికేషన్లు, బోధన రంగాల వారికి ప్రోత్సాహకరం. శుభ సమాచారం అందుకుంటారు. 18, 19 తేదీల్లో ప్రియతములు, చిన్నారుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి ప్రోత్సాహకరం. 20, 21 తేదీల్లో ప్రియతముల ఆరోగ్యం కలవరపెడుతుంది. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. ఖర్చులు అధికం. 22న విందు వినోదాల్లో పాల్గొంటారు. ప్రియతముల ఆరోగ్యం మెరుగవుతుంది.



**వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, విద్య, కుటుంబ వ్యవహారాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 18, 19 తేదీల్లో విద్యార్థులు లక్ష్యాలు సాధిస్తారు. ఒక సమాచారం ఉల్లాసం కలిగిస్తుంది. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లలో నిరుత్సాహకరంగా ఉంటుంది. 20, 21 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారు ఆచితూచి వ్యవహరించాలి. విద్యాసంస్థల్లో ప్రవేశానికి ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. 22న చిన్నారులు, ప్రియతముల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది.



**మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)**

విద్య, సమావేశాలు, బదిలీలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. విద్యార్థులకు శుభప్రదం. ఒక శుభవార్త అందుకుంటారు. 18, 19 తేదీల్లో విలువైన పత్రాలు అందడంలో ఇబ్బందులు ఎదురవుతాయి. ఫీజులు, బిల్లులు చెల్లించేందుకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. 20, 21 తేదీల్లో విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. ప్రయాణాలు, చర్చల్లో అసౌకర్యం కలిగే అవకాశం ఉంది. 22న రియల్ ఎస్టేట్, నిర్మాణరంగాల వారికి అనుకూలం. కుటుంబసభ్యుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది.



**కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, క్రయవిక్రయాలు, విద్యా విషయాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో దీర్ఘకాలిక పెట్టుబడులు లాభిస్తాయి. ఆర్థిక విషయాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. 18, 19 తేదీల్లో పెట్టుబడులపై ఆచితూచి నిర్ణయం తీసుకోవాలి. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 20, 21 తేదీల్లో విలువైన పెట్టుబడుల విషయంలో తొందరపాటు తగదు. అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలించక పోవచ్చు. 22న కాంట్రాక్టులు, అగ్రిమెంట్లకు అనుకూల సమయం. స్టేషనరీ, ఏజెన్సీ, విద్యారంగాల వారికి ప్రోత్సాహకరం.



**సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)**

ఆర్థిక సంస్థలతో పనులు, విదేశీ వ్యవహారాలు, పెట్టుబడులు, విద్యా విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో బృంద కార్యక్రమాల్లో పాల్గొంటారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 18, 19 తేదీల్లో మనశ్శాంతి లోపిస్తుంది. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాల్లో కీలక నిర్ణయాలు తీసుకుంటారు. రహస్య సమాచారం అందుకుంటారు. 20, 21 తేదీల్లో కీలక నిర్ణయాలు వాయిదా వేయండి. మనసును ఏదో వెలితి బాధిస్తుంది. కొత్త ప్రాజెక్టు ప్రారంభానికి తగిన సమయం కాదు. 22న డిపాజిట్లపై మంచి ప్రతిఫలం అందుకుంటారు. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు.



**కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)**

ప్రముఖులతో సమావేశాలు, విదేశీ వ్యవహారాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో సినీ, రాజకీయ రంగాల వారికి శుభప్రదం. గౌరవ పదవులు అందుకుంటారు. ప్రముఖులను కలుసుకుంటారు. 18, 19 తేదీల్లో ఆర్థిక విషయాల్లో ఆచితూచి వ్యవహరించాలి. స్నేహానుబంధాలు బలపడతాయి. బ్యాంకులతో పనులు పూర్తవుతాయి. 20, 21 తేదీల్లో కీలక నిర్ణయాలు వాయిదా వేయడం మంచిది. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాల్లో జాగ్రత్తగా వ్యవహరించాలి. 22న అలజడి తొలగిపోయి మనసు ప్రశాంతంగా ఉంటుంది. కొత్త పనులపై దృష్టి సారిస్తారు.



**తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)**

సమావేశాలు, వృత్తి, వ్యాపారాలు, వేడుకలు, ఉన్నత విద్యపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధ, గురువారాల్లో సమావేశాల్లో సత్ఫలితాలు సాధిస్తారు. వేడుకల్లో పాల్గొంటారు. సంకల్పం నెరవేరుతుంది. 18, 19 తేదీల్లో సన్నిహితుల సహకారంతో వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. ఆర్థిక విషయాల్లో అంచనాలుతప్పే అవకాశం ఉంది. 20, 21 తేదీల్లో ఆర్థిక విషయాల్లో సన్నిహితుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. బ్యాంకులు, ఆర్థిక సంస్థలతో పనులకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. 22న సినీ, రాజకీయ రంగాల వారికి ప్రోత్సాహకరం. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం.



**వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)**

పెద్దల ఆరోగ్యం, వృత్తి, వ్యాపారాలు, వేడుకలు, పెట్టుబడులకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో పెద్దల ఆరోగ్యం మెరుగవుతుంది. పెన్షన్, గ్రాట్యుటీ, బీమా వ్యవహారాలకు అనుకూలం. 18, 19 తేదీల్లో వృత్తి వ్యాపారాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. కొత్త వ్యూహాలు అమలు చేసి సత్ఫలితాలు సాధిస్తారు. 20, 21 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో నిరుత్సాహకరంగా ఉంటుంది. పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. గౌరవానికి భంగం కలిగే ప్రమాదం ఉంది. 22న బృంద కార్యక్రమాలు ఉల్లాసం కలిగిస్తాయి. ఆర్థిక విషయాల్లో పెద్దలు సహకరిస్తారు.



**ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)**

సమావేశాలు, పెట్టుబడులు, వృత్తి వ్యాపారాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. జనసంబంధాలు విస్తరిస్తాయి. వేడుకల్లో పాల్గొంటారు. 18, 19 తేదీల్లో ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. రుణప్రయత్నాలు ఫలించే అవకాశం ఉంది. ఆర్థికపరమైన చర్చలు లాభిస్తాయి. 20, 21 తేదీల్లో సమావేశాలు, చర్చల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. ప్రయాణాల్లో అసౌకర్యం కలుగుతుంది. 22న ఆర్థిక విషయాల్లో పెద్దల సహకారం అందుకుంటారు. వృత్తిపరమైన సమావేశాలకు అనుకూలం.



**మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)**

ఆరోగ్యం, పెట్టుబడులు, సమావేశాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరం. ఆరోగ్యం మెరుగుపడుతుంది. విందుల్లో పాల్గొంటారు. 18, 19 తేదీల్లో భాగస్వామి వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. స్పెక్యులేషన్లు, పోటీల్లో విజయం సాధించే అవకాశం ఉంది. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 20, 21 తేదీల్లో పెట్టుబడులకు సంబంధించి నిర్ణయాలకు తగిన సమయం కాదు. బంధుమిత్రుల ఆరోగ్యం కలవరపెడుతుంది. 22న రక్షణ, న్యాయ, బోధన రంగాల వారికి ప్రోత్సాహకరం. సకాలంలో నిధులు సర్దుబాటవుతాయి.



**కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)**

చిన్నారుల విషయాలు, పెట్టుబడులు, షాపింగ్, ఆరోగ్య విషయాలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో ప్రేమానుబంధాలు బలపడతాయి. స్పెక్యులేషన్లు లాభిస్తాయి. షాపింగ్‌కు అనుకూలం. 18, 19 తేదీల్లో ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. కృషి రంగంలో కొత్త పరిచయాలు లాభిస్తాయి. విందుల్లో పాల్గొంటారు. 20, 21 తేదీల్లో స్పెక్యులేషన్లలో నష్టం సంభవం. విలువైన వస్తువుల కొనుగోలులో నాణ్యత గమనించాలి. భాగస్వామి వైఖరి ఆవేదన మిగులుస్తుంది. 22న రుణ ప్రయత్నాలు ఫలిస్తాయి. వాయిదా పద్ధతిలో వస్తువులు కొనుగోలు చేస్తారు.



**మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)**

బదిలీలు, ప్రేమానుబంధాలు, వేడుకలు, వృత్తి, వ్యాపారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో బదిలీలు, మార్పులకు అనుకూలం. రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి శుభప్రదం. విందు, వినోదాలకు ఏర్పాట్లు చేస్తారు. 18, 19 తేదీల్లో చొరవ లోపించడంవల్ల వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధించలేకపోతారు. చిన్నారుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 20, 21 తేదీల్లో విందు వినోదాల్లో ఖర్చులు అధికం. వైద్యం, పరిశ్రమలు, వ్యవసాయం, హోటల్ రంగాలవారు నిదానం పాటించాలి. 22న ప్రియతముల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. వేడుకల్లో పాల్గొంటారు.



## స్వయంకృతాపరాధమే!




ఒకప్పుడు షారూఖ్ ఖాన్ బాలీవుడ్ బాద్‌షా. ఆయన సినిమా కచ్చితంగా కోట్లు కొల్లగొడుతుందని దర్శకనిర్మాతల నమ్మకం. ఆయన సినిమా అంటే అభిమానులకు పండగే! అలాంటి షారూఖ్ ఖాన్ ఇప్పుడు జీరోఖాన్‌గా మారిపోయే పరిస్థితి ఉందంటున్నారు బాలీవుడ్ జనాలు. గతంలో అమీర్ ఖాన్ షారూఖ్‌తో పోటీ పడలేక తన సినిమా వాయిదా వేసుకున్న సందర్భాలు ఉన్నాయి. ఇప్పుడు ఎలాంటి పోటీ లేకున్నా షారూఖ్ సినిమా ప్రపంచవ్యాప్తంగా కనీసం 50 కోట్లు కూడా రాబట్టలేకపోతోంది. అదే అమీర్ 'దంగల్' రికార్డును ఇప్పటి వరకూ ఏ సినిమా అందుకోలేకపోయింది. దీనికి కారణం షారూఖ్ స్వయంకృతాపరాధమే అంటున్నారు బాలీవుడ్ జనాలు. కథమీద కన్నా కాసుల మీద దృష్టి పెట్టడంతో షారూఖ్ సినిమాలు బాక్సాఫీసు వద్ద బోల్తాకొడుతున్నాయని, అదే సమయంలో అమీర్‌ఖాన్ డబ్బులు కాకుండా కథని చూడడం వల్ల ఆయన సినిమాలు బ్లాక్‌బస్టర్లు అవుతున్నాయని వారు అంటున్నారు. ఇప్పటికైనా బాద్‌షా కళ్ళు తెరచి సినిమాల ఎంపికలో జాగ్రత్త పడటం మంచిదని కొందరు సలహా ఇస్తున్నారు.

## అభిమానులకు బిగ్‌బి వార్నింగ్



బిగ్‌బి పుట్టినరోజంటే అభిమానులకు పండగే! ఆయన పుట్టినరోజును అభిమానులు అంగరంగ వైభవంగా జరుపుకుంటూ ఉంటారు. ఈసారి మాత్రం అలాంటి హడావుడి చేస్తే ఎవరికీ కనిపించకుండా పారిపోతానని వార్నింగ్ ఇస్తున్నారు బిగ్‌బి. అక్టోబర్ 11వ తేదీ బిగ్‌బి 75వ పుట్టినరోజు. తన పుట్టినరోజును గ్రాండ్‌గా సెలబ్రేట్ చేయాలన్న ఆలోచనను అభిమానులు విరమించుకోవాలనీ, తన మాటలు పట్టించుకోకుండా వేడుకలు జరపాలని చూస్తే ఎవరికీ కనిపించకుండా పారిపోతాననీ అంటున్నారు. ఈ మాటలు అభిమానులను నిరాశపరిచినా, ఇంకా ఆయన పుట్టినరోజుకు టైముంది కదా అని సరిపెట్టుకుంటున్నారట!

## బాలీవుడ్‌కి జగ్గూభాయ్!



హీరోగా కన్నా విలన్‌గానే ఎక్కువ పేరు తెచ్చుకున్న నటుడు జగపతిబాబు. జగ్గూభాయ్‌గా అందరిచేతా ముద్దుగా పిలిపించుకునే జగపతిబాబు ఇప్పుడు బాలీవుడ్‌లో అడుగుపెట్టబోతున్నాడు. అక్కడ ఓ సినిమాకి గ్రీన్ సిగ్నల్ ఇచ్చాడట! కాకపోతే ఈ సినిమా విశేషాలు వినాలంటే కొంత కాలం ఆగాల్సిందే అంటున్నాడు. చాలా కాలం తరువాత ప్రధానపాత్రలో నటించిన 'పటేల్ సర్' తనని కొంత నిరాశపరిచిందని అంటున్నాడు. కాకపోతే ప్రేక్షకులు తనను ఎలా చూడాలనుకుంటున్నారో ఈ సినిమాతో బాగా తెలిసి వచ్చిందని చెబుతున్నాడు. ఇక మీద ప్రయోగాల జోలికి పోకూడదని అనుకుంటున్నాడట కూడా!

## భర్త చాటు భార్యగా ఉంటుందట



బాలీవుడ్‌లో అన్యోన్య దంపతుల లిస్ట్ తీస్తే అందులో కాజోల్, అజయ్‌దేవగన్‌ల పేర్లు తప్పకుండా ఉంటాయి. పెళ్ళి తరువాత కుటుంబానికి విలువ ఇచ్చి కాజోల్ సినిమాలకు దూరమైంది. నటనకు దూరమైనా సినిమాలకు తాను దూరం కాలేదనీ, అందుకే ఓ ప్రొడక్షన్ హౌస్ ఏర్పాటు చేసే ఆలోచనలో ఉన్నట్టు ప్రకటించి అందరినీ ఆశ్చర్యంలో ముంచెత్తింది. అందరూ ఆ ఆశ్చర్యం నుంచి ఇంకా తేరుకోకముందే తను ప్రొడక్షన్ హౌస్ ఆలోచనను విరమించుకున్నానని, భర్త చాటు భార్యగా ఉండడానికే ఇష్టపడుతున్నానని చెప్పి మరో షాకిచ్చింది.

## మర్యాద తెలియని కొడుకు!

సినీ నటుల పిల్లలు డబ్బులోపుట్టి డబ్బులో పెరుగుతారు కనుక వారికి డబ్బు కష్టాలే కాకుండా మర్యాద మన్నన కూడా తెలియవు! దీనికి ఏ భాషా నటులూ మినహాయింపు కాదు అంటున్నాడు జాకీచాన్! ఈ హాలీవుడ్ సూపర్‌స్టార్‌కి ఓ కొడుకు ఉన్నాడు. అతగాడు, డ్రగ్స్‌కీ, మందుకీ అలవాటు పడి జాకీచాన్ పరువు తీస్తున్నాడట! అంతేకాకుండా ఇతరులను గౌరవించడం తన కొడుకుకి అస్సలు తెలియదనేదే జాకీచాన్ బాధ. తను చాలా కింది స్థాయినుంచి వచ్చాడు కనుక మనుషుల విలువ, మనీ విలువ తెలుసుననీ, తన కొడుక్కి తెలియవని ఆవేదన వ్యక్తం చేస్తున్నాడు. డబ్బున్నా సుఖం లేదు అన్నది జాకీచాన్ బాధ.





ఇప్పటి హీరోయిన్లకి అందం, అభినయంతో పాటు కొంచెం తెలివి తేటలు అవసరం. రకూల్‌ప్రీత్‌సింగ్‌కు పై రెండు క్వాలిఫికేషన్లే కాకుండా మూడో క్వాలిఫికేషన్ కూసింత ఎక్కువగానే ఉంది. తన సినిమాలు ఏడాదికి మూడు నాలుగుకి తగ్గకుండా విడుదలయ్యేటట్టు ప్లాన్ చేసుకుంటోంది. చిన్నా పెద్దా అన్న తేడా లేకుండా అందరితో చేయడం వలనే సంవత్సరానికి నాలుగైదు సినిమాలు చేయగలుగుతున్నానని అంటున్న రకూల్‌తో....

# నచ్చని పని చేశాను

## –రకూల్‌ప్రీత్ సింగ్

### బిజీగా ఎలా ఉంటున్నాను అంటే....

ఏ పనీ లేకుండా ఖాళీగా లేజీగా ఉండడం నాకు ఇష్టం ఉండదు. చేతి నిండా పని ఉంటేనే నేను ఆనందంగా ఉండగలుగుతాను. చేస్తున్న పనిని రిఫ్రెష్ పేరుతో మూడు నాలుగు నెలలు వదిలేయడం నాకు నచ్చదు. చేస్తున్న సినిమాల మీద ఎంత క్లారిటీగా ఉంటానో, చేయబోయే సినిమాల విషయంలో కూడా అంతే క్లారిటీగా ఉంటాను. ప్రతీదీ పక్కాగా ఉండాలనేది నా మనస్తత్వం. ఇదేదో మిగతావారిని విమర్శించడానికి చెప్పడం లేదు. నా తత్త్వం చెబుతున్నాను అంతే.

### ప్రేమ అంటే ఏమిటో చెప్పే సినిమా...

ఇప్పటివరకూ చాలా ప్రేమకథా సినిమాలు చేశాను. వాటికి భిన్నంగా మొట్టమొదటిసారిగా 'జయ జానకి నాయక' సినిమా చేస్తున్నాను. ఇందులో రెండురకాల పాత్రలు చేస్తున్నాను. ప్రేమలో ఉండే నిజాయితీ ఈ సినిమాలో కనిపిస్తుంది.

### బెల్లంకొండ శ్రీనివాస్ గురించి

సినిమా కుటుంబం నుంచి వచ్చిన వ్యక్తే అయినా ఏమాత్రం భేషజం లేని వ్యక్తి. ఈ సినిమా ప్రారంభం నుంచి అతడిని గమనిస్తున్నాను. సినిమా పూర్తయ్యేసరికి తనలో చాలా మార్పు కనిపించింది. ఈ సినిమా చూసిన తరువాత ప్రతి అమ్మాయి శ్రీను లాంటి వ్యక్తి ప్రేమికుడిగా రావాలని కోరుకుంటుంది. సినిమా చూస్తున్న ఫీలింగ్ రాదు. మన చుట్టూ జరుగుతున్న కథలాగే అనిపిస్తుంది. దానికి బోయపాటిగారి మార్కు తోడై సినిమా అందంగా వచ్చింది.

### సినిమాలో నా పాత్ర గురించి

ఈ సినిమాలో నాకు నచ్చని పని చేయవలసి వచ్చింది. ఏడుపు అంటే నాకు అస్సలు ఇష్టం ఉండదు. కానీ జానకి పాత్రలో ఎక్కువ భాగం ఏడవాల్సి ఉంటుంది. ప్రతిరోజూ ఏడ్చి ఏడ్చి నా కళ్ళు వాచిపోయేవి. ఇంటికొచ్చిన తరువాత కూడా ఆ మూడ్ నుంచి బయటకు రాలేకపోయేదాన్ని. ఇంటికి వెళ్ళినా కూడా కన్నీళ్ళు కారిపోతూనే ఉండేవి. నేను ఎందుకు బాధపడుతున్నానో తెలియక మా మదర్ కంగారు పడేది కూడా! నెమ్మదిగా ఆవిడకి అర్థం అయిపోయింది. ఆ పాత్ర ప్రభావం కారణంగానే నేను అలా డల్‌గా ఉంటున్నానని. ఓ పదిహేను రోజులు ఏదో లోకంలో ఉన్నట్టు అనిపించేది. చాలాసార్లు గ్లిజరిన్ ఉపయోగించాల్సి వచ్చింది. ఇలాంటి క్యారెక్టర్ ఇంత వరకూ చేయలేదు. బహుశా ఇక ముందు చేయలేనేమో! నాలో ఇలాంటి కోణం కూడా ఉందా? అని ప్రేక్షకులు కచ్చితంగా ఆశ్చర్యపోతారు.

### బోయపాటి శ్రీను గారి గురించి చెప్పాలంటే...

ఆయన సినిమాలు చూసి ఆయన సీరియస్‌గా ఉంటారని అనుకుంటే పొరపాటే! ఆయనలో హ్యూమరస్ టచ్ ఈ సినిమా ఆఖరిలో చూశాను. షూటింగ్ అంతా అయిపోయిన తరువాత 'ఇక ఏడుపు ఆపేసి కొంచెం నవ్వు' అని నన్ను ఉద్దేశించి అన్నారు. ఆయన ఎందుకలా అన్నారో అక్కడున్న వారికి ముందు అర్థం కాలేదు. అర్థం అయి ఒకటే నవ్వులు.

### మొదటిసారి రెండు భాషల్లో...

ఇప్పటివరకూ తెలుగులో చాలా సినిమాలు చేశాను. కానీ స్పైడర్ లాంటి ద్విభాషా చిత్రం చేయడం ఇదే మొదటిసారి. తెలుగులో నేను డబ్బింగ్ చెప్పుకుంటున్నాను. తమిళ్ మాత్రం రాదు. ఒక

వారం రోజులు తెలుగులో ఒక సన్నివేశం తీస్తే అదే సన్నివేశం తమిళంలో షూట్ చేసేవారు. వెంటవెంటనే తెలుగు, తమిళం భాషల షూటింగ్‌లు జరుగుతుండడంతో కొంత అయోమయంగా ఉండేది. మహేష్‌బాబుగారిలో మాత్రం అలాంటివేవీ కనిపించేవి కావు. ఆయన చాలా కూల్‌గా ఇక్కడా, అక్కడా షూటింగ్ చేసుకుని వెళ్ళేవారు. నిజానికి నా మొదటి సినిమా తమిళంలో చేసినా అక్కడ సరైన గుర్తింపు రాలేదు. ఈ సినిమాను ఆదరిస్తారన్న నమ్మకం నాకుంది. మొదటిసారి తెలుగు, తమిళంలో ఒకేసారి చేయడం కొద్దిగా కష్ట మనిపించినా, ఇష్టంగా ఉంది.



### కోలీవుడ్‌లో చేస్తున్న సినిమా అంటే

హీరో కార్తితో ఓ సినిమా చేస్తున్నాను. ఇప్పటివరకూ కాలేజీ అమ్మాయిగానే చేశాను. మొదటిసారి కార్తి భార్యగా కనిపిస్తాను. వైఫ్‌గా చేయడం ఓ మంచి ఎక్స్‌పీరియన్స్. మామూలు గృహిణి ఎలా ప్రవర్తిస్తుంది అన్న దాని మీద కొద్దిగా హోం వర్క్ చేశాను. కార్తి వండరఫుల్ కోస్టార్. నాకు భాష అంత బాగా తెలియదని తెలిసి ప్రతి సన్నివేశాన్నీ, పాటలోని ప్రతి పదానికి అర్థాన్నీ విడమరిచి చెప్పేవారు. దాంతో నటించడం పెద్దగా కష్టం అనిపించలేదు.

### మిగతా అంశాలు పట్టించుకోను

నాకు కథ ముఖ్యం. అంతేతప్ప స్టార్ హీరోనా? స్టార్ ప్రొడ్యూసరా? లేదా పేరున్న దర్శకులా? అన్న విషయాలు పట్టించుకోను. ఎవరైనా సరే ఓకే చెబుతాను. అలాగే సినిమాలో నేనొక్కదాన్నే హీరోయిన్‌ని ఉండాలన్న నిబంధన కూడా పెట్టుకోలేదు. సినిమాలో ఎంత మంది హీరోయిన్లు ఉండాలన్నది కోట్లు ఖర్చు పెట్టి సినిమా తీసే దర్శకనిర్మాతలకు తెలుసు కదా? ఆ విషయంలో లేనిపోని తలనొప్పి నాకెందుకు? సినిమాలో ఎంతమంది ఉన్నా నా ప్రాముఖ్యత నాకే ఉంటుంది కదా?

### ఇతర హీరోయిన్ల నుంచి పోటీ

నేను ఎవరికీ పోటీ కాదు. నాకు ఎవరూ పోటీ కాదు. ఎంతమంది హీరోయిన్లు వచ్చినా ఎవరికి దక్కాల్సిన పాత్రలు వారికే వస్తాయి. చాలామంది సాయిపల్లవి, నివేదా థామస్ నాకు పోటీ అంటున్నారు. నేను వారిని చూసి భయపడుతున్నట్టుగా కూడా వార్తలు వచ్చాయి. అవి విన్నప్పుడు భలే నవ్వు వచ్చింది. 'ఫిదా'లో సాయి పల్లవి చాలా బాగా చేసింది. 'నిన్ను కోరి'లో నివేదా నటనకి మతిపోయింది. వెంటనే వారికి ఫోన్ చేసి అభినందనలు తెలిపాను. వాళ్ళను పోటీగానో, లేదా వాళ్ళు నాకు పోటీనో అనుకుంటే వారిని ఎలా అభినందించగలను? ఇలాంటి పుకార్లు రాసేటప్పుడు కొంత ఆలోచించి రాయాలికదా!



### బాలీవుడ్ నాకేమీ కొత్త కాదు

బాలీవుడ్ నాకేమీ కొత్త కాదు. నా కెరీర్ ప్రారంభంలో అక్కడో సినిమా చేశాను. మంచి విజయం సాధించలేదు. ఈలోపు దక్షిణాదిన అవకాశాలు రావడంతో ఇక్కడ బిజీ అయి బాలీవుడ్ గురించి ఆలోచించలేదు. ఇప్పుడొక మంచి అవకాశం వచ్చింది. డేట్లు అడ్జస్ట్ చేసి అక్కడ సినిమా చేస్తున్నాను.

### సినిమా పరాజయంలో హీరోయిన్ పాత్ర ఎంత అంటే...?

అర్థం లేని ప్రశ్నే ఇది. అసలు ఓ సినిమా పరాజయానికి హీరోయిన్ కారణమంటే నేను నమ్మను. దానికి బోలెడు కారణాలుంటాయి. హిట్ అయితే అందరితో పాటు సంతోషిస్తాను. ఫ్లాప్ అయితే నేనే ఎక్కువ బాధపడతాను. ఇక్కడొక విషయం చెప్పాలి. హిందీలో నేను చేసిన సినిమా ఆడలేదని చెప్పానుగా! ఆ సినిమా పరాజయానికి నేను కారణం అయితే మళ్ళీ నాకు అవకాశం ఎలా ఇస్తారు? ఇలాంటి మాటలు అనేటప్పుడు కొద్దిగా ఆలోచించాలి కదా! ఏ ఒక్కరి వలనో సినిమా పరాజయం పొందదు. అది అందరికీ తెలిసిన సంగతే అయినా నెపం అంతా హీరోయిన్ మీదే తోసేస్తారు. డబ్బులు పోగొట్టుకున్నవారు బాధలో అన్నారంటే అర్థం చేసుకోవచ్చు కానీ మిగతావారు కూడా అలా అంటే ఏమనుకోవాలి?

### ఈ మధ్యకాలంలో నన్ను ఏడిపించిన సినిమా

'నిన్ను కోరి' సినిమా చూశాక ఏడుపు ఆపుకోలేకపోయాను. నాని, నివేదా అంత బాగా చేశారు. అదే విషయాన్ని ఇద్దరికీ ఫోన్ చేసి మరీ చెప్పాను.

### వ్యాపారం గురించి చెప్పాలంటే

బాగానే ఉంది. ఇటీవలి కాలంలో వరుస సినిమాల కారణంగా వ్యాపారంమీద పెద్దగా దృష్టి పెట్టలేకపోతున్నాను. మా ఫ్యామిలీ చూసుకుంటోంది.

–స్పందన రెడ్డి

ఇంటర్వ్యూ

పెద్ద పెద్ద మీసాలు, బాన పొట్ట, నోట్లో బీడి, బుగ్గమీద పులిపిరికాయ, భారీకాయం ఇలాంటివన్నీ ఉంటే తప్ప ఒకప్పుడు విలన్‌గా అంగీకరించేవారు కాదు. ఇప్పుడు ట్రెండ్ మారింది. హీరోలతో సమానంగా విలన్ల లుక్ ఉంటోంది. స్టయిలిష్ విలన్లు వస్తున్నారు. వీరికో స్పెషాల్టీ ఉంది. పైకి స్టయిల్‌గా కనిపిస్తూనే క్రూరత్వం ప్రదర్శించగలరు. తమ స్టయిల్‌తో, లుక్స్‌తో దర్శక నిర్మాతలకు కాసుల వర్షం కురిపించగలరు. అలాంటి స్టయిలిష్ విలన్లలో తరుణ్ అరోరా ఒకరు. 'ఖైదీ నెం 150'లో విలన్‌గా నటించి తొలిసారిగా తెలుగు ప్రేక్షకులకు పరిచయమైన తరుణ్‌తో.....

# ఆ పిలుపు ఊహించనిది

## -తరుణ్ అరోరా

### నా గురించి....

మాది పంజాబీ కుటుంబం. పుట్టిందీ, పెరిగిందీ మాత్రం అస్సాంలో. చదివింది హోటల్ మేనేజ్‌మెంటు. చదువు అయిపోగానే మోడల్‌గా కెరీర్ ప్రారంభించాను. మోడల్‌గా నాకు బాగా పేరు తెచ్చినవి రేమాండ్, వెస్టిసైడ్స్, క్వాలిటీ, మెక్ డొనాల్డ్ తదితర ప్రకటనలు. చాలా సార్లు రాంప్‌వాక్ చేశాను. ఇవన్నీ మోడల్‌గా నాకు మంచి గుర్తింపునూ, పేరునూ తీసుకొచ్చాయి.

### సినిమా రంగం వైపు...

మోడల్‌గా చేస్తున్న సమయంలోనే బాలీవుడ్‌లో అవకాశం వచ్చింది. 'ప్యార్ మే కభీ కభీ' సినిమాతో బాలీవుడ్‌కి పరిచయమయ్యాను. 'జబ్ వుయ్ మెట్' నా కెరీర్‌ను మలుపు తిప్పిన సినిమా. ఈ సినిమా తరువాత అవకాశాలు వెల్లువెత్తాయి. దాదాపు ఐదారు సంవత్సరాల పాటు ఒకే తరహా సినిమాలు చేశాను. ఒకేరకమైన పాత్రలు చేసి చేసి విసుగొచ్చేసింది. మంచి పాత్రలు, వెరైటీ సినిమాలు వస్తేనే చేద్దామన్న ఉద్దేశంతో కొన్ని రోజులు నటనకి దూరంగా ఉన్నాను. నేను కోరుకున్న పాత్రలు మాత్రం రాలేదు. దాంతో ముంబయిలో ఉండలేక బెంగళూరు వెళ్ళిపోయాను.

### పాఠాలు నేర్చుకున్నది అక్కడే

సినిమాలు చేసే సమయంలో నేను ఎక్కువ కష్టపడింది 'జబ్ వుయ్ మెట్ సినిమాకే! ఆ సినిమాలో డైలాగులు చెప్పడానికి టేకుల మీద టేకులు తీసుకునేవాడిని. ఆ సినిమా డైరెక్టర్ ఇంతియాజ్ అలీ ఏ మాత్రం విసుక్కోకుండా ఓపికగా చెప్పేవారు. ఓ విధంగా చెప్పాలంటే నేను నటన నేర్చుకున్నది ఆ సినిమా ద్వారానే. ఫిలిం మేకింగ్‌లో ఉండే కష్టనష్టాలు కూడా అప్పుడే బాగా తెలిసి వచ్చాయి.

### వ్యాపారంలోకి

బాలీవుడ్‌లో అన్నీ ఒకే రకమైన పాత్రలు రావడంతో విసుగొచ్చి బెంగళూరులో 'తందూరి హిప్పి' అనే రెస్టారెంట్‌నూ, 'లవ్ షేక్' అనే లాంజ్‌ను ప్రారంభించాను. ఇవి మొదలు పెట్టిన కొద్దిరోజులకే మంచి పేరు వచ్చింది. వ్యాపారంలో బిజీగా ఉన్న సమయంలోనే దక్షిణాదిన సినిమాల్లో అవకాశం వెతుక్కుంటూ వచ్చింది. ఇప్పుడు ఓ పక్క సినిమాలు చేస్తూనే వ్యాపార వ్యవహారాలు కూడా చూసుకుంటున్నాను.

## దక్షిణాది వైపు అడుగులు...

బెంగళూరులో ఉన్న సమయంలో కోలీవుడ్ నుంచి అవకాశం వచ్చింది. ఆ సినిమాకి మంచి శరీర దారుఢ్యం కలిగిన స్టయిలిష్ విలన్ కావాలి. ఆ పాత్రకి నేను కరెక్టుగా సరిపోతానని దర్శకనిర్మాతలు భావించి పట్టుపట్టి నా చేత ఆ పాత్ర చేయించారు. ఆ సినిమా కోసం ఏడుకిలోల బరువు కూడా పెరిగాను. ఆ సినిమాలో నా పాత్రకి పెద్దగా డైలాగులు ఉండేవి కావు. ఉన్న ఒకటి రెండు డైలాగులను యూనిట్ నుంచి నేర్చుకుని చెప్పేవాడిని. ఆ సినిమా నాకు మంచి పేరు తీసుకొచ్చింది. తిరిగి సినిమాల మీద, నటన మీద మనసు మళ్ళింది.

## భాష ఇబ్బందులు

హిందీలో చేసే సమయంలో భాష పెద్దగా ఇబ్బంది పెట్టలేదు. కోలీవుడ్‌లో కూడా పెద్దగా ఇబ్బంది పడిన సందర్భాలు లేవు. ఎందుకంటే చెన్నయ్‌కి సమీపంలోనే నేను చదువుకుంది. నేను పుట్టింది అస్సాంలోనే అయినా అక్కడ చదువుకు ఇబ్బంది అవుతుందని మా పేరెంట్స్ నన్ను చెన్నయ్‌కి దగ్గరలో ఉన్న ఇనిస్టిట్యూట్‌లో చేర్చారు. దాంతో తమిళం కొద్దిగా వచ్చు. కోలీవుడ్‌లో సినిమాలు చేయడం మొదలు పెట్టిన తరువాత భాష చాలా వరకూ నేర్చుకున్నాను. కాకపోతే డబ్బింగ్ అంటే ఇప్పటికీ నాకు భయమే! బాలీవుడ్‌లోలా కాకుండా కోలీవుడ్‌లో నాకు డిఫరెంట్ క్యారెక్టర్లు దొరుకుతున్నాయి.

## చాలా మార్పులొచ్చాయి

నేను నటుడిగా కెరీర్ ప్రారంభించినప్పటికీ ఇప్పటికీ చాలా మార్పులు వచ్చాయి. అప్పట్లో ఫొటోలు పట్టుకుని స్టూడియోల చుట్టూ, కాస్టింగ్ ఏజెన్సీల చుట్టూ తిరగాల్సి వచ్చేది. ఫొటోలు ఇచ్చిన తరువాత ఎన్నో రోజులకి కానీ అవి దర్శకనిర్మాతలకు చేరేవి కావు. చేరిన తరువాత కూడా వారి నుంచి పిలుపు వచ్చేది కాదు. వారి పిలుపు కోసం నెలల తరబడి వేచి ఉండాల్సి వచ్చేది. ఒకవేళ పిలుపు వచ్చినా, అవకాశం వస్తుందన్న గ్యారంటీ ఉండేది కాదు. అంతా టెన్షన్ టెన్షన్‌గా ఉండేది. ఇప్పుడు ఆ పరిస్థితి లేదు. అంతా ఆన్‌లైన్. ఆన్‌లైన్‌లో ఫొటోలు పెడితే నచ్చిన వారు సెలెక్ట్ చేసుకుని ఫోన్ చేస్తున్నారు. నటీనటుల ఎంపిక చాలావరకు ఆన్‌లైన్‌లోనే పూర్తవుతోంది. ఇప్పుడు వచ్చేవారు చాలా అదృష్టవంతులనే చెప్పాలి.



## తెలుగులో అవకాశం ఊహించలేదు

కోలీవుడ్‌లో చాలా సినిమాలు చేశాను. కానీ ఏనాడూ టాలీవుడ్ గురించి ఆలోచించలేదు. ఇక్కడ అవకాశం వస్తుందని కలలో కూడా ఊహించలేదు. దీనికి ఓ కారణం ఉంది. టాలీవుడ్‌లో ఎంతో మంది మంచి విలన్లు ఉన్నారు. వారిని కాదని నాకు అవకాశాలు ఎలా ఇస్తారు? అన్న ఆలోచనతో అసలు ఇక్కడ ప్రయత్నించలేదు. కానీ చిరంజీవిగారి 'ఖైదీ నం. 150' నుంచి పిలుపు వచ్చిన తరువాత ఆశ్చర్యపోయాను. ఆ సినిమాలో చేయడానికి అప్పటికే చాలామంది నటులు వేచి చూస్తున్నారు. అయినా వారిని కాదని ఆ అవకాశం నాకు వచ్చింది. సినిమాలో అవకాశం రాగానే దీని మాతృక చూశాను. ఆ సినిమాలో నీల్‌గారు చాలా బాగా చేశారు. తెలుగులో ఆయన్ని ఫాలో కాకుండా దర్శకులు ఏది చెబితే దాన్నే ఫాలో అవ్వాలని డిసైడ్ అయ్యాను. నీల్‌గారి ప్రభావం నా మీద పడకుండా జాగ్రత్త పడ్డాను.

## అంజలా జవేరితో పెళ్ళి

బాలీవుడ్‌లో నేను నటించే సమయంలోనే అంజలాతో నాకు పరిచయం ఏర్పడింది. తను అప్పటికే టాలీవుడ్‌లో టాప్ హీరోయిన్. ఇక్కడ స్టార్ హీరోలతో చేసింది. మంచిపేరు తెచ్చుకుంది. ఓ విధంగా చెప్పాలంటే సినిమాల పరంగా తను నాకన్నా సీనియర్. టాలీవుడ్, కోలీవుడ్ గురించి చాలా చెప్పింది. ముఖ్యంగా టాలీవుడ్‌లో కనిపించే ఆడంబరాలు వివరించింది. పైకి ఎంత ఆడంబరంగా కనిపించినా, నటనకి ఎంతో ప్రాముఖ్యం ఇస్తారనీ, అది ఉంటే దక్షిణాదిలో ఇబ్బంది పడనవసరం లేదని చెప్పింది. తన మాట నిజం. ప్రస్తుతం నేను సినిమాలతో బిజీగా ఉన్నాను కనుక బెంగళూరులో ఉన్న మా రెస్టారెంట్ వ్యాపారం అంజలా చూసుకుంటోంది.

## నా భార్య వలనే అవకాశాలు....

కోలీవుడ్, టాలీవుడ్‌లలో నా భార్య అంజలాకి ఉన్న పరిచయాల కారణంగానే నాకు కోలీవుడ్, టాలీవుడ్‌లలో అవకాశాలు వస్తున్నాయన్నది కొందరి ఆరోపణ. అందులో ఏమాత్రం నిజం లేదు. బాలీవుడ్‌లో నేను చేసిన సినిమాలు చూసి కోలీవుడ్‌లో నాకు అవకాశం వచ్చింది. మొదటి సినిమాలో నా నటన నచ్చడంతో వరుస అవకాశాలు వచ్చాయి. ఇక టాలీవుడ్‌లో అయితే నా కోలీవుడ్ సినిమాలు చూసి చిరంజీవిగారి సినిమాలో ఛాన్స్ వచ్చింది. వీటి కోసం నా భార్య



ఎవరినీ కలవలేదు. ఎవరికీ రికమెండేషన్ చేయలేదు. అలాంటి వాటికి నేను పూర్తిగా విరుద్ధం. సినిమాలు లేకపోతే నా వ్యాపారాలు నాకు ఉన్నాయి. బతకడానికి ఎలాంటి ఢోకా లేదు.

## చేస్తున్న సినిమాలు

బాలీవుడ్‌లోకూడా ఇప్పుడిప్పుడే మంచి మంచి పాత్రలు వస్తున్నాయి. రెండు మూడు కథలు వినడం జరిగింది. ఇంకా వేటికీ ఓకే చెప్పలేదు. కోలీవుడ్‌లో రెండు సినిమాలు విడుదల కావలసి ఉంది. మరో రెండు షూటింగ్‌లో ఉన్నాయి. తెలుగులో కొన్ని కథలు డిస్కషన్‌లో ఉన్నాయి. కోలీవుడ్‌లో షూటింగ్‌ల బిజీ కారణంగా ఆ మధ్య తెలుగులో అవకాశం వచ్చినా డేట్లు లేవని చెప్పాను.

## అంజలాతో నటించడం అంటే

బహుశా అది ఇప్పట్లో సాధ్యం కాదేమో! తను హీరోయిన్. నేను విలన్ పాత్రలు చేస్తున్నాను. మా ఇద్దరి కాంబినేషన్ అంత బాగుండదు. ఇద్దరం హీరో హీరోయిన్‌గా చేయడానికి ఛాన్స్ లేదు. సో.... ఇప్పట్లో మేం ఇద్దరం కలిసి నటించలేం. తను తిరిగి సినిమాల్లోకి రావాలనుకుంటే తనిష్టం. అందులో నా ప్రమేయం ఏమీ ఉండదు.

–ఎం.చందన



# నూరుకట్ల పిశాచం కథలు ⑧

-వసుంధర

## మూలిక మహాత్మ్యం

**ఒకానొక గ్రామంలో రమణయ్య అనే పేదవాడు ఉండేవాడు. తల్లిదండ్రులు ఇచ్చిపోయిన ఓ చిన్న పెంకుటిల్లు ఒక్కటే అతడికున్న ఆస్తి. ఆ ఇంటా ఈ ఇంటా పనిచేస్తూ, ఇరుగుపొరుగువారి దయాధర్మంమీద బ్రతుకుతున్నాడు రమణయ్య. చాలా గొప్పగా బ్రతకాలనే కోరిక ఉంది అతనికి. కానీ ఆ కోరిక తీరే మార్గం కనిపించదు.**

ఒకరోజు రమణయ్య తన ఇంట్లో నిద్రపోతుండగా, అర్ధరాత్రి అలికిడైంది. దాంతో మెలకువ వచ్చింది. లేచిచూస్తే, ఎదురుగా తన ఈడు యువకుడొకడు కనిపించాడు. ఇలా అర్ధరాత్రిపూట తనింట్లో చొరబడి నిద్ర పాడుచేసిన ఆ యువకుణ్ణిచూసి, "ఎవరు నువ్వు?" అని అడిగాడు రమణయ్య కోపంగా.

ఆ యువకుడిపేరు మల్లన్న. బ్రతకడానికి ఏ దారీతోచక దొంగతనాలు చెయ్యడం మొదలెట్టాడు. అలా ఒక ఊళ్లో రాత్రిపూట దొంగతనం చేస్తుండగా, ఇంటియజమాని లేచి కేకలుపెట్టాడు. ఎలాగో అక్కణ్ణించి తప్పించుకుని అడవిలోకి పారిపోయాడు మల్లన్న. అడవిలో అతడికి ఒక సాధువు కనిపించాడు. అతడి కథవిని జాలిపడ్డాడు. "ఈ ప్రపంచంలో ప్రతిఒక్కరూ ఏదో ఒకరకంగా దొంగలే, కాబట్టి దొంగతనం తప్పుకాదు" అని అతడికి ఒక మూలిక ఇచ్చాడు. ఆ మూలికని గట్టిగా వాసన పీల్చితే కోరుకున్న రూపం వస్తుంది. అయితే ఆ రూపం ఒక గంటసేపు మాత్రమే ఉంటుంది. ఆ గంటలోనే చకచకా దొంగతనం ముగించుకో. మారిన రూపంలో ఉన్నప్పుడు పట్టుబడినా, పేదవాళ్లని దోచుకోవాలనుకున్నా, నీ అవసరానికి మించి దొంగతనం చేసినా ఈ మూలిక మహత్వం పోతుంది" అని మల్లన్నకు చెప్పాడు సాధువు.

మల్లన్న ఈ కథ రమణయ్యకు చెప్పి, "ఈరోజు ఊరంతా తిరిగాను. చూడ్డానికి ప్రతివాడూ ధనవంతుడిలానే కనిపిస్తున్నాడు. ప్రతివాడూ లేనివాడిలాగానూ కనిపిస్తున్నాడు. ఎవరు ఉన్నవాళ్ళో ఎవరు లేనివాళ్ళో తెలుసుకోవడమెలాగోతెలియక సతమతమౌతుంటే నువ్వు కనబడ్డావు. నువ్వు ఈ ఊళ్లో చాలామంది ఇళ్లల్లో పనిచేయడం చూశాను. నీకు అందరిగురించీ బాగాతెలిసి ఉండాలి. నువ్వు నాకు సహాయపడితే, నా సంపాదనలో సగంవాటా నీకు ఇస్తాను, ఆడితప్పను" అన్నాడు మల్లన్న. అందుకు అంగీకరించాడు రమణయ్య. ఊళ్లోవాళ్ళ గురించి తనకి తెలిసిన వివరాలు చెప్పాడు. మల్లన్న విని ఊరుకోలేదు. అతణ్ణి చాలా ప్రశ్నలు వేశాడు. అన్నింటికీ రమణయ్య ఓపికగా సమాధానాలు చెప్పాడు.

వివరాలన్నీ ఆకళింపు చేసుకున్నాక మల్లన్న మొదటిరోజు ఓ ఇంటిముందు కాపుకాశాడు. ఆ ఇంటి యజమాని ఏదో పనిమీద ఇంట్లోంచి బయటకి వెళ్ళడం చూశాడు. వెంటనే తను ఆ యజమాని రూపం ధరించి లోపలికి వెళ్ళాడు. దొరికినంత డబ్బూ, నగలూ తీసుకుని బయటకు వచ్చేశాడు. ఆ తర్వాత అవసరాన్నిబట్టి ఒకో ఇంట్లో ఒకోరకం వేషంవేసి రోజుకొక దొంగతనం చేశాడు. అలా మల్లన్న ఆ ఊళ్లో పదిరోజులున్నాడు. ఇక తన ఊరికి తిరుగు ప్రయాణమవుతూ, దొంగతనాలుచేసి సంపాదించిన సొమ్మును రెండువాటాలు చేశాడు. అందులో ఒకటి రమణయ్యకిచ్చి, "ఇంత వరకూ నేను సంపాదించి కూడబెట్టిన ఈ సొమ్ముతో నాకు ఐదు ఎకరాల పొలం వస్తుంది. నా గ్రామానికిపోయి వ్యవసాయం చేసుకుంటూ హాయిగా బ్రతుకుతాను" అన్నాడు మల్లన్న.

రమణయ్య అతడికి కృతజ్ఞతలు చెప్పి, "మల్లన్నా! ఇప్పుడీ మూలికను ఏంచేస్తావు?" అనడిగాడు.

"ఇంక నాకు దీని అవసరం తీరిపోయింది. ఈ మూలికను నా జీవితంలో ఒక గుర్తుగా దాచుకుంటాను" అన్నాడు మల్లన్న. "దాచుకోవడం ఎందుకు? నాకిస్తే ఉపయోగించుకుంటానుగా!" అన్నాడు రమణయ్య. "నీకు మాత్రం ఈ మూలిక ఎందుకు? నాతో సరిసమంగా నీకూ డబ్బు ఇచ్చానుగా" అన్నాడు మల్లన్న. "అది నాకు చాలదు. మహా వైభవంగా భాగ్యవంతుల ఇంట జీవించాలని నాకో కోరిక ఉంది. అందుకు ఈ మూలిక ఉపయోగపడుతుంది" అన్నాడు రమణయ్య. "అవసరానికి మించి వాడుకుంటే ఈ మూలిక మహిమ పోతుందని సాధువు చెప్పాడన్నాను కదా. గుర్తులేదా?" అన్నాడు మల్లన్న. "గుర్తుందికానీ ఇంతకాలం నేను ఎంతో తెలివితక్కువగా బ్రతికాను. ఈ మూలిక చూడగానే నాలో ఆశలు రేగుతున్నాయి. దీనిని నేను తెలివిగా ఉపయోగించుకుంటాను. నీకు దీని ప్రయోజనం తీరిపోయింది కనుక, దయచేసి నాకు ఇవ్వు" అని అడిగాడు రమణయ్య. మల్లన్న రమణయ్యను జాలిగాచూసి, సరేనని మూలిక అతడికిచ్చి తన గ్రామానికి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత రమణయ్య తనగ్రామం వదిలిపెట్టి, ఆ మూలికతోసహా పట్నం చేరుకుని ఓ పూటకూళ్లింట్లో బసచేశాడు. అక్కడ పూటకూళ్లవ్వ అతడికి ఒక విశేషం చెప్పింది. ఆ ఊళ్లో కమలాకరుడనే కోటీశ్వరుడైన రత్నాలవ్యాపారి ఉన్నాడు. ఆయన కూతురు రత్నావతి అపురూపసౌందర్యవతి. గంధర్వకన్య శాపవశాన ఆ ఇంటపుట్టిందని ఆమెను చూసిన వాళ్ళంతా అనేవారు. చిన్నప్పటినుంచి వినగా వినగా ఆ మాటలన్నీ రత్నావతికి బాగా ఒంటబట్టాయి. తాను నిజంగానే గంధర్వకన్యనని అనుకుంటోంది ఆమె. తనకోసం గంధర్వుడు వెతుక్కుంటూవస్తాడనీ, అతడినే పెళ్ళిచేసుకుంటాననీ భీష్మించుకుని కూర్చుంది. దాంతో కమలాకరుడికి కూతురువివాహం ఓ పెద్ద సమస్యగా మారింది. ఇది వినగానే రమణయ్య బుర్ర చురుగ్గా పనిచేసింది. అతడు కమలాకరుడి ఇంటికెళ్ళి "నా రత్నావతి ఎక్కడ? వెంటనే నాకు చూపించండి" అని అడిగాడు. కమలాకరుడి ఇంట్లో వాళ్ళందరూ రమణయ్య మాటలువిని ఎంతో ఆశ్చర్యపడ్డారు. "ఎవరు నువ్వు? ఎక్కడనుంచి వచ్చావు?" అని రమణయ్యను అడిగాడు కమలాకరుడు. "నేనొక గంధర్వుడిని. రత్నావతి నా ప్రియురాలు. మేమిద్దరమూ పెళ్ళి చేసుకొనవలెనని అనుకుంటూండగా, ఒక మునిశాపం వల్ల భూలోకంలో ఆమె మీ ఇంట పుట్టింది. నేను రత్నావతిని పెళ్ళి చేసుకుంటానని గంధర్వప్రభువుకి చెప్పుకున్నాను. అయితే, నువ్వూ మనిషివై పోతావని ప్రభువు నన్ను బెదిరించాడు. నేను అందుకు సిద్ధపడ్డాను. అయితే రత్నావతికి నమ్మకం కలిగించడంకోసం, రోజూ ఓ గంటసేపు గంధర్వరూపం ధరించే అవకాశం ఇమ్మని కోరుకున్నాను. ఆయన అంగీకరించాడు. మీరు ఒక్కసారి రత్నావతిని పిలిస్తే, ఆమె ముందు నా అసలు రూపం ప్రదర్శించగలను. ఆమెని చూడాలని నా



